# ఆంధ్రసచిత్రవారపత్రిక

సంపుటి : 83 విజయవాడ వెల: రు.4/-

శక సం. 1912 పుష్య మాసం 21వ తేదీ

సంచిక : 21 11-1-1991 పేజీలు: 76


## విషయానుక్రమణిక

### సీరియల్స్: కథలు



### శీర్షికలు



### సంక్రాంతి శోభ

(ముఖచిత్రం కాశీ)


Chairman S RADHAKRISHNA Editor VEERAJI

Printed and Published by S NAGESWARA RAO for Nageswararao Estates Ltd, at the Andhra Patrika Press Gandhinagar VIJAYAWADA 520 003, Phones Editorial 75667 Business 61247 61248


## సంపాదకీయం

మన దేశానికి యెన్నెన్నో చేదు అనుభవాలు - మానని గాయాలు మిగిల్చిపోయిన 1990 - కేంద్రంలో రెండు మైనారిటీ ప్రభుత్వాలను - రాష్ట్రాలలో అవి ఏర్పడ్డ కారణంగా తలయెత్తిన అస్తవ్యస్త పరిస్థితులను కల్పించింది. ఈ 1990 భారతావనిలో ఒక సంక్షోభ సంవత్సరం - అందర్నీ యేదో వొక రకంగా అది క్షోభకి, ఆవేదనకి గురిచేసింది - అయితే 1990 ప్రపంచంలో గొప్ప గొప్ప మార్పులు తీసుకు వచ్చింది. 1989లో పగిలిన బెర్లిన్‌గోడ మచ్చ కూడా లేకుండాపోయింది. తూర్పు పశ్చిమ జర్మనీలు భూగోళ వాసులందరూ హర్షించేవిధంగా ఏకమై పటిష్టమైన దేశంగా - మళ్ళీ ఐరోపా నాయకత్వానికి సిద్ధమైన జర్మనీదేశం అవతరించింది - ప్రపంచంలో ప్రాక్ పశ్చిమదేశాలు ఐరోపా దేశాలు మరింత సన్నిహితంగా వచ్చాయి! ప్రచ్ఛన్న యుద్ధ మేఘాలు తొలగిపోయాయి జార్జి బుష్, మిఖాయిల్ గోర్బచేవ్‌లు ఆయుధాల గిడ్డంగులను ఖాళీచేయవలసిన అవసరాన్ని గుర్తించి చేతులు కలిపారు. సోవియట్ యూనియన్‌లో ప్రజలు కమ్యూనిజంమీద మోజు పోయి క్రిస్టియన్ మతంవేపు మొగ్గు చూపుతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా వీచిన ప్రజాస్వామ్య ప్రభంజనాలు - జాత్యహంకార క్రూర విన్యాసాలు అజర్ బైజాన్, కజిగిస్తాన్, లాత్వియా, ఇస్తోనియా లాంటి సోవియట్ రిపబ్లిక్‌లలో కూడా తీవ్రంగా వీచాయి. రష్యాలో "నియంతృత్వం" వస్తున్నదన్న హెచ్చరికచేస్తూ మిహాయిల్ గోర్బచేవ్ చిరకాల చెలికాడు - అతి సమర్థుడైన విదేశాంగమంత్రి - మారణాయుధాలకు మంగళారతి పాడగల "స్టార్ట్" ప్రణాళికాయోధుడు శ్రీ షెవర్డ్‌నాడ్జే పదవీసన్యాసం స్వీకరించాడు - నలభై సంవత్సరాల కాలంలో కనీవినీ ఎరుగని తిండిలోటుని సోవియట్ యూనియన్‌లో ప్రజలు అనుభవిస్తున్నారు. చివరికి దక్షిణ అమెరికా దేశాలలో కూడా ప్రజా స్వామ్యంకోసం ప్రజలు నెత్తురు చిందిస్తూవుండగా - భారత దేశంలో మన పాలకులు మాత్రం సుస్థిరమైన, ఆదర్శ ప్రాయమైన పార్లమెంటరీ డెమోక్రసీని వెక్కిరించే స్వార్థ, కుటిల, కుళ్ళు కుతంత్రాలలో నిరంతరం మునిగి తేలుతున్నారు. చివరికి మన ఉపఖండంలోని నేపాల్ దేశంలో జేగీయమానంగా ప్రజాస్వామ్యవ్యవస్థ - నూతన

### అందరికీ శుభాకాంక్షలు

సంక్రాంతి పర్వదిన సందర్భంగా మా పాఠకులకు, ఏజెంట్‌లకు, ప్రకటన కర్తలకు, రచయితలకు మా హృదయపూర్వక శుభాకాంక్షలు! సంక్రాంతి సంచిక కనుక యిందులో మామూలు శీర్షికలు కొన్ని చోటు చాలకపోవడంవల్ల పడలేదు. పై వారం నుంచి యివి యధా ప్రకారం కొనసాగుతాయి

-ఎడిటర్

6414

# ఆంధ్రసచిత్రవారపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

వ్యవస్థాపకులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు సంపాదకుడు శివలెంక శంభుప్రసాద్(1938-1972)

ఛెయిర్మన్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ ప్రింటర్&పబ్లిషర్: శివలెంక నాగేశ్వరరావు

# సంక్షోభం - దాని మరో పేరు-1990

రాజ్యాంగం - ప్రజాపాలన అవతరించింది - బంగ్లాదేశ్‌లో ప్రతిపక్షాలకు నాయకత్వం వహించిన యిరువురు వనితలు - విద్యార్థులు కలసి నియంత ఇర్షాద్‌ను గద్దెదించారు - జియా ఉల్‌హక్‌గారి పాకిస్తాన్‌లోకూడా ఎన్నికలు జరిగి మంత్రి వర్గం ఏర్పడి - ఆ దేశ ఆర్థిక వ్యవస్థను చక్కదిద్దే ప్రయత్నాలు జరుగుతూవుండగా, భారతదేశంలో *1990* ధరల నిటారు పెరుగుదలతో ప్రారంభమైంది - పోస్టల్ రేట్‌లు, రవాణా ఛార్జీలు మొదలు పాల ధరలదాకా అన్నీ పొంగిపోయాయి! "పులిమీద పుట్ర" అన్నట్లుగా "గల్ఫ్ సంక్షోభం" వచ్చి అన్ని రేట్లమీద స్వారీ మొదలెట్టింది - శ్రీ వి. పి. సింగ్ గారి మైనారిటీ గవర్నమెంటు పేకమేడలా ఒక వంక వూగుతున్నా ఆయన మాత్రం "రానున్న ఎన్నికలలో పూర్తి మెజారిటీకి" తనకు లభించిన అవకాశాన్ని వాడుకోవాలన్న దురుద్దేశంతో మొదటినుంచి ప్రవర్తించి - మండల్ కమిషన్ నివేదికను అమలుచేస్తానంటూ దేశ వ్యాప్తంగా మనిషికి మనిషికి మధ్య మంటలు చెలరేగేలాగ చేసి, ఆధునికయుగంలో కనీవినీ ఎరుగని విధంగా విద్యార్థులు ఆత్మాహుతి పరంపరకు కారణభూతుడైనాడు. *1990*లో సంక్షోభానికి వి. పి. సింగ్ తరువాత కారణభూతుడైన మరొక వ్యక్తి లాల్‌కిషన్ అద్వానీగారు ఆయన "రామరథం" ఒక మైనార్టీ ప్రభుత్వాన్ని మట్టేసిందికాని దేశవ్యాప్తంగా మత కలహాలకు ఒక సాకు అయింది. ఉత్తరప్రదేశ్, గుజరాత్, ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరాలలో - పైశాచిక హత్యా కాండలకు, కత్తిపోట్ల ఘాతుకాలకు, దుష్ట రాజకీయ కుతంత్రాలే కారణం - కేంద్రంలో మైనారిటీ ప్రభుత్వం పడిపోగా అసమర్థ పాలనని "మచ్చు"గా కొనసాగిన ఆంధ్రప్రదేశ్‌లో "మెజారిటీ పాలన" కూడా ప్రజల నెత్తుటి మడుగులో తడిసి కూలిపోయింది.

"మైనారిటీగా సంయమనంలేదు. మెజారిటీగా సంతృప్తిలేదు ఛీ! యీ రాజకీయ వాదులకి" - అంటూ ఆబాలగోపాలం యివాళ భారత రాజకీయ పార్టీలను చీదరించుకుంటున్నారు ఆంధ్రప్రదేశ్ అన్ని విధాల ఆనంద దాయకమైన రాష్ట్రం. నైసర్గికంగా చక్కని ప్రాంతం - కాని యిక్కడ నక్సలైట్‌ల కిడ్నాప్‌లు - దహనకాండలు - హత్యలు - అల్లర్లు - అసమ్మతి వర్గాలు వెర్రెత్తిపోయి *1990* సంవత్సరం ఒక మరపురాని గాయమైపోయింది!

అయోధ్యలో రగిలిన బాబ్రీ మసీదు - రామమందిరం తగాదా దేశంలోని అన్ని ప్రాంతాలమీద ప్రభావాన్ని చూపింది. పంజాబ్‌లో దుండగీంద్రు ఆగని ఆగడాలు - మారణహోమాన్ని కొనసాగిస్తూనే వున్నాయి. రాజకీయాలలో నీతి నియమాలు అంతరించి, సిద్ధాంతాలు అడుగంటి రాష్ట్రాలలో కూడా నిత్యన్యూనత కలిగించే రకరకాల గవర్నమెంటులు-అసమ్మతివర్గాలను తృప్తిపరిచే పుష్పక విమాన మంత్రివర్గాలు తల ఎత్తాయి-పంజాబ్‌లో టెర్రరిస్టుల ప్రచ్ఛన్న పరిపాలనకు సిఖ్ఖుల "పంథ్" కమిటీ పరోక్ష దుష్టపాలన తోడై అక్కడ పత్రికల మనుగడ దినదినగండంగా వున్నది-సమస్యల జ్వాలాతోరణం ధరించి-కుల, మత ద్వేష విషధారలను కక్కిన *1990* సంవత్సరం మనదేశానికి ఇంత పిసరు మేలు చేయలేదు- ప్రపంచానికి కూడా మరో ప్రపంచ యుద్ధ భయాన్ని పెట్టిపోయింది. ఇరాన్ మీద సప్తవర్ష సుదీర్ఘపోరాటం సాగించిన-విర్రవీగుతున్న గర్వంతో వున్న-ఇరాక్-చిన్నారి చమురు సంపన్న రాజ్యం "కువైత్"ను గ్రద్దలాగ తన్నుకుపోయింది. ఇరాక్ అధినేత సద్దాం హుస్సేయిన్ నాలుగు మాసాలుగా ప్రపంచ దేశాలన్నీ కలిసి పెట్టుకుంటున్న "మొర" ఆలకించనంటున్నాడు. "సమితి" ద్వారా సద్దామ్ హుస్సేయిన్ లొంగిరాకపోతే బలప్రయోగం చేస్తానంటూ అమెరికా తొందరపడుతున్నది-ఇరాక్ మీదికి జనవరి *15-1991* తరువాత ఏ క్షణాన్నైనా దాడి చేయగల సర్వశక్తి సమన్వితమైన ఐదులక్షల సైన్యం మోహరించివున్నది. సద్దామ్ హుస్సేయిన్ తెచ్చిన పెట్రోలు సంక్షోభం అన్ని దేశాల మీద ధరల భారమై పడివున్నది- *1990*కి వీడ్కోలు పలికి *1991*కి స్వాగతం చెప్తున్న ప్రపంచానికి కొత్త సంవత్సరం వినిపిస్తున్న గంటలు-జనవరి *15*కి "కౌంట్‌డౌన్"గా వినపడుతున్నాయి- ఈ సంక్షోభం నుంచి ప్రపంచాన్ని గట్టెక్కించే శక్తి ఎవరికున్నది- కాలానికి తప్ప? కాలం నిత్యం, కాలం సత్యం, అది ఆగని వేగం-కొత్త క్యాలండర్‌లు కొత్త డైరీలు గ్రీటింగు కార్డులు పంచే ఆంగ్ల సంవత్సరాదికి సద్దామ్ హుస్సేయిన్ జనవరి *15*న ప్రపంచానికి ఏమి కానుక ఇవ్వనున్నాడో-లేదా ఆయనకి ప్రపంచం ఏమి శిక్ష వేయనున్నదో.. ..?!

**29-12-'90**

# నాణ్యమైన నగదు పంటలకోసం



# నమ్మకమైన మీ భవిష్యత్తుకోసం మా షేర్లు.




# ఆంధ్ర ప్రదేశ్‌కి గర్వకారణమైన

పెట్టుబడిదారులు ప్రాస్పెక్టస్‌లోని విషయాలు చదివి పెట్టుబడి నిర్ణయాలను తీసుకోవాలని కోరుతున్నాం

# మా యూరియా.

పంట మేలుగా పెరిగేందుకు మీరెల్లప్పుడూ నాగార్జున యూరియానే నమ్ముకున్నారు ఇప్పుడు ఆ నాగార్జున వారే దానికి మించిన పెరుగుదలకు దోహదం చేసే ఒక అవకాశాన్ని మీకిస్తున్నారు కేవలం పంట కాదు నాగార్జున ధనసాగర్ మీకోసమే ప్రత్యేకంగా నిర్మించబడుతున్న భారీ ఎరువుల కర్మాగారానికి సొంతదారులయే అవకాశం నాగార్జున షేర్లలో పెట్టుబడి పెట్టండి మీరు పండించే నగదు పైర్లకన్న ఎంతో ఆసక్తికరంగా ఉండబోయే దిగుబడి కోసం

ఇంకా వివరాలకోసం మీకు దగ్గరలోగల బ్యాంక్ లేదా నాగార్జున యూరియా డిస్ట్రిబ్యూటర్‌తో సంప్రదించండి







నాగార్జున ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్.

**ఇష్యూకి ముఖ్యమైన సంస్థలు :**




**SBI Capital Markets Ltd.**
Bombay



**CANBANK FINANCIAL SERVICES LTD**
Hyderabad



**Indbank**
**Merchant Banking Services Ltd**
Madras



**J M. Financial & Investment Consultancy Services Ltd**
Merchant Banking Division
Bombay

# నాగార్జునలో పెట్టుబడి పెట్టండి

NAG P 12 2334 TL

# మకర సంక్రాంతి సంబరాలు!

ఆబాల గోపాలాన్నీ అహ్లాదపరిచే మన పండుగల్లో 'సంక్రాంతి' ఒకటి హిందువుల అన్ని పండుగలలాగే ఇదీ ప్రకృతి, మానవునికి సంబంధించిన పండుగ ఖగోళ శాస్త్ర విజ్ఞానంతో ముడిపెట్టబడిన పండుగ కూడా. నవగ్రహాలలో కేంద్ర బిందువు హిందువులకు ప్రత్యక్ష ఆరాధ్యదైవం అయిన సూర్యుడు సంక్రాంతి నాటినుంచి ద్వాదశ రాసుల్లోని మకరంలో ప్రవేశించి ఉత్తర ముఖంగా తన రథయాత్రను మరల ఆరు నెలల వరకు కొనసాగిస్తాడు ఈ కారణంచేతనే "సంక్రాంతి"ని కొందరు మకర సంక్రాంతి అని కూడా అంటారు ఇక్కడ నుంచి ఉత్తరాయణం ప్రారంభమవుతుంది

సంక్రాంతికముందు నెల రోజులు నెల పట్టుగా కొన్ని ప్రాంతాలలో భావించి, ఇంటిముందు ముగ్గులు పెట్టి, గొబ్బెమ్మలు పెడ్తారు

సామాన్యంగా సంక్రాంతి జనవరి 14వ తారీఖు ప్రాంతంలో వస్తూ వుంటుంది ఆనాటికి పంటలు పండటం అవుతుంది రైతు పండిన పంటను ఇంటికి చేర్చుకొని కాస్తంత విశ్రాంతిగా శ్రమఫలం చేతికందిన ఉల్లాసంతో ఉంటాడు అందుచేత దీనిని కొతల పండుగగా భావించినప్పటికీ ప్రధానంగా ఇది సూర్యుని ప్రయాణాన్ని తద్వారా ఖగోళ విజ్ఞానాన్ని తెలిపే పండుగ



## సూర్యుని గమనం!

భారతీయ జ్యోతిష శాస్త్రవేత్తలు ద్వాదశ రాసులతో కూడిన సూర్య మార్గాన్ని ఉత్తరాయణం అని దక్షిణాయనమని రెండుగా విభజించారు సంక్రాంతితో ఉత్తరాయణం ప్రారంభమవుతుంది అయన శబ్దానికి మార్గమని అర్థం హిందువులకు ఉత్తరము దేవతల దిక్కు దక్షిణము యముని దిక్కుగా పరిగణిస్తారు ఉత్తరాయనము దేవయానము దక్షిణాయనము పితృయానము సూర్యుని ప్రయాణాన్ని మకరం నుంచి కర్కాటకం వరకూ ఉత్తరాయణ పుణ్యకాలంగా భావిస్తారు సమస్త శుభకార్యాలకు ఉత్తరాయణం ఉత్తమమైన కాలంగా వారు భావిస్తారు ఈ ఉత్తరాయణ పుణ్యకాలానికై నిరీక్షిస్తూ భీష్ముడు అంపశయ్యపై శయనించడం పురాణ ప్రసిద్ధమైన అంశం అందరకు తెలిసినదే!

ఎస్. మైత్రేయి, విజయవాడ





## ప్రధానంగా మూడు రోజులు!

ఆంధ్రులు సంక్రాంతి పండుగను మూడు రోజులు భోగి, సంక్రాంతి, కనుమగా జరుపుకుంటారు 'భోగి' అనే శబ్దం సమృద్ధినీ ఆనందానుభవాన్ని వెల్లడి చేస్తుంది పంట ఇంటికి వస్తుంది గనుక అంతా ఆనందమే భోగినాటికి పూర్వకాలం రాక్షస కాలం అది భోగి నాటితో అంతమవుతుంది భోగి రోజు తెల్లవారకముందే నిద్రలేచి అంతా భోగి మంటలు వేసుకొని తలంటుపోసుకుంటారు భోగినాడు సాయంత్రం పిల్లలచేత బొమ్మలు పెడ్తుస్తారు

## బొమ్మలనోము!

కొన్ని ప్రాంతాల్లో భోగినాడె స్త్రీలు గవురమ్మను పెట్టి వంటాలు చేసుకుంటారు గౌరమ్మపూజ మూడు రోజులు చేసి కనుమనాడు సాయంత్రం నదుల్లోనో కాలువల్లోనో ఆమెని ఊరేగిస్తారు భోగినాడు సాయంత్రం పసిబిడ్డలకు రేగిపండ్లు పోసి ముత్తైదువులకు వాళ్లచేత తాంబూలాలిప్పించి వారి దీవెనలు ఇప్పించడం కూడా ఒక ఆచారం ఆంధ్రదేశ్‌లోని మరికొన్ని ప్రాంతాలలో కనుమ పండుగనాడు మాటి పశువులు బొమ్మల కొలువు పెట్టి సాపిత గౌరి దేవి తొమ్మిది రోజులు నోము పడతారు తొమ్మిదవ రోజు మట్టితో చేసిన ఆ బొమ్మ లను కాలువలో నో నూతుల్లో నో నిమజ్జనం చేస్తారు

## పెద్దల పండుగ

సంక్రాంతిని పిత్రు పండుగా భావిస్తారు ఆనాడు స్వర్గ ద్వారాలు విడిపడతాయని ఆర్యోక్తి పుణ్య తీరాల్లో నదీ తీరాల్లో నది ముఖాలలో సముద్రంలో చేరి స్నాన సంధ్యాద్యనుష్ఠానాలను తీర్చుకొని పిత్రు దేవతలకు పుణ్యలోకప్రాప్తి కై తిల తర్పణాదులు పతపడం ఒక సంప్రదాయం

## పశువుల పండుగ

సంక్రాంతి మరునాడే కనుమ యావద్భారత దేశంలో పశువులకు ఆరోజు గోపూజ చేస్తారు ఇదే పశువుల పండుగ పంటలు బాగా పండటానికి తోడ్పడిన పశువులను పూజించి రైతు తన కృతజ్ఞతలు తెలుపుకోవడం సముచితం పశువులకు స్నానం చేయించి పసుపు కుంకుమంతో అలంకరించి పొంగలిచ్చి బియ్యం పప్పు బెల్లంతో పులగం వండి పశువులకు నైవేద్యాలు పెడతారు

## రజకుల పండుగ

కనుమ వెళ్లిన మరునాడు ముక్కనుమనుంచి రజకులు బల్లల పూజ చేసుకుంటారు గ్రామీణ ప్రాంతాల్లో నెల రోజులుపాటు రజకులు బట్టలు తీసుకుపోవడంకాని తెచ్చుకురావడంకానీ చేయరు ఆ



"గడప గడపకి- గంగిరెద్దు"

చిత్రం: వెల్లటూరి పూర్ణానంద శర్మ, వెల్లటూరు

నెల రోజులు వారు చాకి రేవు బల్లల పూజ చేసుకుంటారు ఇది కొన్ని ప్రాంతాల్లో 15 లేదా 20 రోజులపాటు ఆయా ప్రాంతాల ఆచారాలబట్టి జరుపుకుంటారు పట్టణాల్లో సిటీలో ఉన్న ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా మూడు లేక వారం రోజులపాటు ఈ పండుగ జరపడం ఆచారంగా వుంది. చనులు మానుకుని పూజ చేసలో ఉన్న రజకులకు బియ్యం ఉప్పు వగైరా ఆహార వస్తువుని కూడా గ్రామాల్లో సమకూర్చడం జరుగుతుంది

ఎక్కడ ఎన్ని రోజులు జరుపుతాం నేది పక్కనపెడి కానీ ఇది వారి వృత్తిని గౌరవించి ఆరాధించే సాంప్రదాయం కుల వృత్తుల పట్ల ఆ కులాలవారేగాక ఇతర కులాలవారు సహితం గౌరవించే చక్కని ఆచారానికి ఇది ఒక తార్కాణం

అందరిని ఆనంద డోలికలలో ఆలరించే పండుగ సంక్రాంతి పండుగ

-ప్రమీల



అన్నపూర్ణ, చిత్తూరు

ఎస్. మైత్రేయి, విజయవాడ





అన్నపూర్ణ, చిత్తూరు

సీరియల్



# నేత్రధనుస్సు

## సాతవాహన

**ఇంతవరకూ సాగినకథ-9:** డేగర్ ముఠా సి.బి.ఐ.ఆఫీసర్ యశ్వంత్‌కుమార్ కూతురు మనోజను కార్చిచంపి అతన్ని కిడ్నాప్ చేస్తుంది. ఈ సంఘటనపై ఇన్‌స్పెక్టర్ కార్తికేయ దర్యాప్తు ప్రారంభిస్తాడు గతంలోని సి.బి.ఐ. ఆఫీసర్ల ఆచూకీపై దర్యాప్తు చేస్తున్న ఫైలును అందజేయమని ముఠా నాయకుడు చిదానందం యశ్వంత్‌ను బలవంత పెడతాడు. బాధల్లో వున్న నయనతారకు ధైర్యం చెప్పేందుకు పూర్ణిమ మేడమ్ రాగా అనాధశరణాలయంలో తాను గడిపిన రోజుల్లో చిదానందం కొడుకు ముద్దుచేసిన ఆగడాలు గుర్తొస్తాయి.

(గత సంచిక తరువాయి)

**ఆ రోజు జరుగుతున్న శరణాలయ వార్షికోత్సవానికి ఓ ప్రత్యేకత వుంది. ఓ ప్రముఖ మాజీ సైనికాధికారి రిటైర్డ్ ఆర్మీ ఆఫీసర్స్ అసోసియేషన్ తరఫున శరణాలయానికి ఆ రోజు అయిదు లక్షల రూపాయల పర్స్ అందజేయబోతున్నాడు.**

ఆ మాజీ సైనికాధికారి మరెవరో కాదు- పరమవీర చక్ర గ్రహీత మేజర్ చక్రవర్తి.

ప్రతి ఏడాదీ ఆ అసోసియేషన్ తమకు నచ్చిన ఓ సేవా సంస్థకు అయిదు లక్షల రూపాయల పర్సు అందజేస్తుంది. సైన్యానికి విశిష్ట సేవ చేసిన ఓ సైనికాధికారి ఆ పర్సును ప్రెజెంట్ చేస్తాడు ఈసారి మేజర్ చక్రవర్తి చేతి మిదుగా పర్సు అందజేయడం జరుగుతోంది

సభ ప్రారంభం కావడానికి ముందు మాజీ సైనికాధికారులు ఫుల్ యూనిఫాంలో ఒక్కొక్కరే వచ్చి డయాస్ ఎదుట ముందు వరసలో ఏర్పాటు చేసిన కుర్చీల్లో వచ్చి కూర్చున్నారు వాళ్ళలో మేజర్ చక్రవర్తి కూడా వున్నాడు. అప్పటికే ఆహూతులతో శరణాలయం ఆవరణ పూర్తిగా నిండిపోయింది. మేజర్ చక్రవర్తి పక్కనే ఆయన కొడుకు యశ్వంత్ కూడా వున్నాడు

కొద్ది సేపట్లో చిదానందం డయాస్ మీదికొచ్చాడు

"వణక్కం అందరికీదా స్వాగతం", అన్నాడతను.

తర్వాత ప్రముఖులందర్నీ వేదిక మీదికి రావల్సిందిగా ఆహ్వానించడం జరిగింది. మేజర్ చక్రవర్తి వేదిక మీదికి వెళ్తూనే చప్పట్లు మార్మోగిపోయాయి. పరమవీర చక్ర గ్రహీతగా చాలా పాపులర్ వ్యక్తి ఆయన. వేదిక మీదికొచ్చిన ప్రముఖుల్లో కొందరు ముఖ్యమైన రాజకీయ నాయకులు కూడా వున్నారు

ఒక్కొక్కరే వచ్చి వేదిక మీది ప్రముఖులకు దండలు వేస్తున్నారు

చివర్లో తలకు గాంధీ టోపీ పెట్టుకున్న ఓ వ్యక్తి చేతిలో దండ పట్టుకుని వేదిక మీదికొచ్చాడు.

"సభకు నమస్కారం. నా తరఫు నుంచి ఈ దండ శ్రీశ్రీశ్రీ చావుబేరం... కాదు కాదు, చిల్లర బేరం . చ చ, దీనబంధువు చిదానందం గారికి సమర్పించుకుంటున్నాను", అన్నాడతను.

అతని తడబాటుకు జనంలోంచి నవ్వులు వినిపించాయి అంతలోకే అందరూ చప్పట్లు కొట్టనారంభించారు

అతని చేత దండ వేయించుకుంటున్న వాడల్లా చిదానందం ఫురిమి చూశాడు

"చావు బేరమూ, చిల్లర బేరందా చెబుతూ యేమిదా వాగుచుంటివి?" అతనికి మాత్రమే వినిపించేలా అన్నాడు

"క్షమించాలి బాబూ, క్షమించాలి. నోరు జారిపోయింది", గొణిగాడతను.

"పూ. దండదా సరిగ్గావేయుమీ"

"విత్తం బాబూ! నా సారా కాంట్రాక్టు విషయం మినిస్టర్ గారితో మాట్లాడారా?"

"ఆ విషయందా అడగడానికి ఇదియేనా నేరం?" మళ్ళీ ఫురిమి చూశాడు చిదానందం.

"నేరమా?" అయోమయంగా చూశాడతను

"టైమయ్యా టైము".

"పొరపాటై పోయింది బాబూ,

పొరపాటైపోయింది. మరో టైంలో వచ్చి అడుగుతాను"

"వూఁ ఇంక దిగుమీ అందరూ నీ వైపు దా చూస్తా వుండారు."

ఆ వ్యక్తి హడావుడిగా వేదిక మీద నుంచి దిగిపోయాడు.

చిదానందం ఓసారి పొడిగా దగ్గి జనం వైపు తిరిగాడు

"మహా జనంగళ్, ఈ దినం నిండా సుదినం. మేజర్ చక్రవర్తి వంటి పెరియవర్ మన మధ్యదా వుండారు. అవర్ మన మధ్యదా వుండడమే మా శరణాలయందా ఎట్లాంటి సేవాసంస్థయో తెలుపుతా వుండాది మా శరణాలయందా ఎంత పెరియదో మీకుదా నేను చెప్పేది అవసరం లేదు. నేనుదా ఇంతకంటే హెచ్చు మాటలు చెప్పడం లేదు. ఇంక మేజర్ చక్రవర్తి వాడు మాట్లాడతాడు", అంటూ కూర్చున్నాడు.

జనం గట్టిగా చప్పట్లు కొట్టారు. చిదానందం భాషకు ఎవరూ నవ్వలేదు. దానిక్కారణం వుంది ఆ భాష మాట్లాడేటప్పుడు అతను క మెడియన్లా వుండడు. చాలా సాదా సీదాగా, మామూలుగా వుంటాడు.

చిదానందం కూర్చుంటూనే మేజర్ చక్రవర్తి లేచి నిలబడ్డాడు.

"ఫ్రెండ్స్, నేను మిలిటరీవాడ్ని.



# నేత్రధనుస్సు

నాకెక్కువగా వుపన్యాసాలిచ్చే అలవాటు లేదు. అయితే వుపన్యాసాలు మాత్రం చాలా విన్నాను. కొన్ని వుపన్యాసాలెలా వుంటాయంటే ఒకసారి నేనో వుపన్యాసం వినడానికి వెళ్ళాను. కుటుంబ నియంత్రణ గురించి ఆ రోజు ఓ పెద్దమనిషి సరిగ్గా రెండు గంటలు మాట్లాడాడు. ఇంతకీ వుపన్యాసం కుటుంబ నియంత్రణ ప్రచారం కోసం కాదు, ఓ ఎలిమెంటరీ స్కూలు సాధించిన ప్రగతి గురించి! వుపన్యాసం వింటున్న వారిలో తొంభై శాతం పసిపిల్లలే!"

జనంలో నవ్వులు వెల్లివిరిశాయి.

మేజర్ చక్రవర్తి కాసేపాగి మళ్ళీ చెప్పనారంభించాడు-

"ఓసారి ఓ పెద్దమనిషి మైకు పట్టుకుని వుపన్యాసం ప్రారంభించాడు. ఆయనగారి వుపన్యాసం అయిపోతూనే జనంలోంచి మరో పెద్ద మనిషి పరిగెత్తుకుంటూ వచ్చి ఆయనకు దండ వేశాడు.

ఓహో నా వుపన్యాసం ఎంత గొప్పగా వుందో కదా అని మురిసి పోతూ ఆ పెద్దమనిషి అడిగాడు గదా- 'అయ్యా, అందరూ వుపన్యాసం మొదలెట్టబోయే ముందు దండ వేస్తారు. కానీ మీరు వుపన్యాసం పూర్తయ్యాక దండవేశారు. నా వుపన్యాసం అంత బావుందా?'

"దానికా దండ వేసిన పెద్దమనిషి ఇలా సమాధానం చెప్పాడు-

'మహానుభావా, మీరు వుపన్యాసం ప్రారంభించబోయే ముందు నేనో కోడిపెట్టను తీసుకొని ఇక్కడి కొచ్చి కూర్చున్నాను మీరు వుపన్యాసం ప్రారంభిస్తుండగా నా కోడిపెట్ట గుడ్డు పెట్టింది మీరు వుపన్యాసం పూర్తి చేసే వేళకు గుడ్డు పొదిగి కోడిపిల్ల కూడా బయటికొచ్చేసింది అందుకే మీకు దండ వేశాను", అన్నాడు".

ఈసారి జనం పగలబడి నవ్వనారంభించారు

"కాబట్టి, మీలో ఎవరైనా పొరపాటున కోడిపెట్ట వెంట తెచ్చి వుంటే అది గుడ్డు పెట్టి పిల్లలయ్యేంత వరకూ నేను మాట్లాడదల్చుకోలేదు".

జనం మళ్ళీ నవ్వారు.

మేజర్ చక్రవర్తి మొహం సీరియస్‌గా మారింది.

"అయినా ఈ శరణాలయం గురించి ఒక్క మాట చెప్పదల్చుకున్నాను. నేనో సైనికుణ్ని. ప్రభుత్వం నాకు పరమవీరచక్ర పతకం కూడా ఇచ్చింది. అయితే ఫ్రెండ్స్, ఈ పతకం నాకు యుద్ధంలో ఎన్నో దయనీయమైన దృశ్యాలు గుర్తుకు తెస్తుంది. శత్రువుల దాడిలో కాళ్ళు పోగొట్టుకున్న వారు, కళ్ళు పోగొట్టుకున్న వారు, చేతులు పోగొట్టుకున్న వారు- ఇలాంట క్షతగాత్రులెందరినో ఈ భుజాల మీద మోసుకుని ఎన్నోసార్లు నేను మిలటరి హాస్పిటల్‌కు చేర్చాను.

"అలాంటి వికలాంగుల శారీరక మానసిక పరిస్థితులేమిటో నాకు బాగా తెలుసు. వికలాంగులు కావడం ఒక శాపం మైడియర్ ఫ్రెండ్స్. అయితే ఆ శాపం మనిషిని కృంగదీయకూడదు. వారిలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించే స్వచ్ఛంద సంస్థలు ఇంకా ముందుకు రావాలి. వారి అంగవైకల్యం మానసిక వైకల్యానికి దారితీయకుండా కాపాడాలి. అలాంటి స్వచ్ఛంద సంస్థలకు అందరూ ఇతోధికంగా సాయపడాలి.

"ఈ దేశంలో ఆడపిల్లగా పుట్టడం ఒక శాపం. ఆడపిల్లగా పుట్టడమే కాక, తనకు అంగ వైకల్యం కూడా సంప్రాప్తించడం అంతకన్నా పెద్ద శాపం. ఈ శరణాలయం అలాంటి ఆడపిల్లలకు ఆశ్రయమిచ్చి వారిలో మానసిక స్థైర్యాన్ని కలిగించడానికి పూనుకోవడం చాలా గొప్ప విషయం. అందుకే మా రిటైర్డ్ ఆర్మీ ఆఫీసర్స్ అసోసియేషన్ ఈ శరణాలయానికి అయిదు లక్షల రూపాయల పర్సు ఇవ్వడానికి ముందుకొచ్చింది. ఈ అయిదు లక్షల రూపాయలు ఈ ఆడపిల్లలకు మనో బలం కల్పించడంలో ఖర్చవుతాయి.

"వికలాంగులైనంత మాత్రాన ఎవరూ నిస్పృహపాలు కావడానికి వీల్లేదు వికలాంగులు కూడా పైకి రావడానికి సమాజం తగిన సహాయ సహకారాలు అందించాలి. అప్పుడే వీళ్ళు తమ అంగవైకల్యాన్ని మర్చిపోయి దేశ ప్రగతిలో తామూ పాలుపంచుకుంటారు. ఈ దేశాన్ని తప్పకుండా పైకి తెస్తారు."

జనం హోరుమంటూ చప్పట్లు కొట్ట నారంభించారు.

చప్పట్ల మధ్య మేజర్ చక్రవర్తి అయిదు లక్షల రూపాయల పర్సు చిదానందానికందించి షేక్‌హాండిచ్చాడు.

ఆ తర్వాత వినోద కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి.

"సభాసదులారా! మా కార్యక్రమాన్ని మొట్టమొదట ఓ లలిత గీతంతో ప్రారంభిస్తున్నాం. పాట పాడుతున్నవారు కుమారి నయనతార", ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

నయనతార!

## అనురాగం

నీ మనోమైక్రోస్కోప్‌తో-
నా గుండెలోకి తొంగిచూడు .
రక్త కణాల్తోపాటు
ప్రేమ వెల్లువలా-
ప్రవహిస్తోంది కదూ!
సిరల్లో నీ స్మృతులు...
ధమనుల్లో నీ దర్శనం!
అణువణువులో-
నీ అనురాగం...
లబ్‌డబ్ మనే శబ్దంలో
"లవ్ మీ" అనేరాగం
స్టెతస్కోప్ లేకుండానే-
నీ చెవినాడుల్లోకి
నాదమై మోగుతోందికదూ!
నీ గుండె సౌండ్‌ప్రూఫ్‌గా
మారకముందే-
అలవై ఎగిసి-
లయవై పొదిగి-
తరంగమై నాలో-
"లీనం" చెందుతావుకదూ!!

- కె. అంజయ్య

ఆ పేరు వింటూనే ప్రేక్షకుల్లో కూర్చున్న యశ్వంత్ ఉలిక్కిపడి ఆత్రంగా వేదిక వైపు చూశాడు.

నయనతార నెమ్మదిగా వేదిక మీదికొచ్చింది.

మైక్ వైపు నడుస్తుంటే ఆమె తేజస్సు వేదికవంతా ప్రకాశింపజేస్తోంది. ఆమె అంధురాలని ప్రేక్షకుల్లో ఏ ఒక్కరికీ అనుమానం కూడా రాలేదు.

నయనతార పాట ప్రారంభించింది.

మొదట సన్నని రాగంతో ప్రారంభమైన ఆమె పాట క్రమంగా మహోధృత స్థాయినందుకుంది.

ప్రేక్షకులందరి మీదా సంగీతజాలమేదో కప్పేసినట్టుగా అయిపోయింది. ప్రతి ఒక్కరూ ఆనందపారవశ్యంతో నిశ్శబ్దంగా కూర్చున్నారు.

పుట్టుకలో వికలాంగుడు మానవుడు-
నడవలేడు, పలకలేడు, కళ్ళు విప్పి
చూడలేడు.
మనిషీ ఓ మనిషీ, సాటి మనిషికి
సాయపడు-
నడవగలడు, పలకగలడు, కళ్ళు విప్పి
చూడగలడు'.

- నయనతార పాడుతుంటే యశ్వంత్ హృదయం పూర్తిగా రాగరంజితమైపోయింది. ఆమె పాట పూర్తి చేస్తూనే అందరికంటే ముందు అతనే గట్టిగా చప్పట్లు కొట్టనారంభించాడు. అతని వెనకే మిగతా వాళ్ళందరూ కొట్టిన చప్పట్లతో ఆ ఆవరణ మొత్తం హోరెత్తిపోయింది.

చప్పట్లు కొడుతున్న వాళ్ళలో ముద్దు కూడా వున్నాడు. అతని కళ్ళు నయనతారను తినేసేలా చూస్తున్నాయి.

చప్పట్ల మధ్య నయనతార వేదిక మీంచి దిగేస్తూనే అతను నిరుత్సాహంగా అటూ ఇటూ చూశాడు. అకస్మాత్తుగా అతని కళ్ళు వసంతని చూస్తూనే ఆగిపోయాయి.

చేతి కర్రల సాయంతో ఓ మూలగా నిలబడి వుంది వసంత.

ముద్దు తన వైపు చూస్తుంటే ఆమె పలకరింపుగా నవ్వింది. ఆ నవ్వు చూస్తూనే ఒక్కసారిగా విస్తుపోయాడు ముద్దు. ఆమె కళ్ళలో ఆహ్వానం కనిపిస్తూనే పూర్తిగా తలకిందులై పోయాడతను.



## సల్మాన్ తలబిరుసు

'మైనే ప్యార్ కియా' హీరో సల్మాన్‌ఖాన్ చాలా తలబిరుసుగా వ్యవహరిస్తున్నాడట. కారణం ఆ చిత్రం విజయవంతం కావడమే అది హిట్ అయినప్పట్నుంచి సల్మాన్ నిర్మాతల్ని లెక్కచెయ్యటం లేదు సరికదా బచ్చన్‌లాగా ఫీలయి పోతున్నాడు స్త్రీలోలుడైన (ప్రస్తుతం సంగీతా బిజలానీ లైన్లో వుందట) సల్మాన్ పట్ల నిర్మాతలెవ్వరూ అంత శ్రద్ధ చూపటం లేదు ఒక్క చిత్రం హిట్ అయినంత మాత్రాన సూపర్ స్టార్ అయిపోయానని అనుకోవటం అంత మంచిది కాదని పెద్దలు సలహా యిచ్చారు కాని ఆ సలహా పాటించాలిగా

వసంత అలా నవ్వుతూనే వెనక్కి తిరిగి లైబ్రరీ వున్న వైపు వెళ్ళసాగింది.

ఆ వైపు ఎవరూ లేకపోవడం అక్కడ్నుంచే గమనించాడు ముద్దు. వెంటనే ఒకసారి కాలర్ సర్దుకుని ఆ వైపు కదిలాడు. అతన్లో ఎక్కడలేని వుత్సాహం వచ్చేసింది.

ముందుకు వెళ్తున్నదల్లా వసంత ఒకసారి ఆగి వెనక్కి తిరిగి చూసింది.

ఆమె పెదవుల మీద అదే నవ్వు.

ఐస్సైపోయాడు ముద్దు.

ఆమె తల అవతలికి తిప్పేసుకుని చేతి కర్రల సాయంతో తిన్నగా లైబ్రరీలోకి వెళ్ళిపోయింది.

ముద్దు ఒకసారి దొంగచూపుల్తో అటూ ఇటూ చూసి చటుక్కున ఆమె వెనకే లైబ్రరీలో దూరిపోయాడు.

అక్కడెవరూ లేరు. వసంత మాత్రం ఒంటరిగా ఓ పుస్తకాల ర్యాక్ దగ్గర అవతలికి తిరిగి నిలబడి వుంది.

ఆమెను చూస్తూనే స్టైల్‌గా ఓ నవ్వు పారేశాడు ముద్దు.

"అవ్వా, నాకు తెలుసు-నువ్వొప్పుకుంటావ్. మొత్తానికి భలే ప్లానేశావ్ మైడియర్ వసంతా. అందరూ అక్కడ ప్రోగ్రామ్‌లో వుండగా నువ్వు గప్‌చుప్‌గా ఇక్కడ ప్రోగ్రామ్ సెటప్ చేసేశావ్. నీ తెలివే తెలివి", అంటూ సంబరంగా ఆమె భుజం మీద చెయ్యేసి తన వైపు తిప్పుకున్నాడు.

తన వైపు తిరుగుతూనే ఆమె మొహంలో కనిపించిన భావాలు చూసి అప్రయత్నంగా ఒకడుగు వెనక్కి వేశాడతను. ఆమె మొహంలో అతనికి కక్ష, క్రోధం, ఆవేశం అన్నీ ఒక్కసారి ముప్పిరిగొన్నట్టనిపించాయి.

వసంత హఠాత్తుగా అరవనారంభించింది-

"కాపాడండి కాపాడండి".

ముద్దు అదిరిపోయాడు.

కంగారుగా వెనక్కి తిరిగి గుమ్మం వైపు పరిగెత్తబోతూ కాళ్ళు నేలకంటుకుపోయినట్టుగా ఆగిపోయాడు.

ఎదురుగా పదిమంది అమ్మాయిలు అపర కాళికాదేవి అవతారమెత్తినట్టుగా నిలబడి వున్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ లావాటి పుస్తకాలున్నాయి. ఆ పుస్తకాలని వాళ్ళు ఒక్కసారిగా అతని మీదికి విసిరికొట్టేశారు.

ముద్దు తప్పించుకోబోయాడు. అయితే ఈలోపలే హార్డ్ బైండింగ్ చేసిన ఆ పుస్తకాలు బండరాళ్ళలావచ్చి అతని నెత్తిమీద పడిపోయాయి. ఆ మరుక్షణం వాళ్ళందరూ ఒకసారి ముందు కొచ్చేసి నలు వైపుల్నుంచీ అతన్ని చుట్టేశారు.

ఒకమ్మాయి అతని జుట్టు పట్టుకుని గుంజింది. మరో అమ్మాయి అతని కాలర్ పుచ్చుకుని లాగింది. ఇంకో అమ్మాయి అతని చొక్కా పట్టుకుని పరపరా చింపేసింది.

ఇద్దరమ్మాయిలు అతని మొహాన్ని చిరుత పులుల్లా మీదపడి రక్కేశారు.

"వదలండి వదలండి... వదలండి [illegible] వదలండి" అరుస్తున్నాడు

# డెంటల్ హెల్త్ క్విజ్ - (12)

1. మండుతున్న నాలుకను యిలా పిలుస్తారు.
(ఎ) బర్నింగ్ టంగ్ (బి) పెయిన్‌ఫుల్ టంగ్ (సి) గ్లాసోడైనియా.

2. సిఫిలిస్ వ్యాధి, మూడవస్థాయిలో, అంగుటికి రబ్బరు మాదిరిగా ఏర్పడే కంతిని యిలా పిలుస్తారు..
(ఎ) అంగుటి కంతి (బి) గమ్మా (సి) అంగుటి కురుపు.

3. పెదవిచుట్టూరా పొక్కులను (కోల్డ్‌సోర్) కలిగించే వైరస్ -
(ఎ) హెర్పిస్ సింప్లెక్స్(బి) హెర్పిస్ జోస్టర్ (సి) హెర్పిస్ లేబియాలిస్.

4. చిన్న పిల్లల దవుడల్లో అనేక చీము తిత్తులు యేర్పడి, ముఖం వెడల్పుగా కన్పించే వ్యాధిని యిలా పిలుస్తారు.
(ఎ) చెరుబిజం (బి) మంప్స్ (సి) ఇడీమా.

5. నోటిలోని వల్లనన్నింటినీ తీసివేయడాన్ని యిలా పిలుస్తారు.
(ఎ) టోటల్ ఎక్స్‌ట్రాక్షన్ (బి) క్లియరెన్స్ (సి) ఎక్స్‌ట్రాక్షన్.

6. దంత వైద్యపరంగా, నేర పరిశోధన విజ్ఞానాన్ని యిలా పిలుస్తారు.
(ఎ) క్రిమినల్ డెంటిస్ట్రి (బి) ఫొరెన్సిక్ ఒడంటాలజి (సి) ఫొరెన్సిక్ మెడిసిన్.

7. పైదవుడ-పల్లకు, చిగుళ్లకు సరఫరా అయ్యే నరాలు -
(ఎ) ట్రియిజిమినల్ నరంలో 'మాక్సిలరిశాఖ' (బి) ట్రియిజిమినల్ నరంలో 'మాండిబులరిశాఖ' (సి) ఫేషియల్ నరం.

8. విపరీత ఆలోచన, మానసిక ఆందోళనలవల్ల వచ్చే నోటి వ్యాధి. ఇది చర్మం మీద కూడ వస్తుంది.
(ఎ) లికోప్లేకియా (బి) ఫయిబ్రోసిస్ (సి) లైకన్ ప్లానస్.

9. ఈ వ్యాధిగ్రస్తులకు పల్లు తీసే విషయంలో కొన్ని ప్రత్యేక జాగ్రత్తలు అవసరం అవుతాయి.
(ఎ) హిమోఫీలియా (బి) పైరెక్సియా (జ్వరం) (సి) లెప్రసి (కుష్టు).

10. అతుక్కునే గుణంగల ఆహార పదార్థాలు -
(ఎ) పంటి వ్యాధిని కలిగిస్తాయి (బి) ఆరోగ్యాన్ని కలిగిస్తాయి (సి) రుచిగా వుంటాయి.

-డా. కె.ఎల్.వి. ప్రసాద్

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| సి | బి | సి | ఎ | బి | బి | ఎ | సి | ఎ | ఎ |

— జవాబులు —

ము...

సరిగ్గా అదే సమయంలో నయనతార పూర్ణా మేడమ్‌ని వెంటబెట్టుకుని అక్కడి కొచ్చేసింది.

అంతకుముందు తన పాట అయి పోతూనే నేరుగా పూర్ణామేడమ్ దగ్గరి కెళ్ళిపోయిందామె.

"మేడమ్, మీరొకసారి నా వెంట ుండి"

"ఎందుకమ్మా? ఇక్కడ నాకింకా పనులున్నాయి" అంది పూర్ణామేడమ్.

"లేదు మేడమ్, అంతకంటే ముఖ్య మైన పని మీకు మరొకటుంది. నా వెంట రండి" అంటూ ఆవిడ చెయ్యి పట్టుకుని లైబ్రరీ వైపు లాక్కెళ్లిపోయిందామె.

పూర్ణామేడమ్ విస్మయంగా ఆమె వెనకే లైబ్రరీలో కెళ్ళింది. ఎదురుగా కనిపించిన దృశ్యం చూస్తూనే ఆమె నోరు తెరి చేసింది.

పదిమంది ఆడపిల్లల మధ్యన ముద్దు చింపిరి బట్టల్తో, చెదిరిపోయిన జుట్టుతో, మొహంమీద రక్కుల్తో అడుక్కుతినేవాడిలా వున్నాడు. ఓ కన్ను అప్పటికే వాళ్ళు కొట్టిన దెబ్బలవల్ల నల్లబడిపోయింది.

"ఆపండి, ఏమిటది? ఏమైంది?" కంగారుగా ముందు కొచ్చేస్తూ అతన్ని వాళ్ళ మధ్యనుంచి పక్కకు లాగేసింది పూర్ణామేడమ్.

"ఆ విషయం నన్నడగండి, నేను చెబుతాను" అంటూ ముందు కొచ్చింది నయనతార.

పూర్ణామేడమ్ ఆశ్చర్యంగా ఆమె వైపు తిరిగింది.

నయనతార ఆవిడకు ముద్దు వసంతను అవమానించడం దగ్గర్నుంచీ ఇప్పటిదాకా ఏం జరిగిందో వర్సగా చెప్పుకొచ్చింది. అంతా విన్న పూర్ణా మేడమ్ క్రోధంగా ముద్దు వైపు చూసింది.

"నయనతార చెప్పేది నిజమేనా?" తీవ్రంగా ప్రశ్నించింది.

ముద్దు ఆ ప్రశ్న ఖాతరు చెయ్యలేదు. నిర్లక్ష్యంగా తలెగరేసి మొహం మరోవైపు తిప్పుకున్నాడు.

నయనతార జబ్బ పట్టుకులాగి ఫెడీమని అతన్ని చెంపదెబ్బ కొట్టింది. అప్పటికే అమ్మాయిలు కొట్టిన చెంప దెబ్బల్తో వాతలు తేలిపోయున్న అతని మొహం నయనతార కొట్టిన దెబ్బతో మరింతగా అదిరిపోయింది.

"వసంతకు క్షమాపణ చెప్పు" గర్జిం చిందామె.

ముద్దు ఆమె వైపు వురిమి చూశాడు తప్పితే ఆ మాటకు సమాధానం చెప్పలేదు.

"సరే, నువ్విలా మర్యాదగా అడిగితే, దారికి రావు" అంటూ ఆమె వసంతవైపు తిరిగింది.

"వసంతా, ఈ రాస్కెల్ నీ పెట్టెలో పెట్టాడే పోర్నోగ్రఫీ పుస్తకం - ఆ పుస్తకం

# నేత్రధనుస్సు

పత్రా."

వసంత క్రచెస్ సాయంతో అక్కడ్నించి తన గదిలో కెళ్ళిపోయి ఆ పుస్తకంతో తిరిగొచ్చింది

ఆ పుస్తకం వైపు చూస్తూనే అక్కడున్న మిగతా అమ్మాయిల్తో సహా పూర్ణా మేడమ్ మొహం కూడా అసహ్యంతో వికృతంగా మారింది.

నయనతార ముద్దుని వుద్దేశించి మరోసారి తీవ్రంగా అంది.

"పైకెంతో అమాయకుడిగా నటించే నీ నిజ స్వరూపం ఏమిటో నలుగురికి తెలియాలని నేనే వసంతచేత ఈ నాటకం ఆడించాను. ఒక ఆడపిల్ల పెట్టెలో పోర్నోగ్రఫీ పుస్తకం పెట్టి పిలిస్తే ఆ ఆడపిల్ల కామంతో వళ్ళు మర్చిపోయి నీ దగ్గరి కొస్తుందనుకున్నావు కదూ! ఆ ఆడపిల్ల అవమానంతో ఎలా కుమిలిపోతుందో నీకూ తెలియాలి" అంటూ మరోసారి వసంత వైపు తిరిగింది.

"వసంతా ఆ పుస్తకాన్ని ఈ రాస్కెల్ మెడలో వేలాడదియ్యి. వూరేగిస్తూ వేదిక మీదికి తీసుకెళ్దాం" అంది.

ముద్దు ఆమె వైపు కంగారుగా చూశాడు.

కొద్ది క్షణాల తర్వాత...

వేదికమీద జరుగుతున్న ప్రోగ్రాం అకస్మాత్తుగా ఆగిపోవడంతో ప్రేక్షకులందరూ ఒకరిమొహం ఒకరు చూసుకున్నారు.

ఇంతలో నయనతార చరచరా వేదిక మీదికొచ్చేసింది.

"ఆహూతులు మమ్మల్ని క్షమించాలి. తలవని తలంపుగా ఈ ప్రోగ్రాం మధ్యలో ఆపేయవలసి వచ్చింది. అంతకంటే ముఖ్యమైన ప్రోగ్రాం మరొకటి మీకు చూపించబోతున్నాను. దయతో కొద్ది క్షణాలు మీరంతా ఓపిక పట్టవలసిందిగా కోరుతున్నాను..." అంటూ పక్కకు తిరిగి వస ంతను గట్టిగా పిలిచింది-

"వసంతా, అతన్ని తీసుకురా!"

్రేక్షకులందరూ విచిత్రంగా వేదికవైపు చూస్తున్నారు.

వసంతతో పాటు మిగతా అమ్మాయిలందరూ ముద్దుని వేదికమీదికి లాక్కొచ్చేశారు.

కొడుకు అవతారం చూస్తూనే ప్రేక్షకుల్లో కూర్చున్న చిదానందం పక్కల్లోం బాంబు పేలినట్టుగా అదిరిపడ్డాడు.

నయనతార మైక్ పట్టుకుని చెప్ప సాగింది-

"ఈ రోజు మీరంతా ఈ శరణాలయం వార్షికోత్సవానికి విచ్చేశారు. ఈ శరణాలయం చాలా గొప్పదనీ, ఇక్కడ అనాథలూ, వికలాంగులూ అయిన ఆడపిల్లలకు ఆశ్రయం దొరుకుతోందనీ, ప్రశంసించి మేజర్ చక్రవర్తిగారు ఇందాకే ఈ శరణాలయానికి అయిదు లక్షల పర్సు అందజేశారు. అయితే ఒక వ్యక్తి మూలంగా ఈ శరణాలయంలోని ప్రశాంతమైన వాతావరణం పూర్తిగా కలుషితమై పోయింది. ఇతనే ఆ వ్యక్తి.

"ఇతను మరెవరో కాదు - ఈ శరణాలయ ధర్మకర్తలు దీనబంధు చిదానందంగారబ్బాయి. చిదానందంగారి కొడుకుననే అహంబావంతో ఇతను శరణాలయంలో ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తున్నాడు. ఆడపిల్లల్ని రాగింగ్ చేస్తూ ఏడిపిస్తున్నాడు. అయినా సహించాం.

"కానీ, ఇతని అగడాలు రోజు రోజుకూ మితిమీరిపోయాయి. ఈ ప్రోగ్రాం ప్రారంభం కావడానికి కొద్దిసేపటిముందు ఇతను వికలాంగురాలైన ఓ అమ్మాయి పెట్టెలో పోర్నోగ్రఫీ పుస్తకం పెట్టాడు. ఆ పోర్నోగ్రఫీ పుస్తకాన్నే మీరిప్పుడు ఈ ప్రముద్దుడి మెడలో చూస్తున్నారు. ఈ అసహ్యకరమైన పుస్తకాన్ని ఆ అమాయకురాలి పెట్టెలో వుంచడమేకాదు. ఆ అమ్మాయిని బలవంతం కూడా చేయబోయాడు. అదృష్టవశాత్తూ ఆ అమ్మాయి వీడి చేతుల్లోంచి తప్పించుకోగలిగింది. వీడి వికృతమైన ఆలోచనలు ఎలా వుంటాయో మీకు మరో వుదాహరణ చూపిస్తాను".

ఆమె చకచకా ముద్దు నిలబడివున్న వైపు నడిచి అతని జేబులోంచి కొన్ని బ్రాసరీలూ, అండర్‌వేర్లూ బయటికి లాగింది. ముద్దు ఆమెను ఆపుకోబోయాడు. అయితే తక్కిన అమ్మాయిలందరూ అతన్ని కదలకుండా పట్టుకోవడంతో ఏమీ చేయలేకపోయాడు

నయనతార అతని జేబులోంచి అవన్నీ బయటికి లాగడం చూస్తూనే ప్రేక్షకులందరిలో గుసగుసలు ప్రారంభమైపోయాయి ఇంతలో మరో అమ్మాయి శరణాలయంలోంచి అలాంటివే మరికొన్ని బ్రాసరీలూ, అండర్‌వేర్లూ వేదికమీదికి పట్టుకొచ్చి









# మానవతా సంక్రాంతి

ఉదయాబ్ది తరంగాలపై
ఉత్తరాయన తరణి నెక్కి
ఊగుతూ వస్తోంది
క్రొత్త కోడలి బిడియం పులుముకొని
కొంగ్రొత్త సంక్రాంతి

తటిల్లతలా మెరుస్తూ తాను కదలి వస్తుంటే
తగు సందడి లేదేమని దిగులామెకు కలిగింది



దినగండం నూరేళ్ళుగ జనం బ్రతుకుతున్న వేళ
వెలుగును మింగే చీకటి పెచ్చు పెరుగుతున్న వేళ
భాగ్యనగర ప్రఖ్యాతి కభాగ్యోదయమైన వేళ
తటిల్లతా ప్రభలు ప్రజల తల్లడిల్ల జేస్తుంటే
సంక్రాంతుల సంబరాన్ని స్వాగతించు వారెవ్వరు?
క్షణం క్షణం భయం నీడ కాలం గడిపే ప్రజలకు
సరదాలు సంబరాలు స్వాంతన సమకూర్చలేవు

విహ్వాల ప్రజాహృదయ ఘోష
వీధులప్రతి శబ్దిస్తుంటే
సన్నాయి గంగిరెద్దు
సందడి కిక చోటుందా?
ఉన్మాదుల కత్తిపోట్ల
ఉగ్రవాదుల కిడ్నాపుల
బరువెక్కిన హృదయాలను
బంతిపూల తోరణాలు
బలు ముగ్గుల గొబ్బెమ్మల
బంతులు అలరిస్తాయా?

సైతానులు రాక్షసులు
చలి వెన్నున పుట్టిస్తుంటే
కాచలేని చలి మంటలు
కళ్ళనీళ్ళ తడుపేగా.

చిగురాకుల పూగుత్తుల చెన్నొంచే చెట్లు, లతలు
అగ్గి బుగ్గి అవుతుంటే అమని రోదించినట్లు

పొదుగు గుద్దు పసిదూడను బెదిరిస్తూ కత్తిచూపి
కటికవాళ్ళు కాజేస్తే కన్న ఆ వరచినట్లు
శోకించింది మానవతా సంక్రాంతి లక్ష్మి
చిన్నబోయిన వదనంతో చితికిన హృదయంతో!

అతివాదుల ఆయుధాలు అమాయకుల కవచాలై
మతతత్వం మానవతా మహిత పక్వఫలరసమై
బ్రతుకులోని అనుభవాలు మితిమీరని షడ్రుచులై

రేపు మాపు కదుతుంది
ఆ పర్వ సమయమ్ జగతికి
మానవతా సంక్రాంతి

మచ్చలేని తరుణకాంతి
అప్పుడు సంక్రాంతిలక్ష్మి
ఆంధ్రుల ఆహ్లాదరశ్మి

- సూర్యదేవర రవికుమార్

ప్రేక్షకులముందు కుప్పగా పోసింది

నయనతార మళ్ళీ మైక్ ముందు నిలబడి చెప్పసాగింది

"ఇవన్నీ వీడి ఏకాగ్రత మనస్తత్వానికి నిదర్శనాలు వీటిమీద అసహ్యకరమైన రాతలన్నీ రాసి వీడు ఆడపిల్లల గదుల్లో పడేస్తుండాడు ఇలాంటివాడునేం చేయాలో మీరే నిర్ణయించండి"

"చెప్పుతో కొట్టండి" ప్రేక్షకులు ఆవేశం పట్టలేక గట్టిగా అరిచారు

"గుండు కొట్టించి, సున్నంబొట్లు పెట్టి, గాడిదమీద పూరేగించండి"

"చీపురుకట్టలు మెడలో వెయ్యండి"

శరణాలయం ఆవరణఅంతా రణగొణ ధ్వనుల్తో నిండిపోయింది

మేజర్ చక్రవర్తి దిగ్గునలేచి నిలబడి చిదానందం వైపు ఫురిమి చూశాడు

"చిదానందంగారూ, మీ శరణాలయం గొప్పగా నడుస్తోందని పొరపాటు పడ్డాను ఏమిటిది?" గర్జించాడు.

చిదానందానికి హఠాత్తుగా తన పరిస్థితి అర్థమైపోయింది

ఇంతలో ప్రేక్షకుల్లోంచి చాలామంది ఆవేశంతో లేచి నిలబడ్డం కనిపించింది

"ఆగండి" అకస్మాత్తుగా గొంతు చించుకుంటూ అరిచాడు చిదానందం

అందరూ ఎక్కడి వాళ్ళక్కడే ఆగిపోయారు

చిదానందం చరచరా వేదిక మీదికి వెళ్ళిపోయి ఒక్క క్షణం కొడుకు కళ్ళలోకి సూటిగా చూశాడు ఆ చూపుకు కంగారు పడిపోయి ముద్దు బొంగరంలా గిర్రున వెనక్కి తిరిగి తండ్రి కేసి వీపు తిప్పి నిలబడ్డాడు

చిదానందం అతనిజబ్బ పట్టుకుని బలవంతంగా తనకేసి తిప్పుకుంటూ కాల్లోంచి చెప్పు బయటికి తీశాడు.

అందరూ విభ్రాంతులై పోయి చూస్తున్నారు.

చిదానందం ఆ చెప్పుతో లాగిపెట్టి కొడుకు మొహం మీద కొట్టాడు ఒకటి కాదు, రెండు కాదు, ఆ చెప్పుతో లెక్కలేనన్ని దెబ్బలు అలా కొడుతూనే వున్నాడు ఆ దెబ్బలకు తట్టుకోలేక ముద్దు కీచుమంటూ అరిచాడు

# నేత్రధనుస్సు

చిదానందం అలా కొడుతున్న వాడల్లా చటుక్కున చెప్పు కింద పారేసి మైక్ ముందు కొచ్చేస్తూ ఆహూతులందరికీ చేతులు జోడించాడు.

"మహాజనంగళ్, వీడు నిండా దుష్టుడు నా కడుపులో దా చెడపుట్టినాడు వాడుదా చేసిన పనికి నేనుదా క్షమాపణ చెప్తా వుండాను," అంటూ నయనతార వైపు తిరిగాడు.

"అమ్మా, నయనతారా! మీ అందరుదా నా కూతుండ్ల వంటి వారు మీకు కూడా నేనుదా క్షమాపణలు చెప్తా వుండాను. నన్ను క్షమించుమీ!" దేబిరిస్తున్నట్టుగా అన్నాడు

"ఎంత మాట సార్! అతను చేస్తున్న అగడాలు ఎలాగైనాసరే ఆపాలనే వుద్దేశంతోనే ఇలా నలుగురి ముందుకు తెచ్చి బుద్ధి చెప్పాల్సి వచ్చింది అంతేగానీ, మిమ్మల్ని అవమాన పర్చాలన్న వుద్దేశంతో మాత్రం కాదు" చెప్పింది నయనతార.

చిదానందం గబగబా వేదిక మీంచి దిగొచ్చి మేజర్ చక్రవర్తి చేతులు పట్టుకున్నాడు.

"మేజర్ సార్ ఇవి చేతులు కావు, కాండ్లు! మీవంటి గొప్పవార్నిదా పిల్చిన ఆ ప్రోగ్రాం ఇట్లుండా అగునని నేనుదా అనుకోలేదు వికలాంగుల మీంద నాకుదా నిండా ప్రేమ మేజర్ సార్. మొన్నదా గవర్నర్ గారి చేతుల మీంద రాజస్థాన్లో వికలాంగులకుదా పనికి వచ్చే ఫర్నిచర్ అయిదు లారీలుదా పంపి వుంటిని. అటు మొన్నదా ముఖ్యమంత్రి చేతుల మీద గుజరాత్‌కుదా ఆరు లారీలు పంపి వుంటిని. ఇప్పుడుదా మీ చేతుల మీంద పంజాబ్‌కుదా పది లారీలుదా పంపిస్తు," అంటూ, "మణీ," అని కేకేశాడు.

నల్లగా తుమ్మ మొద్దులా వున్న ఓ వ్యక్తి ముందుకొచ్చాడు

"మణీ, నీవుదా పది లారీలు సామానుదా సిద్ధం చెయుమీ," అంటూ ఆర్డరేసి మళ్ళీ చక్రవర్తి వైపు తిరిగాడు చిదానందం. అక్కడున్న వాళ్ళంతా అతన్ని ప్రశంసాపూర్వకంగా చూస్తున్నారు.

"మేజర్ సార్, ఇప్పుడుదా నా బుద్ధి మీంద మీకు నిండా నమ్మకందా కుదిరినాదితానె?" అడిగాడు.

"చిదానందంగారూ, మాకు మీ నిజాయితీ పట్ల ఎలాంటి అపనమ్మకమూ లేదు. మీ అబ్బాయి చేసిన తప్పుకు సరైన శిక్ష విధించారు. ఇక మీదట ఈ శరణాలయంలో ఇలాంటి అవాంఛనీయమైన సంఘటనలు జరక్కుండా చూడండి," గంభీరంగా అన్నాడు మేజర్ చక్రవర్తి.

వాతావరణం పూర్తిగా తేలికైపోయింది.

ఇంతలో యశ్వంత్ నెమ్మదిగా నయనతార పక్కకొచ్చి నిలబడ్డాడు

నయనతార అప్పటికే వేదిక దిగొచ్చింది.

యశ్వంత్ తన పక్కకొచ్చి నిలబడగానే నయనతార అతని వైపు తిరిగింది.

"మిస్టర్ యశ్వంత్?"

యశ్వంత్ నిర్ఘాంతపోయాడు

"మైగాడ్! నేనని మీకెలా తెలుసు?"

"ఒక్కసారి ఎవరి అడుగుల చప్పుడు వింటే లక్షమందిలో వున్నా ఆ అడుగుల చప్పుడు మళ్ళీ గుర్తు పట్టగలను మిస్టర్ యశ్వంత్"

"మీరు క్షణక్షణానికీ నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నారు. ఈ రోజు మీరు సాధించిన పనికి మీ మీద నాకు గౌరవం రెట్టింపైంది. నయనతారగారూ వేదిక మీద నిలబడి మీరు మాట్లాడుతుంటే మీలో నాకు ఝాన్సీలక్ష్మీబాయి, రుద్రమదేవి వంటి వీరనారీమణులు కనిపించారు ఎందుకో తెలీదు. ఏదో ఒకరోజు వాళ్ళలాగే మీరు కూడా ఈ దేశాన్ని కాపాడగలరని నాకనిపిస్తోంది," అన్నాడతను.

"మీరు మరీ అమితంగా పొగిడేస్తున్నారు"

"కాదు నయనతార గారూ, నిజం చెబుతున్నాను," అంటూ జేబులోంచి ఆటోగ్రాఫ్ పుస్తకం తీశాడతను.

"యువర్ ఆటోగ్రాఫ్ ప్లీజ్," అభ్యర్థిస్తున్న వాడిలా అన్నాడు.

"ఓహో, ఆటోగ్రాఫ్ కోసమన్న మాట ఈ పొగడ్తలన్నీ!"

అతను చిన్నబోయి చూస్తుండగా ఆమె లోలోపలే ముసిముసిగా నవ్వుకుంటూ అక్కడ్నించి అవతలికెళ్ళిపోయింది

అప్పటికి వేదిక వెనక్కి వెళ్ళిపోయిన ముద్దు చాటుగా నిలబడి ఆమె వైపు క్రూరంగా చూస్తున్నాడు.

(ఇంకా వుంది)



# "పేరులోనే కలదు పెన్నిధి!"

సుప్రసిద్ధ రచయిత, ఆంధ్ర సచిత్ర వారపత్రిక వారఫలాలు అందించిన శ్రీ మహేష్ ఒకరే. స్వర్గీయ శ్రీ మహేష్ న్యూమరాలజీలోగూడా దిట్ట. వారు 1964 సెప్టెంబర్ 11 సంచికలో అందించిన యీ న్యూమరాలజీ వ్యాసం యీ తరం పాఠకులకోసం మళ్లీ అందిస్తున్నాం

- ఎడిటర్

"నామధేయం న సార్థకం" అంటూ సంస్కృత భాష, పేరుమీద విశ్వాస రాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించగా 'పేరు గొప్ప ఊరు దిబ్బ' అంటూ తెలుగు భాష సదరు తీర్మానాన్ని బలపరుస్తుంది

కాని సంఖ్యా శాస్త్రం మాత్రం 'పేరులోనే కలదు పెన్నిధి' అంటుంది.

ఏ వ్యక్తి అయినా అతని పేరుకు యే సంఖ్య వస్తుందో ఆ సంఖ్య యొక్క మంచి చెడ్డలమీద ఆ వ్యక్తి జీవితం ఆధారపడి ఉంటుందని సంఖ్యాశాస్త్రం చెబుతుంది.

ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క సంఖ్యను శాస్త్రం నిర్ణయించింది మనదేశ భాషలకు సంబంధించిన అక్షరాలకు దీర్ఘం, ద్విత్వం మొదలైన మార్పులు వస్తూవుంటాయి. కాబట్టి ఈ విషయంలో ఇంగ్లీషు అక్షరాలను వాడడం సులభంగా ఉంటుంది. ఇంగ్లీషు అక్షరాలకు నిర్ణయింపబడిన

## సంఖ్యలు [బలాలు]

| | |
|---|---|
| A, I, J, Q, Y | 1 |
| B, K, R | 2 |
| C, G, L, S | 3 |
| D, M, T | 4 |
| E, H, N, X | 5 |
| U, V, W | 6 |
| O, Z | 7 |
| F, P | 8 |

## చూసేవిధానం:

K A M A R A J
2 1 4 1 2 1 1 12 [= 3]

పేరుకు సంఖ్య నిర్ణయించేటప్పుడు ఒక విషయాన్ని ముఖ్యంగా గమనించాలి. ఏ పేరుతో ఒక వ్యక్తి అధిక సంఖ్యాకుల చేత పిలవబడుతూ ఉంటాడో ఆ పేరునే తీసుకోవాలిగానీ, బారసాలనాడు పెట్టిన పేరుగాని, దస్తావేజుల్లో మాత్రం ఉండే పేరునుగాని తీసికొనకూడదు. కొంతమంది పేర్లకు అనేక విధాలుగా మార్పులు వస్తూ ఉంటాయి. కొంతమంది పేర్లలో కొంత భాగానికి పొడి అక్షరాలతో ప్రసిద్ధులు అవుతూ ఉంటారు.

ఉదా: పూర్తి పేరు - పూసపాటి విజయ రామ గజపతిరాజు
వాడుకలోని పేరు -పి.వి జి రాజు.

మరికొంతమంది పూర్తిగా పేరులోని పొడి అక్షరాలతోనే వ్యవహరింపబడుతూ ఉంటారు

ఉదా.-పూర్తి పేరు:- శ్రీరంగం శ్రీనివాసరావు.
వాడుకలోని పేరు:- శ్రీశ్రీ.

మరికొంతమంది తమ పేరులో కొంత భాగంతోనే గుర్తింపబడుతూ ఉంటారు.

ఉదా -పూర్తి పేరు - గుమ్మడివెంకటేశ్వరరావు
వాడుకలోని పేరు:- గుమ్మడి




మరికొంతమంది అసలు పేరుతో నిమిత్తం లేకుండా కలంపేరుతోనో మరొక పేరుతోనో వ్యవహరింపబడుతూ ఉంటారు.

ఉదా:-అసలుపేరు:-పిళ్లాకృష్ణమూర్తి వీరాజీ
వాడుకలోని పేరు:- వీరాజీ

పేరులోమార్పు యే కారణంచేత వచ్చినా మారిన పేరులోనే ఒక వ్యక్తిని అత్యధిక సంఖ్యాకులుగా, ప్రజలు గుర్తిస్తూఉంటే ఆ పేరునే తీసికోవాలిగాని అసలు పేరునుగాని, పూర్తి పేరునుగాని తీసికొనకూడదు అంటే వాడుకలోని పేరును మాత్రమే తీసికోవాలి.

## సంఖ్యలకు ఫలితాలు:

1. మిక్కిలి మంచిది, 2. మంచిది, 3. చాలా మంచిది, 4. సామాన్యం, 5 మిక్కిలి మంచిది, 6. చాల మంచిది, 7. మంచిది, 8. చెడ్డది, 9. చాలా మంచిది, 10. చాలా మంచిది, 11. మంచిది కాదు, 12. మంచిది, 13 సామాన్యం, 14. సామాన్యం, 15. మంచిది, 16. మంచిది - కాదు, 17. శుభాశుభమిశ్రమం, 18. మంచిది, 19. మిక్కిలి మంచిది, 20. అంతమంచిది కాదు, 21. చాల మంచిది, 22. అంత మంచిదికాదు, 23. మిక్కిలి మంచిది, 24 చాల మంచిది, 25. మంచిది, 26. చెడ్డది, 27. చాల మంచిది, 28 మంచిది కాదు, 29. మంచిది కాదు, 30. చాల మంచిది, 31. సాధారణం, 32. చాల మంచిది, 33. చాల మంచిది, 34. మంచిది, 35 చెడ్డది, 36. చాల మంచిది, 37. చాలా మంచిది, 38. మంచిది కాదు, 39. చాలమంచిది, 40. సాధారణం, 41. చాల మంచిది, 42 చాల మంచిది, 43 మంచిదికాదు, 44. చెడ్డది. 45. చాల మంచిది, 46. చాలమంచిది, 47 మంచిది కాదు, 48. చాలమంచిది, 49. సాధారణం,

50. చాల మంచిది

ముందు చెప్పబడిన విధంగా ఒక వ్యక్తి పేరులోగల అక్షరాలనుబట్టి యే సంఖ్య వచ్చిందో ఆ సంఖ్యకు గల ఫలితంమీద ఆ వ్యక్తి జీవితం ఆధారపడి ఉంటుంది. కొంతమంది ప్రముఖ వ్యక్తుల పేర్లకు వచ్చిన సంఖ్యలకు యే ఫలితాలు చెప్పబడినవో పరిశీలించిన యెడల సంఖ్యల స్వభావాన్ని సులభంగా అర్థం చేసికొనవచ్చును.

ఉదా:-

GANDHI
315451 = 19 = [1]
NEHRU
55526 = 23 = [5]
LENIN
35515 = 19 = [1]
LINCOLN
3153735 = 27 [9]
KENNEDY
2555541 = 27
ROOSEVELT
277356534 = 42
NASSER
513352 = 19

[లింకన్, కెన్నెడీలకు గల పోలికలలో ఇది కూడా ఒకటి]

పేరులో రెండు మూడు స్వతంత్రములైన భాగాలుగాని పొడి అక్షరాలుగాని ఉన్నట్లయితే వాటికి విడిగా సంఖ్యలను సాధించి ఆ సంఖ్యలను కలపాలిగాని మొత్తం ఒకే సంఖ్యగా కలపకూడదు.

ఉదా॰- (1) నీలం సంజీవరెడ్డి
NEELAM
555314 - 23 - 2 + 3 = 5
SANJ EEVAREDDY
3151556125441 = 43 = 4+3=7
మొత్తం పేరుకు వచ్చిన సంఖ్య 12

ఉదా॰- (2) సుచేతా కృపలానీ
SUCHETA
3635541 = 27 = 2 + 7 = 9
KRIPALANI
221813151 = 24 = 2 + 4 = 6
మొత్తం పేరుకు వచ్చిన సంఖ్య 15

ఉదా - (3) ఎల్. వి ప్రసాద్
L = 3 = 3
V = 6 = 6
PRASAD
821314 = 19 = 1 + 9 = 10 = 1
మొత్తంపేరుకు వచ్చినసంఖ్య 10

విడిగా పేరులోని భాగాలకు వచ్చిన




సంఖ్యలు మొత్తంగా పేరుకు వచ్చిన సంఖ్య కూడా మంచివై ఉండుట ఉత్తమం కనీసం మొత్తం సంఖ్య అయినా మంచిదై ఉండాలి. పేరును బట్టి వచ్చిన సంఖ్య పుట్టిన తేది ఒకటై ఉండడం చాల మంచిది

ఉదా.- నెహ్రూ పుట్టిన తేది 14 = 1 + 4 = 5
పేరు:- NEHRU
55526 = 23 = 2 + 3 = 5

పుట్టిన తేది పేరునుబట్టి వచ్చిన సంఖ్య వేరు వేరు అయితే అటువంటి వ్యక్తి జీవితములో ఒడుదుడుకులు, అభివృద్ధికి అటంకాలు మొదలైనవి రావచ్చును. కాని పుట్టిన తేది పేరుకు వచ్చిన సంఖ్య మిత్రత్వము కలవి అయినా బాగా ఉంటుంది.

పుట్టిన తేది సంఖ్య 8 (తేదీలు 8, 17, 26) అయినట్లయితే పేరు సంఖ్య కూడా 8 రావడం మంచిదికాదు. పుట్టిన తేదీని యెలాగునా మార్చలేము. కాబట్టి పై తేదీలలో పుట్టిన వారు తమ పేర్లకు ఒక మంచి సంఖ్య వచ్చేటట్లు మొత్తం పేరుగాని, పేరులో అక్షరాలుగాని మార్చుకోవడం మంచిది.

ఏ వ్యక్తి అయినా, తను యే రంగంలో కృషి చెయ్యదలచుకున్నాడో దానికి సంబంధించిన సంఖ్యను యెంచుకోవడంకూడా మంచిది.

| | | |
|---|---|---|
| ఉదా - | రాజకీయాలకు | 1 |
| | వ్యాపారానికి | 5 |
| | సైనిక వ్యవహారాలకు | 9 |
| | కళలకు | 2, 6 |
| | మత వ్యవహారాలకు | 3 |

ఇటువంటివి అన్నీ ఆయా సంఖ్యలకు అధిపతులైన గ్రహాలమీద ఆధారపడి ఉంటాయి. సంఖ్యాధిపతులైన గ్రహాల స్వభావం మిత్రత్వము గల సంఖ్యలు సంఖ్యల యొక్క ప్రత్యేక ఫలితం కొంతమంది ప్రముఖ వ్యక్తుల జీవితాల్లో సంఖ్యాశాస్త్రం నిర్వహించిన పాత్ర మొదలైన వాటిని గూర్చి మరొకసారి వివరిస్తాము.

ఈ పైన చెప్పిన విషయాలు అన్నీ వ్యక్తుల పేర్లకే కాకుండా, సంస్థల పేర్లకు వస్తువుల పేర్లకు కూడా వర్తిస్తాయి

మహేష్

*[11-9-1964 ఆంధ్రసచిత్ర వారపత్రిక నుంచి]*



“నీవు తిని వచ్చిన తరువాత నే బోయి తినివత్తునుగాని, ముందు నీవేగి తినిరా, చీకటి పడిపోయినను నాకు భయంలేదు” అని అత్త యనెను.

అచ్చరవయినను పిశాచముగా జేసి పైచు కోక కట్టుకొని కూర్చున్న కోడలొక్క నిమిషమాలోచించి “కాదు, కాదు. మీరే ముందు వెళ్లవలయును. మీరు వచ్చిన తరువాతనే నేను” అనెను.

“మానమును మర్యాదయు ఎక్కువ వారికికాని మనబోటితక్కువవారికికావమ్మా. కాబట్టి ఆ సంగతి వదిలిపెట్టు! నీకు మధ్యాహ్నముకూడా కూడులేదు. పైగా చిన్నదానవు. చీకటిలో ఆ గుంపులో త్రోసుకుని వచ్చుటయు ప్రమాదము” అని అత్త అనెను.

“మానమును మరియాదయు, గాలియు నీళ్ల వంటి వత్తా! తండ్రియును, కొకును తిని పదకొండు గంటలకే నాగరాజుగారి యింటికి వెళ్లిరి కదా! మీకుమాత్రం మధ్యాహ్నం కూడేది? కాబట్టి ముందర మీరే వెళ్లి రండు, తరువాతనే నేను వెళ్లుదును. చీకటియనియు, గుంపనియు నాకొక దయ్యము చూపితిరి, దయ్యములు నన్నుచూచి పారిపోవును” అని కోడలనెను.

“కాదమ్మా! నీవు వచ్చవనువుపోసినటులు, మెఱవులముద్ద వేసినటులుందువు. నీకు దృష్టి తగులునమ్మా మరి చెప్పను.”

“మీ మాటయే నిజమగుగాక! మెఱవుల ముట్టినచో షాక్ తగులునత్తా! దానికేమిగాని ముందు మీదే వంతు.”

కోడలు మిగుల వినయ విధేయతలు కలది. అత్తమాట కెన్నడూ నెదురాడి యెఱుగదు. అడుచో మరి వింధ్యవర్వతమే! ఈ సంగతి ఆ యత్తకు తెలియును కాబట్టి యిక లాభంలేదనుకొని అత్త తన అతుకుల బొంత విడిచి అటకమీద చీర తీసి కట్టుకొని నాగరాజుగారి సత్రమునకు వెళ్లెను.

ఆ బస్తీలో నెటుచూచినను నాగరాజు పేరే. నాగరాజు అసుపత్రి! నాగరాజు అనాధ శరణాలయం! నాగరాజు దేవాలయం! నాగరాజు కాలేజి! నాగరాజు సత్రం! నాగరాజు కుళాయి! నాగరాజు వీధి! - వీధి!, వీధి ఏమికర్మము? ఇక ఆ బస్తీబస్తీ నాగరాజు పురమైపోవునని అనుకొందును.

నాగరాజపుడు పేదవారికి జావ పోయుటకొక సత్రమారంభించెను. ప్రతిదినం సాయంకాల మారుగంటలకు ఆరంభం, పది గంటలకు భరతవాక్యం. కష్టపడి సంపాదించుకొనువారు కూడ నిట తినమరిగి సోమరులయి పోదురను సదుద్దేశముతోడనే యిపుడతడు నూకల జావ పోయుట కేర్పాటొనరించెను. కష్టపడి సంపాదించువారికి



కథల కాణాచి



శ్రీ వేలూరి శివరామశాస్త్రి
(శతావధాని)

నూకల జావ తినుట అవమానమని అతని వుద్దేశ్యం. సోమరితనమును అవమానమును అన్నదమ్ములని యతడెఱుగకపోవచ్చును.

రోడ్డుల కిరుప్రక్కల నున్న మురికి కాలువల నీరు తగులకుండ జనులు కడు జాగరూకతతో గూర్చుండిరి దుమ్ము లేవకుండా రోడ్డమీద నీరు కొట్టిరి నాగరాజు అండ్ సన్స్‌వారి బియ్యపు మరయందును, పిండిమరయందును, ఘానెమరయందును, పంచదార మరయందును పనిచేయువారెందరో వచ్చి విస్తళ్లు వేయుదొడగిరి నాగరాజును, అతని కొడుకు గంగరాజును బంతులవెంట దిరుగుచు అజమాయిషీ చేయుచుండిరి కొందరు వచ్చడియు మఱికొందరు కూరయు వేసికొనుచు చేప్పుచుండిరి, తరువాత నూకల జావ వచ్చెను. అది పేరునకే జావ కాని తినుటకు ముద్దకట్టుకనే యుండెను.

దరిద్రనారాయణులందరును, దంత యంత్రములు విప్పిరి. ఇక ఒక ఏడాది వరకు తిండిలేక చావమను ధైర్యము వారి మొగములలో గనబడుచుండెను. గ్రుడ్డిగా వారందరును నాగరాజును చూడవలయుననియు, కుంటివాండ్రందరును నాగిరాజు ముంగిలికి పరువెత్తి జేపెట్టవలయుననియు దలచుచుండిరి అంగవైకల్యములేని వారందరును నాగరాజును, అతని కుమారుడును తమ నడుమనుండి పోవుచుండగా

తలలు వంచుకొనుచుండిరి.

తన యింటిచుట్టును నలువైపు నున్న రోడ్ల నడుమ నడుచుచు, ఈ దరిద్రనారాయణుల జూచుచున్న నాగరాజు హృదయం బరువెక్కెను. శిల్పసంపదతో, రసపురుషుని దెలువు తన పాలరాతి మేడ చుట్టును కూర్చున్న ఈ జీవచ్ఛవములను జూచుచున్న నాగరాజునకు, సృష్టిచేయు బ్రహ్మకీ విశ్వమునిండా శవములు కని పించుచో నెటులుండునో యటులుండెను. అతడు వడివడిగా ఆ రోడ్డు దాటి యెడ మవైపు రోడ్డుమీదికి దిరిగెను.

అచట బంతులన్నియు పూలమొ క్కలు పాతిన చందముగా నుండెను. అతని కంటికి కొంచెము శాంతి దొరకెను. నడచుచు నడచుచున్నవాడచట నాగి యచట కూర్చున్న వారందరిని పరికిం చెను. పలువురు తన మిల్లులలో పనిబాగు లవారే. "వీరుగూడ నిచట కేల వచ్చిరి?" అని యతడనుకొనెను. ఇక నిలిచి నచో బాగుండదు, వారందరాడువాండ్రు! అతడు మెలమెల్లగా పదడుగులు నడి చెను. అచట వింతతోడను వెగటుతోడను అతడాగిపోయెను - మాతరమ్మ! ప్రతిది నము తన యింటికి పాలుతెచ్చి యిచ్చును, బియ్యపు మరలో కూలిది!

మాతరమ్మ జావ ముద్ద తినుచు న్నది! అతడాగి చూచెను. మాతరమ్మయు జూచెను. ఆమెలో నెక్కడేని ఏమాత్రమేని సంధియములేదు. తన హక్కును తాను వృధాచేయకుండా వినియోగించుకొనుచున్న చందముగా తినుచు లోలోపల నాగరాజు నకు మ్రొక్కుచున్నది నాగరాజు కొడు కును బిలిచి సరిగా వినియోగము చేయిం పుమని చెప్పి మేడలోనికి వెళ్లిపోయెను.

"అప్పుడే వచ్చితిరేమి? దరిద్రనారా యణ సేవ సమాప్తమా?" యని అతని భార్య యోగమాయ ప్రశ్నించెను.

"ఇది సేవ కాదు, పరీక్ష."

"నారాయణునికి పరీక్షయా?"

"ఆ, దరిద్రనారాయణ పరీక్ష. ఈ గుంపులో మన మిల్లుల పనివాండ్రుకూడ పలువురు దూరిరి. వారికేమి రోగము? నొకొక్క యాడు దెటువంటి యెటువంటి చీరకట్టుకొని వచ్చినదో యొకవరి చూడు! వైస్రాయి విందుకు వచ్చినట్లు! మాత రమ్మయు వచ్చినది! నీవుకూడ అంత విలువగల కోక కట్టవు. నీ వెపుడో అట్టి కోక కట్టినటుల గుర్తు!"

యోగమాయ కొంచెం సిగ్గుపడి యిటులనెను - "సరిసరి మాతరమ్మయు



## గాయకుల సంగతులు

అమర గాయకుడు మహమ్మద్ రఫీకి గాలిపటాలు ఎగరెయ్యడ మంటే మహా సరదా. పాటల రికార్డింగ్‌ల మధ్యలో గంట సమయం దొరికినా ఇంటికి తిరిగొచ్చి మేడపైకి వెళ్ళి గాలిపటాలు ఎగరేస్తూ ఉండేవారు. ఈ అలవాటును ఆయన చివర వరకు పోగొట్టుకోలేక పోయారు. అలాగే బ్యాడ్మింటన్ ఆటని కూడా ఆయన ఇష్టపడేవారు.

* * * * * * *

శ్రీమతి ఉషా ఖన్నా ప్రోత్సాహంతో చలన చిత్ర గాయకుడుగా రంగ ప్రవేశం చేసి, మహమ్మద్ రఫీ తర్వాత ఆ స్థానాన్ని భర్తీ చేస్తున్న నేటి ప్రముఖ హిందీ గాయకుడు శ్రీ షబ్బీర్ కుమార్‌కు అసలు శాస్త్రీయ సంగీతమే రాదట. గత కొన్ని సంవత్సరాలుగా తను శాస్త్రీయ సంగీతం అభ్యసిస్తున్నప్పటికీ, తమకున్న బిజీ వల్ల ఎక్కువ సమయాన్ని సంగీత సాధన కోసం కేటాయించలేక పోతున్నాడట

* * * * * * *

"జీవితంలో అనుకున్న వన్నీ జరగవు, అనుకోని వెన్నో జరుగుతాయి" అన్న నానుడి ఉంది. కానీ తన జీవితంలో అనుకున్నది సాధించింది నేటి ప్రముఖ హిందీ గాయని అల్కా యగ్నిక్. బాల్యం నుండి ఆమెకు ఒకే కోరిక ఉండేది- అది గొప్ప ప్లే-బ్యాక్ సింగర్ అవ్వాలని. లక్ష్మీకాంత్- ప్యారెలాల్ గారి ఆదరణ, ప్రోత్సాహంతో 'లావారిస్' చిత్రంలో 'మేరె అంగనెమె' అను పాట ద్వారా ప్రేక్షకులకు పరిచయం అయి నేడు ప్రముఖ గాయనిగా వెలుగొందు తుంది. 'తేజాబ్', 'ఖయామత్ సే ఖయామత్ తక్' చిత్రాలు ఇందుకు ఉదాహరణ. తన జీవితంలో అనుకున్నది సాధించినందుకు ఆమె సంతోషం వ్యక్తపరుస్తుంది.

– యం. సంజయ్

నామె కోడలు జయయు, ప్రతి దినము మిల్లుకు వచ్చుచు దగ్గరవుండి పాలు పిండించి మనకు దెత్తురు. ఒకనాడు నేనే పాలుగిన్నె తీసుకోవలసి వచ్చెను. ఆమెను జూతుముకదా గుడ్డలమ్మ! బీరువా తీయగానే ఒక చీర కనవడెను. అది కట్టించి ఆమె నవుడు మిల్లుకి పంపితిని. వాండ్లు చాలా మంచివాళ్లు!"

"మంచివాండ్లగుచో నిక్కడికేల వత్తురు? పెదలకు సత్రముగాని వీరికా? వీరికి మనము జీతములిచ్చుటలేదా?"

"ఏమిచ్చుచున్నారు?"

"నాకు గురుతా? గుమాస్తానడుగు."

"మీరిచ్చునది తమకు జాలినచో మాతరమ్మ చచ్చినను, సత్రమునకు రాదు."

"ఆడువాండ్రమీద నీకభిమానము."

"ఒకవేళ నున్నచో అది మీరనుకొనినటులు తప్పకాదుగాని, మీరిచ్చు జీతము వారి కుటుంబమునకు జాలదు. అది యటులుండుగాక. నాకుకూడ మీ సత్తరువున వారితోపాటు తిని రావలయునని

## ఒకటే చీర

సంకల్పము కలుగుచున్నది."

"ఏమేమి?"

"ఇపుడొకడీ దరిద్రులకు బ్రతినిధగా మోకాలుదిగని కొల్లాయ కట్టుకొనుచుండగా నేనొకయేడాదిపాటు దరిద్రుల దుఃఖమెంతయో కనుగొనుటకు నూకలకూడు తినజాలనా? అదియుగాక కాయకష్టమొనరించి మన సంపదలో గొంతకు గాకున్నను గొంతకు కారణమయిన మన యీ కూలివాండ్ర తరువాతనే యీ దరిద్రులు, మన గుమాస్తాల తరువాతనే ఈ దరిద్రులు. మన యింజనీరుల తరువాతనే యీ దరిద్రులు."

హేతుపూర్వమైన యీ వాక్ప్రవాహావు టురవడికి నాగరాజు మనస్సు చాల దవ్వకొట్టుకొనిపోయెను.

సరిగా ఈ సమయమునకు మాతరమ్మ వారి ముందరికి వచ్చి కొంచెము వెనుకకు దగ్గి తలుపుచాటున నిలువబడెను.

నాగరాజు కొంచెము బిడియపడి వేమీదికి పోబోయి గదిలోనికి మరలెను.

"కోడలిని తీసికొనిరాకుండా నీ వొక్కతివే వచ్చితివేమి?" అని యోగమాయ అడిగెను.

"చీర్ర్ -" అని ఆగిపోయి కొంచెము సిగ్గువడి వేదన ననుభవించి మాతరమ్మ మరల నందుకొని - "మే మిరువురమును వచ్చుచో నింటికా పెవరు? నేను వెళ్లుచునే వంపెదను. దానికి మధ్యాహ్నము కూడ కూడులేదమ్మా" అని అనెను.

"సరి. నాకు గనవడిపొమ్మని చెప్పు."

"నేను చెప్పనక్కరలేదు, దానికి తెలియును" అనుచు మాతరమ్మ వడివడిగా వెళ్లిపోయెను.

మాతరమ్మ వెళ్లిన గంట తరువాత కోడలు జయ ఏ రోడ్డుమూలనో కూర్చుండి ఆకలి పోగొట్టుకొని కలకలలాడుచు యోగమాయ యెదుటికి వచ్చి దండముపెట్టి నిలువబడెను.

"గదిలో మీ బాబుగారున్నారు. ముందు వారికి దణ్ణముపెట్టవలెను" అని యోగమాయ అనెను.

జయ నోరు కరచుకొని, తెరచిన గుమ్మము ముందు వంగి నమస్కరించుచుండగా నాగరాజు వచ్చి చూచెను. మరలనదే చీర! మాతరమ్మ కట్టుకొన్నదే!

అతని నోటినుండి గబగబ ఈ మాటలు దొరలెను.

"ఇట్టి చీరలు మీ యింట నెన్ని కలవు?"

జయ భయపడెను. అత్తగారు చావనయిన చచ్చునుగాని దొంగతనము చేయదని జయకును దెలియును. అంతనామె భయము తొలగెను. పిదప యిటులనెను -"అమ్మగారు పదిరోజులు క్రింద మా అత్తగారి కీ కోక యిచ్చిరి. అదే అక్షయముగా నున్నది."

"మీ రిరువురును గలిసిరాక నీవు వెనుక వచ్చితివేమి?"

జయకు నవ్వును దుఃఖమును వచ్చెను. "అయ్యా, నే నిపుడు తమ సన్నిధానములో మనవి చేసికొనినదదే. అందులకనియే మేమిరువురమును మిల్లువనిలోనికి రాజాలకున్నాము. ఆమె యొకరోజునను, నేనొక రోజునను వచ్చుచుందుము! అందువల్ల మా కొకపూటనే తిండి. మా యిరువురకును కలసి యిదొకటే చీర!"

(ఆంధ్ర సచిత్రవారపత్రిక 1947, సెప్టెంబర్ 17వ తేది)

సేఫ్టీ లేని ఈ బంగారు నగలొద్దు, సొమ్మంతా భద్రంగా నాగార్జున ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్ వారి షేర్లలో పొదుపు చేద్దామంటే విన్నావు కాదు! నీ ఖర్మ!!

ఊఁ! త్వరగా!!

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

ఇంతవరకూ సాగినకథ-19: ప్రణవనాథ్‌ను హత్య చేసిన మోహిని గురించి వివరాలు ఆరా తీయాలనుకున్న నందికేశ్వర చావుదెబ్బతింటాడు. ప్లూటోగా పిలువబడే రవితేజను కలుసుకునేందుకు వెళ్ళిన రేఖ తండ్రికి సహాయపడేందుకు రవి తన గురూజీ అయిన నానాసాహెబ్ అనుమతితో పయనమవుతాడు. జైన విహారంలో వున్న డేవిడ్‌ను రవి, భీంలు కలుసుకుంటారు. అనర్థాలకు కారణమైన మోహినిని మట్టు పెట్టాలన్న ఉద్దేశ్యంతో రవి, రేఖ, భీం-ఉదయ్‌పూర్ వెళ్ళారు. అనేక దోపిడీలతో సంబంధమున్న మోహిని మరణించిందని రవికి ప్రతాప్‌సింగ్ తెలియచేస్తాడు.

[గత సంచిక తరువాయి]

మోహిని మరణించిందనీ ఆమె కొడుకు శవానికి దహన సంస్కారం చేస్తున్నాడనీ తెలిసి బలగంతో అడవిని చుట్టుముట్టాము.

చితిమీద దాదాపు తగలబడిపోతూ కన పడింది మోహిని. మమ్మల్ని చూచి అక్కడున్న కొండజాతి ప్రజలు చెల్లాచెదరై పోయారు.

చివరకక్కడ ఒకే ఒక అమ్మాయి మాత్రం మిగిలింది.

"ఎవరు నువ్వు-మోహిని నీకేమవు తుంది?" అని అడిగాను.

"మోహిని మా అమ్మ" అంది ఆ అమ్మాయి.

"మోహినికి పిల్లలులేరే?"

"ఆకలి అయినప్పుడు అన్నం పెట్టినామె అమ్మ గాక ఏమవుతుంది?"

మోహిని శవం పూర్తిగా దహనమై పోయాక ఆ అమ్మాయి వెళ్లిపోయింది.

ఇన్‌స్పెక్టర్ ఆ అమ్మాయిని అటకా యించబోయాడు.

వద్దని వారించాను. మోహిని ఎటు గూడీ మరణించింది! ఆమె ముఠా చెల్లా చెదరైపోయింది. తల్లి శవానికి దహన సంస్కారాలు చేయడానికి కన్నబిడ్డ కన్న మిన్నగా పెంచిన పెంపుడు కొడుకు రానే లేదు.

వయసులోవున్న అందమైన కొండ జాతి పిల్లను అరెస్టు చేసి రాణాకు తీసుకువస్తే మా వాళ్లెవరైనా దుర్బుద్ధి పుట్టి అఘాయిత్యం తలపెడితే తర్వాత నాకు పెద్ద తలనొప్పి వస్తుంది.

అందుకే ఆ అమ్మాయిని అడవిలోకి వెళ్లిపోనిచ్చాను- ఆ తర్వాత మోహిని కొడుకు సంగతి ఎవరికీ ఆచూకీ దొరక లేదు. నిజానికి అతన్నిగూర్చి ఎవరమూ పట్టించుకోలేదు.

మోహినీ తాండవం ముగిసి పోలీసు ఫోర్స్ తేలికగా వూపిరి పీల్చుకుంది

"మోహినీ ఫొటో వుందా అంకుల్."

"లేదు రవీ-మేము వెళ్లేసరికి ఆమె శరీరం గుర్తుపట్టటానికి వీల్లేనంతగా దహనమైపోయింది. అందువలన ఆమె యిలా వుంటుందీ అని చెప్పగలిగిన వాళ్ళు మా డిపార్టుమెంటులోనే లేరు!"

"మోహిని పెంపుడుకొడుకు ఫొటో వుందా అంకుల్!"

"ఉహూ! ఆ విషయంలో మోహిని చాలా జాగ్రత్తపడింది. అతన్ని ఎవరూ చూడలేదు! కనీసం తల్లికి దహన సంస్కారాలు చేయటానికి కూడా అతను రాలేదు!"

"మరి చితికి నిప్పెవరంటించారు?"

"ఆ మాటే ఆ కొండ జాతి పిల్లనడిగాను. కొడుకు రాకపోయినంత మాత్రాన దహనం చెయ్యకుండా వుంటామా? మా అమ్మ చితికి నేనే నిప్పంటించాను" అంది!

"అలాగా-సో స్ట్రేంజ్!"

"కొండజాతి వాళ్ళలో ఆడపిల్లలు తల్లి చితికి నిప్పంటించే ఆచారం వుంది రవీ!"

"ఉహూ-థాంక్సంకుల్ వస్తాను."ప్రతాప్ సింగ్ దగ్గర సెలవు తీసుకుని బయటకు వచ్చేసాడు రవి.

అతని మనసంతా గజిబిజి అయిపోయింది. ప్రతాప్ సింగ్ బంగళా నుండి హోటల్‌కు తిరిగి వచ్చేదారిలో ఆలోచన లోపడ్డాడు రవి.

మోహిని నాలుగేళ్ళనాడు చనిపోతే డేవిడ్ చెప్పిన మోహిని ఎవరు?! పోనీ డేవిడ్ మతి చలించి చెప్పాడనుకున్నా రణధీర్ కూడా మోహిని గురించే చెప్పాడు!

మరి యీ మోహిని ఎవరు? బందిపోటు మోహినికి యీ మోహినికి సంబంధం వుందా? బందిపోటు మోహిని కూతురే యీ మోహిని కాదు గదా?

బందిపోటు మోహినికి పిల్లలే లేరు! సందులు గొందులు గుండా హోటల్‌కు చకచక నడచివెళ్ళసాగాడు రవి.

రెండు ఫర్లాంగులు నడిస్తే హోటల్ వస్తుందనగా రవికి తననెవరో వెంబడిస్తు న్నారనిపించింది.

గిరుక్కున వెనుదిరిగాడు కాని వెనుక నున్న జనంలో తనను వెంబడిస్తున్న వాళ్ళెవళ్ళో తెలియరాలేదు.

ముందుకు తిరిగి నడుస్తూ పక్కనున్న చిన్న సందులోకి తిరిగాడు.

రెండు పెద్ద బజార్లను కలిపే సందది. సందు చీకటిగా నిశ్శబ్దంగా వుంది. కూలి పోవటానికి సిద్ధంగా వున్న మూడంతస్తుల మేడ వుందా సందులో.

ఆ మేడలోనే కొంత కాలం క్రితం

వరకు స్మగుల్డ్ సామాన్లు, ప్లాస్టిక్ సామాన్లు, గాజులు, పాత బట్టలు, రోల్డు గోల్డు నగలు అమ్మేవాళ్ళు.

మూడు నెలల నాడు మూడో అంత స్తులోని బాల్కనీ విరిగిపడి సందులో వెళ్తున్న వ్యక్తి చనిపోవడంతో ఆ మేడలో వ్యాపారం చేసే వాళ్ళంతా హడావిడిగా ఖాళీ చేసి వెళ్ళిపోయారు.

కొన్ని షాపులు మాత్రం మూసివేసి వున్నా యింకా. అయితే తెరిచిన షాపుల కిటికీ చెక్కలు తలుపు చెక్కలు గళ్ళు లాక్కుపోగల్గినంత వరకు లాక్కు వెళ్ళారు.

సందు నిండా గడ్డిగాదం, తుక్కు కాయితాలు, అట్టముక్కలు, పారవేసిన అట్టపెట్టెలు వున్నాయి.

తనవెవరయినా వెంటాడుతున్నదీ లేనిదీ తెలుసుకోవటానికా సందు అను వుగా వుంటుందనిపించింది. వెంటాడుతున్నారా? అంతం చేయాలనుకుంటు న్నారా?

సందు మధ్యలోకి నడుస్తూ బహు శ్రద్ధగా వినసాగాడు తన అడుగుల చప్పుడు. వెనుక మరో యిద్దరి అడుగుల చప్పుడు మూడో వ్యక్తి దూరంగా ఎదురుగా మూసి వేసిన షాపు నీడలో గోడకానుకుని నిలబడి వున్నాడు.

అంతదూరాన వున్న అతని దీర్ఘని శ్వాసం వినగలిగాడు రవి. గురూజీ దగ్గర అత్యంత శ్రద్ధతో నేర్చుకున్న శబ్దగ్రాహక విద్య అప్పుడుపయోగపడిందతనికి. నోటి నుండి నెమ్మదిగా గాలివదుల్తూ వినవడు తున్న శబ్దాలను విశ్లేషించసాగాడు.

వెనుక నున్న వాళ్ళు ఇరవై అడు గుల దూరంలో వున్నారు. ముందున్న తను వది పన్నెండడుగుల దూరంలో వున్నాడు.

బహు నెమ్మదిగా సద్దు చేయకుండా నడుస్తున్న ముగ్గురూ మామూలు కిరాయి రౌడీలు కాదని గమనించాడు రవి.

సందు ప్రశాంతంగా వుంది కాని అది-తుఫాను ముందర ప్రశాంత వాతావరణం. నలుగురు వ్యక్తుల మానసిక స్పందన శక్తితో నిండి వుంది. మిగిలిన ముగ్గురి మాన సిక శారీరక శక్తి గురించిన అంచనాలో వున్న రవి ఉలికిపడేట్లు ముందున్న వ్యక్తి చెంగున గెంతి సందు మధ్యలో నిలబడ్డాడు.

సన్నగా పొడుగ్గా కండలు తిరిగిన అతని శరీరం అణచిపెట్టిన స్ప్రింగ్‌లా వుంది.

మోకాళ్ళు కొద్దిగా వంచి మీదకు గెంత టానికి సిద్ధంగా వున్నాడతను-నల్లప్యాంటు, నల్ల షర్ట్ వేసుకున్న 'చీకటికి హితు డిని' అన్నట్లున్నాడు.

తల తిప్పి చూచాడు రవి. రాతి విగ్రహాలలా నిలబడి వున్నారిద్దరూ సందు



మధ్యలో.

ముందున్న తను కొద్దిగా కదిలి చిన్నగా నవ్వి తల ఆడించాడు, ఛాలెంజ్ చేస్తూ.

వాళ్ళు ముగ్గురూ కరాటే నిపుణులనీ ముగ్గురూ టీమ్‌గా పని చేస్తారని అర్థం అయింది.

తనకి సరిగ్గా వెనక వున్నతను అందరి కన్న బలవంతుడనీ ముందున్న తను ఎక్కువ చురుకైన వాడనీ ఆఖర్లో వున్న మూడో అతను మొండివాడనీ నిర్ధారించుకున్నాడు.

కరాటే తంత్రం ప్రకారం వొంటరిగా వున్న ప్రత్యర్థిని ఎదుర్కొనేప్పుడు అలాటి వ్యూహం పన్నుతారు!

రవి మొదటి కదలికకు ప్రత్యర్థులు ముగ్గురూ ఉలిక్కిపడ్డారు.

కుడి కాలి మడమ మీద గిర్రున తిరిగి రెండు చిన్న అడుగులు వేసాడు.

ఛాలెంజ్ చేసిన చురుకైన అతను రవి మధ్యనున్న బలవంతుడిని ఎటాక్ చేస్తున్నాడని చప్పున ముందుకొచ్చాడు.

రవి వెనక్కి తిరక్కుండానే బాగా ముందుకు వంగి కుడి కాలుతో బలంగా బ్యాక్ కిక్ యిచ్చాడు.

ఛాలెంజ్ చేసినతని పొట్ట కండరాలు సంకోచించి వుండ బట్టి బతికి పోయాడు గాని లేకపోతే ఆ దెబ్బకు అతను మట్టిగరచి వుండేవాడు! ప్రాక్టీస్ చేసేప్పుడు పొట్ట కండరాలు బిగించి కర్రతో బలంగా పొడిపించుకునే వాడతను. రాయిలా బిగుసుకున్న కండరాలు డాలులా మారి కర్ర దెబ్బను కాచేవి!

కాని యిప్పుడు రవి యిచ్చిన బ్యాక్ కిక్ శక్తికి రాటుదేలిన అతనిపొట్ట కండ




రాలు నుజ్జయి ఖుజాల వరకు కదలి ఉదర వితానం కలుక్కుమని కిందపడిపోతూ నిలదొక్కుకోవాలని విశ్వ ప్రయత్నం చేసాడు. కాని అప్పటికే కళ్ళు బైజాలు గమ్మి పడ పోయాడు.

కిందపడిన అతని ఎడమ నవరగంతను ఎడమ కాలి మడమతో బలంగాతన్నాడు రవి.

స్పృహ కోల్పోతూ గిర్రున దొర్లాడ తను నేల మీద.

కన్నుమూసి తెరచినంతలో జరిగిన హఠాత్సంఘటనలకు వెనుక నున్న యిద్దరూ కంగుతిని కోలుకునే లోపల గిర్రున పిల్లి మొగ్గ వేసి యిద్దరి మధ్య రెండు కాళ్ళ మీద నిలబడిన రవి తల వూపుతో వెనుక నున్నతని దవడ విరిగేలా చేసాడు. ఆ దెబ్బతో మొండివాడు షాపు అద్దాల కిటికీలోంచి గాజు పెంకుల మధ్యపడిపోయాడు.

మధ్య నున్నతను నెమ్మదిగా గెంతుతూ రవి మీదకు లంఘించి ముష్టి ఘాతంతో రవి దవడ ఎముక విరుద్దామనుకున్నాడు.

కాని అందుకు సిద్ధంగా వున్న రవి బలవంతుడి పిడికిలిని వొడిసి పట్టుకుని మెలి తిప్పి అదే సమయంలో మోకాలు వంచి డొక్కలో తన్నాడు.

కిందపడి మళ్ళీ నిలదొక్కుకుని లేచి నిలబడి మరింత ఎలర్టుగా మారి పిడికిలి బిగించి వెనుక నుండి రవి దవడ మీద ముష్టిఘాతం యివ్వాడు రవి మోచేతి వక్కగా వెళ్ళిన ముష్టిఘాతం వెళ్ళి అతని దవడను తాకింది. బలమైన ఆ ముష్టిఘాతం తాకిడికి రవి సందు వక్కనున్న పాత బట్టల షాపులో పోయిపడ్డాడు.

నేల మీద బంతిలా దొర్లుతూన్న రవి తన వెనుకే అబోతులా వస్తున్న బలవంతుడిని తప్పకుని వక్కకు జరిగాడు. అతను షాపు లోపలకు దూసుకు వెళ్ళగానే విజృంభించాడు రవి.

చేతిని బల్లెంలా మార్చి అతని ముక్కు దూలం మీద మోదాడు. రెండో దెబ్బ అతని గొంతు మీద మోదాడు.

నిశ్చేష్టుడై తెప్పరిల్లుకుని చేతిని బల్లెంగా మార్చి రని ముక్కు మీద బాదబోయాడతను కాని రవి వక్కకు తప్పకోవటంతో అతని ఎటాక్ వ్యర్థం అయింది.

రవి మూడో దెబ్బకు అతను కుప్పగూలే వాడే-కాని తెలివిగా దెబ్బతప్పకుని కిందపడి దొర్లి రవిని కాళ్ళతో నెట్టి తను అవతలకు దొర్లాడు.

వంట్లో గుచ్చుకున్న గాజు పెంకులను దులుపుకుంటూ వచ్చాడు. వెనక నున్న మూడో అతను అతని ముఖం బొబ్బలు గాజు పెంకులు గుచ్చుకుని రక్తం కారుతూ వుంది! ప్రత్యర్థులిద్దరి మధ్యగా లోపలకు వెళ్ళిన రవి చీకటిలో వాళ్ళిద్దరికీ కనపడలేదు.

అడ్డదిడ్డంగా కుడివైపుకూ ఎడమవైపుకూ వూగుతూ చేతులు చాచి ముందుకు వస్తున్న మూడో అతని దవడ మీద ఎగిరి కాలి మడమతో తన్నాడు రవి.

అది వరకే విరిగిన అతని దవడ మరింత నుజ్జయి కుప్పకూలిపోయాడతను.

క్షణం తర్వాత బలవంతుడు తన్నిన తాపు ఎడమ మూత్రపిండానికి తగిలి కరెంట్ షాక్ తగిలినట్లు విలవిలలాడాడు రవి. కాని క్షణంలో తేరుకుని రెండడుగులు ముందుకు వేసి బలం కొద్ది కాలును వెనక్కి తన్ని కిందపడ్డ బలవంతుడిని ఎత్తి కిటికీ గుండా సందులోకి విసిరేసాడు రవి.

నొప్పిని లెక్క చెయ్యకుండా ముందుకు గెంతాడు రవి. ముందుకు గెంతుతూ



# మహా రుషులు కట్టిన గుడి!



దుర్గాదేవి అమ్మవారు



శ్రీ జనార్ధనస్వామివారి రథోత్సవం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో తూర్పు గోదావరి జిల్లాలో ఇప్పుడు మండపేట పేరుతో ప్రసిద్ధి కెక్కిన ఈ ఊరుని పూర్వకాలములో "మాండవ్యపురము" అనేవారు. పురాణ ఇతిహాసలలో మాండవ్యపురమునకు చాలా విశిష్టతవుంది. దానిలో భాగంగా ఆనాడు నారద మహర్షిచేత ప్రతిష్ఠించబడిన "శ్రీ జనార్ధన స్వామి దేవాలయం" ప్రసిద్ధి చెందింది. ఇదే ఆలయములో మరొక్కటి శ్రీ అగస్త్యేశ్వరస్వామి దేవాలయం. ఇది అగస్త్య మహర్షిచేత ప్రతిష్ఠించబడింది. అగస్త్య మహర్షి ప్రతిష్ఠించిన ఐదు శివాలయములలో ఇది ఒక్కటి. ఈ రెండు దేవాలయములేకాక "సీతా రామస్వామి ఆలయం", "సత్యనారాయణ స్వామి ఆలయం" కూడా ఇక్కడే ఉన్నాయి. నగరములో కెల్లా పెద్దదైన కారణమున పెద్ద గుడిగా, రథం ఉన్న కారణముగా రథం గుడిగా ప్రచారములోకి వచ్చింది.

ఈ దేవాలయాన్ని పెద్దాపురం సంస్థానం రాజా వత్సవాయి తిమ్మ జగపతిరాజుగారి హయాంలో అత్యంత సుందరముగా నిర్మించడమైంది. ఇప్పుడున్న రథంకంటె ఇంకా పెద్ద రథం కూడా ఆ కాలమున ఉండేది కానీ అగ్ని ప్రమాదములో అది చెడిపోయిన దృష్ట్యా దాని స్థానములో 1913 సంవత్సరములో "తణుకు పురుషోత్తము"గారి చేత రథము తయారు చేయించారు. ఇప్పుడున్న ఈ రథం ఎత్తు 28 అడుగులు. ఈ చుట్టుప్రక్కల ఇదే పెద్దదిగా చెప్పబడుతోంది. మకర సంక్రాంతి వెళ్ళిన నెల రోజుల లోపున వచ్చే భీష్మ ఏకాదశి పర్వదినమున శ్రీ జనార్ధనస్వావారు శ్రీదేవి, భూదేవి సమేతుడై అత్యంత సుందరముగా అలంకరించుకున్న రథములో కొన్ని వేలమంది భక్తుల ఆనంద పారవశ్యముల మధ్య నాలుగు రోడ్ల కూడలి అయిన కలువపువ్వు సెంటర్‌కి వస్తారు. మూడో రోజున తిరిగి యథాస్థానమునకి తిరిగి వస్తారు. ప్రతీ ఏటా రథసప్తమినాడు రథమును ఇవతలికితీసి అలంకరించుతారు. భీష్మ ఏకాదశినాడు కనీవినీ ఎరుగని జనసందోహముతో, పట్టణ పోలీసు గట్టి బందోబస్తుతో రథోత్సవం ఎంతో ఆనందముగా జరుగుతుంది.

## మరో మణిహారం

మండపేటలో గల కళావైభవానికి మరో గుర్తుగా నిలిచేది సత్యశ్రీ సినీ రోడ్‌లో దుర్గాదేవి ఆలయములో ఉన్న పెద్ద విగ్రహం. ఈ చుట్టుప్రక్కల ఇంత ఎత్తున్న దేవీ విగ్రహమేలేదు. 1989 సంవత్సరములో కేవలం మూడు మాసాల కాలములో 11 అడుగుల ఎత్తులో అందమైన దుర్గాదేవి విగ్రహాన్ని "ఈలి వీర్రాఘవులు" అనే శిల్పి (ర్యాలి)నిర్మించారు. నిత్యమూ పూజలు జరిగినప్పటికీ ప్రతీ ఏటా విజయదశమికి, ప్రతీ శుక్రవారం ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. ప్రధాన అర్చకులు శ్రీ రెడ్డి సుబ్రహ్మణ్యంగారు.

వ్యాసం : ఏలూరి శ్రీనివాస్,
ఫోటోలు : చక్కా రాంబాబు

# మోహినీతాండవం

కుడికాలు మోకాలు వద్ద వంచి జాపుతూ బలాన్నంతా చీలమండలో కేంద్రీకరించి బలవంతుడి మూతి మీద తన్నాడు.

'అబ్బా' అంటూ బాధతో మూల్గుతూ పడిపోయాడు బలవంతుడు.

మూడో వాడూ అందర్లో మొండి వాడూ 'ఓయ్' అని అరుస్తూ కాలితో బలంగా రవి పక్కటెముకల మీద తన్ని రెండు వేళ్ళను ఉక్కుకడ్డీల్లా మార్చి రవి తలను బలంగా వెనక్కు నెట్టాడు. కొంచెం వుంటే అతని వేళ్ళు రవి ట్రకియాను వొరసి వూపిరాడకుండా చేసేవే!

చప్పున వెనక్కు గెంతిన రవి ప్రత్యర్థి ప్రయోగిస్తున్న ముష్టి ఘాతాన్ని గమనించి తల పక్కకు తిప్పి అతని పిడికిలి తన బుగ్గమీదుగా రాసుకుపోయేలా చేసి తన మోచేతితో అతని మోచేతిని బంధించి గిర్రున వెనుదిరిగి చీలమండతో అతని పొత్తికడుపులో తన్ని అతని మోచేతిని మెలితిప్పాడు. టప్‌మని మోచేయి తొలగింది.

తొలగిన అతని మోచేయి వదలి వేళ్ళను ఉక్కు కడ్డీల్లా మార్చి మెడ మీద మోదాడు రవి. అతన్ని గిరగిర తిప్పుతూ మెడ మీద యిస్తున్న ఆ కరాటే దెబ్బలకు కుప్పకూలి రవి పాదాల ముందు వాలిపోయాడు మొండివాడు.

రవి మిగిలిన యిద్దర్నీ పరీక్షించి చూచాడు. వాళ్ళలో చలనం లేకపోవటంతో ముందుకు నడిచాడు.

## 17

జగ్‌నివాస్ హోటల్ 104వ నంబరు గది తాళం తెరుచుకు లోపలకు వెళ్ళి గది తలుపు లోపల గడివేసి సోఫా కిటికీ పక్కకు లాక్కుని కూర్చున్నాడు రవి.

కిటికీలోంచి వస్తున్న చల్లటి గాలిని పీలుస్తూ వంట్లో వున్న నొప్పులను పోగొట్టుకోవాలని ప్రయత్నించసాగాడు.

కనులు మూసుకుని మనో నేత్రం తెరచి చూస్తున్న రవికి మోహిని, డేవిడ్, కపర్ది కనపడ్డారు.

డేవిడ్ అబద్ధం చెప్పలేదనిపించిందతనికి. కీలకం తెలుసుకోవాలంటే కైలాసగిరి కొండ అడవులను చూడాలని అనుకున్నాడు.

"కపర్దితో ఒకసారి మాట్లాడితేనో?' దవడ కింద ఏదో పాకినట్లయి ఉలిక్కిపడిలేచాడు.

ఎదురుగా రేఖ-ఆమె ముఖంలో ఆందోళన "ఏమిటి రవీ-యిలా ఎర్రగా కమిలిపోయి వుందేం? " దవడ కింద

చేతి వేళ్ళతో రాస్తూ అంది.

రవి సమాధానం చెప్పలేదు.

"షర్ట్ యిలా చినిగి వుందే-అమ్మో ఏమిటిలా చెక్కుకుపోయింది?" ఛాతీ ఎడమ వైపున మెట్ట తామరపూవులా ఎర్రగా వచ్చగా వున్న ప్రాంతాన్ని చొక్కా చిరుగులోంచి చూస్తూ అంది.

"మన రాక అలజడి సృష్టిస్తున్నది-వాళ్ళెవరైందీ మాత్రం తెలీలేదు. కొంత సేపటి క్రితం ముగ్గురు జూడో ఫైటర్లు నన్ను ముట్టడించి బాధించాలని చూచి భంగపాటు చెందారు."

"బాబోయ్"

"రేఖా వాళ్ళు నన్నెప్పట్నుంచీ వెంట డిస్తున్నది తెలియదు. కాని వాళ్ళు నిన్ను భీంని గూడా గమనించారేమో".

"రవీ నాకేమిటో భయంగా వుంది. నీకేం కాలేదు గదా?"

"ఏమీ కాలా-గొంతు మీద తగిలిన కరాటే చాప్‌తో రెండు మూడు రోజుల పాటు బొంగురు గొంతుతో మాట్లాడాలి అంతే-వంట్లో బెణుకులు, నొప్పులూ, నన్నేంచేయవు. నేను వాటిని లెక్కచేయను!"

"రేఖా నువ్విక్కడికెలా వచ్చావు?"

"భీం 105 రూము బుక్ చేసుకున్నాడు. ఈ రూం నీపేర అదే మారు పేర బుక్ అయివుంది. నేను 103 రూం తీసుకున్నాను. ఆ రూం నుండి యీ రూముకు వచ్చే వాకిలి తలుపు గడి హెయిర్ పిన్ వంచి తీసి లోపలకు వచ్చాను."

నువ్విక్కడ సోఫాలో కూర్చుని వుండటంతో నీ దగ్గరకు వచ్చాను.

నువ్వేమో వళ్ళంతా గాయాలతో కనపడ్డావు.

"భీం కనపడ్డాడా! ఎనీ ప్రోగ్రెస్?"

"భీం కనపడలేదు! రవీ ఘవార్ అంటే ఏమిటో తెలిసింది."

"ఏమిటి రేఖా?"

"హూవర్ డైరీలో భస్మాసురలో ఘవార్ కన్న ఎక్కువ అయిల్ నిల్వలున్నాయని రాసి వుంది."

ఘవార్ అంటే ప్రపంచంలో కెల్లా ఎక్కువ నిల్వలున్న అయిల్ ఫీల్డ్-సౌదీ అరేబియాలో వుంది.

"భస్మాసుర ఎక్కడుందో?"

"పేరును బట్టి అది భారతదేశంలోనే ఎక్కడో వుందని అనిపిస్తుంది!"

"నువ్వు చెప్పేది ఆలోచించవలసిన

## భ్రాంతి

సంక్రాంతొచ్చేసిందని సంబరపడుతున్నావా తమ్ముడూ!
గొబ్బెమ్మల సందడికే తొందరపడుతున్నావా అమ్మడూ!!
ఎలా పండుగ జరుపుకొందామని?
ఏ పిండి వంటలు తిందామని???
భోగిమంటలు.... బసవన్నలు....
మేలుకొలుపులు.... రంగవల్లులు....
ఇంతేనా సంక్రాంతంటే!
ఏ ఒక్క ముంగిటో భాగ్యం పొంగిపోతే చాలా?
ఏ ఒక్క సౌధానో వెలుగు నిండిపోతే చాలా?
పండగంటి పూటా పస్తులున్న వాణ్ని పలకరించనక్కర్లా?
పక్కవాడి కష్టాలూ కన్నీళ్ల గూర్చి విచారించనక్కర్లా?
మొన్నటి దారుణాలు మిగిల్చిన కన్నీటి తరగలింకా యింకనేలేదే!
నిన్నటి మారణహోమాల రక్తపు మరకలింకా ఆరనే లేదే!
రథ చక్రాల రాక్షస చప్పుళ్ళింకా మణగనేలేదే!
లేత కళేబరాలు కాలుతున్న వాసనలింకా మలగనే లేదే!
తడారిపోయిన పెదవుల్లా చీళ్ళు వారిన పొలాలూ
తుపాను తాకిడితో వల్లకాళ్ళయిన ఊళ్ళూ వాడలూ
పచ్చి పుళ్ళయి ఇంకా సలుపుతూనే ఉన్నాయి
తుమ్మ ముళ్ళయి ఎదల్ని కెలుకుతూనే ఉన్నాయి
ఇదిగో ఇక్కడ.....
అల్లుణ్ని చూసి హార్టాగిపోయిన మధ్యతరగతి మామ.
అదిగో అక్కడ.....
ఆత్మాహుతి కోసం అగ్గిపుల్ల గీస్తున్న రమణీలలామ
ఇటు చూడు....
రుణాల రొంపిలో కూరుకుపోయిన సన్నకారు రైతన్న
అటు చూడు....
జాతి వెన్నెముక నుండి జారిపోయిన మణిపూస.
ఇక కవుల సంగతంటావా....
పితృవనంలో సంతర్పణ కోసం
సమ్మేళనాల సంభావన కోసం
సత్యాల చెప్పులు తొక్కి
స్వప్నాల ఛత్రం విప్పి
కాలం చెల్లిన ఈ కవితా వస్తువుతో
కళ్ళాల్లేని గుర్రాలెక్కి విచ్చేస్తారు!
మకర రాశిలో సూర్యుణ్ని
పిడికిట బిగించి ఎర్రజండాకు గుచ్చేస్తాడొకడు!
మొసలికన్నీళ్ళతో బాపూజీ కంకిత మిచ్చేస్తాడింకొకడు!
మరొకడు.....
ప్రేయసి ముఖాని కంటించేసి ముచ్చటపడిపోతాడు!
ఇదీ నేటి సంక్రాంతి!
ఇరులూ మంచుతెరలూ వీడినా
తెరచుకోని అంతర్నేత్రానికి
ఇది మిథ్యా ప్రభాత భ్రాంతి!!

–పి. వి. నరసింహారావు

విషయమే!" రేఖ మాట్లాడకుండా రవి ఛాతీ మీద కమిలి వున్న చర్మాన్ని సవరిస్తూ కూర్చుంది.

"రేఖా ప్రపంచంలోకెల్లా పెద్ద ఆయిల్ నిల్వను ఎవరికీ తెలియకుండా ఎంత కాలం దాచిపెట్టగలరు?"

"ఏమో రవీ-భీం ఏమైనా వివరాలు తెలుసుకోగలిగాడేమో-వెళ్ళి కనుక్కుంటాను!"

"రేఖా-నువ్వు వీధుల్లో తిరగటం అంత మంచిది కాదు! మన ప్రత్యర్థులను గురించి తక్కువ అంచనా వేసుకోవటం తెలివి తక్కువ పని! అదీగాక మన ప్రత్యర్థులను యింకా గుర్తించనేలేదు!"

"అలాగే రవీ-నువ్వు చెప్పినట్లే చేస్తాను! కాని నువ్వు జాగ్రత్తగా వుండు. నీకు ఏదైనా జరిగితే-"

"నీ తండ్రి వ్యాపార సంస్థలకు ఇతరులు చెరుపు చెయ్యకుండా చూడటానికి మరొకడు దొరకుతాడు!"

"రవీ-నన్ను నీ మాటలతో అవమానపరుస్తున్నావు! ఇంతకంటే నువ్వు లేచి బలంగా ఆ చెంపా యీ చెంపా వాయిస్తే ఎక్కువ సంతోషపడేదాన్ని!"

"వూరికే అన్నాలే రేఖా!" ఉడికిపోతుంటే ఎంతో అందంగా వుంటావు తెలుసా!

"రవీ" అంటూ దగ్గరైన రేఖను రవి కౌగిలిలో బంధిస్తున్న సమయంలో 105 గది నుండి వచ్చిన భీం.

"సారీ బాస్-" అంటూ వెనుదిరిగి వెళ్ళబోయాడు.

చప్పున రవి కౌగిలి నుండి విడిపోయి సోఫాలో కూర్చుంది రేఖ.

"ఏమిటి భీం? ఎనీ ప్రోగ్రెస్?!"

"వళ్ళంతా కోతి పీకి పెట్టింది!"

"ఏమిటి భీం?!"

"వూరికే వుంటం ఎందుకులే అని వూరంతా తిరిగాను. జనం మాట్లాడుకునే విషయాలు వింటూ బజార్లో వచార్లు చేసాను."

పిచోలా సరసు దగ్గర ఇరానీ హోటల్ వుంటే టీ తాగుదామని వెళ్ళా.

బాస్ టీ అద్భుతంగా వుందనుకో!

"భీం-కోతి ఎందుకు కరించిందంటే హరికథ చెబుతావేం?"

# మీకు తెలుసా?

## అతిపిన్న వయసులో క్రికెట్ క్యాప్టెన్

ప్రపంచంలో పిన్నవయసులోనే క్రికెట్ క్యాప్టెన్ అయిన ఘనత మన్సూర్ అలీఖాన్ పటౌడీకి దక్కుతుంది.1962 మార్చిలో



బార్బడోస్‌లోని బ్రిడ్జిటౌన్‌లో వెస్టిండీస్‌తో జరిగిన పోటీలో భారత జట్టుకు నాయకత్వం వహించాడు.అప్పుడు అతని వయసు 21 సంవత్సరాలే.

## వరుసగా మూడు టెస్టులు గెలిచిన క్యాప్టెన్

వరుసగా మూడు క్రికెట్ టెస్టులు గెలిచిన తొలి క్యాప్టెన్ అజిత్ వడేకర్. అతని నాయకత్వంలో 71లో రెండుసార్లు, 72- 73లో ఒకసారి మన క్రికెట్‌జట్టు విజయం సాధించింది.

## ఎక్కువ టెస్టు ఓటమిలు పొందిన క్యాప్టెన్

ఎక్కువ క్రికెట్ టెస్టు మ్యాచ్‌లలో ఓటమి పొందిన క్యాప్టెన్ పటౌడి. 1962 – 1975 మధ్య పటౌడి నాయకత్వంలో పాల్గొన్న 40 టెస్టు పోటీలలో 19 పోటీలలో మన జట్టు ఓటమి చవిచూడగా 9 పోటీలలో గెలుపొందింది. 12 పోటీలు డ్రా అయ్యాయి.

## ఎక్కువ భారత్ స్కోరు

1986లో కాన్పూరులో జరిగిన క్రికెట్ టెస్టులో భారత్ 7 వికెట్లకు 676 పరుగులు చేసింది. కాని ఆ పోటీ డ్రాగా ముగిసింది.

## ఒకేరోజు రెండు సార్లు ఓటమి

క్రికెట్ టెస్టు పోటీలో ఒకేరోజు రెండుసార్లు ఓటమి చవిచూసిన ఘనత ప్రపంచంలో మనదేశానికే దక్కుతుంది. మాంచెస్టర్‌లో 1952లో ఇంగ్లండ్‌తో జరిగిన పోటీలో 58, 82 పరుగులతో ఒకేరోజు రెండుసార్లు మనజట్టు ఓటమి చవిచూసింది.

## ఎక్కువ మ్యాచ్‌లు డ్రా చేయించిన క్యాప్టెన్

ఎక్కువ క్రికెట్ టెస్టు మ్యాచ్‌లు డ్రా చేయించిన ఘనత గవాస్కర్‌దే. 1976



నుంచి 1985 వరకు సునీల్ గవాస్కర్ నాయకత్వంలో మనజట్టు పాల్గొన్న 47 టెస్టులలో 30 టెస్టులు డ్రా అయ్యాయి. 9 టెస్టులు గెలుపొందగా, 8 టెస్టులలో మన జట్టు ఓటమి చవిచూసింది.

సేకరణ : తిలక్

"వుండు బాస్ చెప్పనీ-కప్పు టీకి రెండు రూపాయలు తీసుకున్నాడు ముఖరం-అతనా హోటల్ ప్రొప్రయిటర్."

హోటల్ అంటే చిన్న రేకుల షెడ్. లోపల వంట చేస్తారు. పిచోలాసరసు వొడ్డున కుర్చీలు బల్లలు వేసి టీ సర్వ్ చేస్తారు.

టీలో యాలకులు, బిస్కట్ పొడి, సెంట్, నిమ్మరసం కొద్దిగా నల్లమందు వేసాడని నా అనుమానం!

"హోటల్ వోనరు బుద్ధిపోనిచ్చుకున్నావు గాదు. అయినా భీం అసలు విషయం చెప్పక యీ సోది ఏమిటి"

"చెబుతున్నా చెబుతున్నా-సరస్సు మీద నుండి వచ్చే శీతల పవనాలు హాయిగా పీలుస్తూ టీ తాగుతుంటే ఎక్కడ లేని వుషారొచ్చి యీల వేసాను."

ఇక చూస్కో బాస్ రేకుల షెడ్ మీద నుండి కాళి కాంబలా మీద దూకింది ఆడ కోతి.

పీకి, రక్కి, జుట్టు పట్టుకు గుంజి అందిన చోటల్లా కొరికి వదిలింది.

"బాబోయ్ యిదేం కోతయ్యా ముఖరం అని గోలెట్టాను-అతను వచ్చి కోతిని తీసుకువెళ్ళి కట్టివేసాడు."

ఆ కోతి మంచిదేనంటగాని ఎవరయినా విజిల్ వేస్తే మటుకు మీదబడి పీకుతుందట! విసుగ్గా చెవులు మూసుకున్నాడు రవి.

"చెబుతున్నా బాస్-ముఖరం ఇదివరకు కాంబేపోర్టులో టీ షాపు నడిపేవాడట. అక్కడ వచ్చేపోయే వోడలు వేసే విజిల్ కలవాటుపడిన కోతి ఉదయపూర్ వచ్చాక అలాటి ధ్వని వినపడితే చాలు మీదపడి పీకుతుందట వుషారొచ్చి!"

# మోహినీతాండవం

"వోడ విజిల్ లాగా యీలవేసావన్న మాట" అన్నాడు రవి.

పక్కున నవ్వింది రేఖ

"చెబుతున్నా-ముఖరం భాయ్ కాంబే నుండి ఎందుకొచ్చావ్?" అన్నా.

అప్పటికే మందు మీదున్నాడు. పైగా నన్ను కోతి పీకటంతో నా మీద సానుభూతి కల్గినట్లుంది.

'భాయ్ ఏం చేయమంటావు అన్నను చంపేసారు భయపడి వచ్చేసా' అన్నాడు.

"ఎందుకు చంపారు? ఎవరు చంపారు?"

అన్న వద్దంటున్నా వినకుండా స్మగ్లింగ్ చేసే వాడు. పడవ వేసుకుని చేపలు పట్టేవాడిలా సముద్రంలోకి వెళ్ళి విదేశీ మద్యం, వాచీలు, బంగారం తెచ్చియిచ్చి కిరాయి తీసుకునే వాడు.

ఒకరోజు రాత్రి అరే ముఖరం సముద్రంలో పదిహేను మైళ్ళుపోయాక విడ్డూరం వొకటి కనపడిందిరా అన్నాడు.

"ఏమిటన్నా?" అని అడిగా.

సముద్రం అడుగున తిరిగి చూడటానికి తగిన పరికరాలున్నాయి అన్న దగ్గర

"సముద్రం అడుగున చాలా వోడల బారులు తీర్చి వున్నాయిరా! పరీక్షగ చూస్తే అందులో ఒక వోడ నుంచీ కొద్ది కొద్దిగా అయిల్ లీక్ అవుతూంది!' అన్నాడు.

అన్న నాకా మాట చెప్పి అవతలకు వెళ్ళాడు పెద్దగా అరుపులు వినపడితే పది నిముషాల తర్వాత వాడి యింటికి వెళ్లా.

గొడ్డళ్ళతో నరికి చంపారన్నను. భయంతో స్పృహ తప్పిపడిపోయా.

అన్నను ఖననం చేసాక బిచాణా ఎత్తేసి యిలా వచ్చేసా! ఇక అక్కడ వుండలేకపోయాను.

ఎవరికీ యీ విషయం చెప్పకేం "అన్నాడు ముఖరం".

రవి, రేఖా వొకరి ముఖాల వంక వొకరు చూసుకున్నారు!

"బాస్ మనం కాంబే వెళ్ళి సముద్ర గర్భంలోని వోడలను చూడాలి!"

"చూద్దాం భీం-ముందిక్కడ కైలాసగిరి వెళ్ళి కపర్దిని కల్సుకోవాలి."

జర్నలిస్ట్ననీ ఇంటర్వ్యూ చేయాలనుకుంటున్నాననీ ఫోన్ చేసి పర్మిషన్ అడిగాను

కపర్ది అనుమతి దొరికింది. వెళ్ళాలి.

"ఇలాగే వెళ్తావా రవీ?" ఆశ్చర్యంగా అడిగింది రేఖ.

చప్పున బాత్‌రూంలోకి వెళ్ళి స్నానం చేసి వచ్చి స్క్రీన్ అవతల దుస్తులు మార్చుకుని వస్తా రేఖా-వస్తా భీం మళ్ళీ కలుద్దాం అంటూ వెళ్ళిపోయాడు రవి.

"ఏం చేద్దాం రేఖా?"

"ఇరానీ హోటల్ దగ్గరకు వెళ్దాం. ముఖరం నడిగి కొన్ని విషయాలు తెలుసుకోవాలి?"

"బాబోయ్ నాకు భయం నేను రాను."

"ఈల వేయకపోతే కోతి ఏం చెయ్యదు. అదీగాక వెళ్ళేప్పుడో అరటి గెలపట్టుకు వెళ్దాం. కోతి అరటి కాయలు తింటూ వుంటుంది. మనం ముఖరంతో మాట్లాడుతూ వుందాం!"

"సరే!"

*[ఇంకా వుంది]*




# చలన చిత్ర పితామహుడు
# దాదాభాయ్ ఫాల్కే



– ఆరిపాక సూరిబాబు

భారతీయ సినిమా అవిర్భావానికి మూలపురుషుడు దండిరాజ్ గోవింద దాదాభాయ్ ఫాల్కే. రమారమి ఎనభై ఏళ్ళ క్రితం ఇతను సినిమా నిర్మాణానికి తన సంపదను, శక్తి యుక్తులను పరిపూర్తిగా అర్పించిన కళా తపస్వి సినిమా అన్ని హంగులతో కళావిలసితంగ ఉండాలని అహర్నిశలు కృషి సల్పి చిత్రాలు తీసేవాడు సినిమా సాంకేతిక పరిజ్ఞానంలో అఖండ మేధా సంపత్తి కల వాడుగా కీర్తి నార్జించాడు

భారతీయ చలనచిత్ర పితామహుడైన ఈయన తీసిన చిత్రాలు మనం చూడక పోయినా, ఈ ప్రజ్ఞానిధి గురించి మనం తెలుసుకోవడం ఎంతో అవసరం

నాసిక్‌కి సుమారు 18 మైళ్ళ దూరంలో వున్న త్రయంబక్ అనే ఊళ్ళో సంస్కృత పండితునికి కుమారుడుగా ఫాల్కే జన్మించాడు 1870 సం లో చిన్న తనం నుంచి ఆయనకు పురాణాలు, చరిత్రలను తెలుసుకోవాలనే తపన కల్గుతుండేది

బొంబాయి, బరోడాలలో విద్యాభ్యాసం పూర్తి చేశారు చిత్రలేఖనం, ఛాయచిత్రణ గురించి ఉత్సాహం, నేర్చుకోవాలనే సంకల్పం కలిగాయి కృషితో వీటిని సాధించారు, ఆ నాటి నా .ఉక సంస్థల వారికి న్ను ఎయింట చేసేవారు ఫొటోలు తీస్తుండేవారు

భారతదేశంలో వర్ణ చిత్రాల అచ్చు యంత్రాలు అప్పటికి లేవు ఫాల్కేకి వర్ణ చిత్రాల అచ్చు యంత్రం తెప్పించాలనే కోరిక కల్గింది జర్మనీ దేశం వెళ్ళి అవసరమైన అచ్చు యంత్రం, ఇతర పరికరాలు కొనుక్కొని వచ్చి పని ప్రారంభించారు తొలి వర్ణ చిత్ర ముద్రాపకుడిగా అతని కీర్తి చిరస్థాయి చేసుకున్నాడు

## చిత్ర నిర్మాణంపై అధ్యయనం

1903 సం లో మానక్ సేతీ అను వ్యక్తి "క్రీస్తు జీవితం" అనే మూకీ చిత్రాన్ని బొంబాయిలో ప్రదర్శింప జేశాడు ఆ నాడు మోటార్లు, ప్రొజక్టర్స్ గాని లేవు. విద్యుత్ శక్తి లేని ఆ రోజుల్లో చిన్న యంత్రంలో ఫిల్ము బిగించి– ఆపరేటర్ చేతో హేండిల్ తిప్పుతుంటే ఎదుటి తెరపై బొమ్మ పడుతుండేది ఈ చిత్రం నిడివి 2 వేల అడుగులు ఈ విదేశీ మూకీ చిత్రాన్ని బొంబాయి ప్రజలంతా చూచి ఆనందించారు దాదాభాయ్ ఫాల్కే కూడా ఈ చిత్రాన్ని చూశారు అందరిలాగ చూచి ఆనందించడమే కాకుండా, భారతీయ దేవుళ్ళను ఇలాంటి తెరపై చూడగల్గితే ఎంతో బాగుండును. అనుకున్నారు మొదట్లో

అప్పుడు ప్రదర్శింపబడే ప్రతి విదేశి మూకీ చిత్రమూ ఫాల్కే చూస్తుండేవారు అవి అలా చూడ్డంతో తనలో నూతన భావాలు ఉదయించ సాగాయి తను సినిమా నిర్మాణ సాంకేతిక పరిజ్ఞానం అభ్యసించాలని నిర్ణయించుకున్నారు విదేశాల నుంచి చిత్ర నిర్మాణానికి సంబందించిన పుస్తకాలు తెప్పించి అధ్యయనం జేసేవారు

## తొలి మూకీ చిత్రం

ఎట్టకేలకు నానా తంటాలు పడి డబ్బు ప్రోగుజేసి ఇంగ్లాండు బయలుదేరి వెళ్ళారు ఫాల్కే కెమెరా, ఫిల్ము, రసాయనాలు వగైరా కొనుక్కొని బొంబాయి తిరిగి వచ్చారు తాను సినిమా తీయాలనే సంకల్పం బలపడింది అహర్నిశలు కృషి చేసి తన ఊహలకి



"రాజా హరిశ్చంద్ర" కథా విధానం పరిశోధనలో

# దాదాభాయ్ ఫాల్కే

రూపం కల్పించడానికి 6 నెలలు కాలం పట్టింది. ఫలితంగా "రాజా హరిశ్చంద్ర" అనే తొలి భారతీయుల మూకీ చిత్రం తయారయి 3-5-1913న బొంబాయి కొరొనేషన్ థియేటర్‌లో విడుదలయింది. నాల్గు రీళ్ల చిత్రం 3700 అడుగుల నిడివిగల ఈ చిత్రానికి బహుళ జనాదరణ లభించింది. ఆ నాటి ప్రతి భారతీయుడు ఈ చిత్రాన్ని చూచి ఆనందించి ప్రశంసించారు.

'రాజా హరిశ్చంద్ర'లో తనే ప్రధాన పాత్ర నటించి, నిర్మాణం, దర్శకత్వం, ఎడిటింగ్, ఛాయాగ్రహణం వగైరా శాఖలన్నీ నిర్వహించాడు. తన కొడుకు బాలచంద్ర ఫాల్కే లోహితాశ్యుని పాత్ర వేశాడు. తన మిత్రుడు చేత తారామతి పాత్ర ధరింప జేశాడు. అతని పేరు సాలుంకే.

హరిశ్చంద్ర చిత్రం తీయడానికి ఫాల్కే చాలా కష్టపడ వలసి వచ్చింది. మొదట్లో పెట్టుబడి పెట్టే వారెవరూ ముందుకు రాలేదు. తన దగ్గర నిర్మాణానికి కావలసిన పూర్తి సొమ్ము లేక పోవడం చేత తన భార్యను ఒప్పించి ఆమె నగలు తాకట్టు పెట్టి, ఆ డబ్బుతో ఎనిమిది మాసాల కృషితో చిత్రాన్ని పూర్తి చేసి విడుదల చేసాడు.

చిత్రం ఘనవిజయం సాధించింది. ఫాల్కే శ్రమ ఫలించింది. వెంటనే "మోహినీ - భస్మాసుర" చిత్రాన్ని ఆరంభించాడు. స్త్రీ పాత్రలను స్త్రీల చేతనే వేయించడానికి ప్రయత్నించాడు. కమల, దుర్గాబాయి భేటీలతో ఈ చిత్రం తీశాడు. దీని తర్వాత 'సావిత్రి' చిత్రం తీశాడు. ఈ రెండు చిత్రాలు విశేషాదరణ పొందాయి.

తను తీసిన మూడు చిత్రాలను 1914 సం.లో లండన్ తీసుకువెళ్లి అక్కడ ప్రదర్శింప జేశాడు. అక్కడ కూడా జనం విపరీతంగా చూచి ఆంగ్లేయులు - ఫాల్కే ప్రతిభా విశేషాలను ప్రశంసించారు.

ఒక బ్రిటిష్ నిర్మాత ఫాల్కేని లండన్‌లో వుండి మీరు చిత్రాలు తీయవలసిందని కోరాడు. అందుకు ఫాల్కే నిరాకరించి, తనకు కావలసిన యంత్ర పరికరాన్నీ కొనుక్కొని బొంబాయి తిరిగి వచ్చేసాడు. తర్వాత ఎన్నో నూతన ప్రయోగాలు సల్పి చిత్రం నిర్దుష్టంగా, కళావిలసితంగా వుండడానికి దీక్షతో చిత్రాలు తీయసాగాడు

## లంకాదహనం

శ్రీకృష్ణ జన్మ, లంకాదహనం, కాళీయ మర్దన మొదలయిన చిత్రాలు తీశాడు. ఈ చిత్రాలు ప్రేక్షకుల దృష్టిని బాగా ఆకర్షించాయి. 'కాళీయ మర్దన'లో కృష్ణుడుగా తన కూతురు మందాకిని నటించింది. ఈ విధంగా 1917 సం. వరకు 'ఫాల్కే ఫిలిమ్స్' సంస్థ పేరుతో 23 చిత్రాలు తీశాడు. ఈయన తీసిన చిత్రాల్లో 'లంకా దహనం' చిత్రానికి అధికమైన ఆదాయం లభించింది హాలు వద్ద నుంచి చిల్లర డబ్బుని బండ్ల మీద పోలీసుల సహాయంతో తీసుకు రావలసి వచ్చిందట!

ఈయన తీసిన ఈ పౌరాణిక చిత్రాలన్నింటిలో తాంత్రిక ఛాయా గ్రహణం ప్రేక్షకుల్ని సమ్మోహితులను చేసింది. మేఘాలలో నించి అప్సరసలు రావడం, శివుని మూడో నేత్రం చూపడం, కృష్ణుని మాయలు, బుర్ర కోసి బుర్ర మళ్లా అతకడం వంటి దృశ్య చిత్రీకరణ సాధ్య మవుతుందని నిరూపించు కున్నాడు ఫాల్కే.



మన తెలుగు చిత్రాలు కుబేరా వారి "మైరావణ, సేతు బంధనం చిత్రాలకు ఫాల్కే ప్రత్యేక తాంత్రిక ఛాయాగ్రహణం నిర్వహించాడు.

## 97 చిత్రాలు

భారతీయ చిత్ర పరిశ్రమకు మూలపురుషుడైన ఫాల్కే తన జీవిత కాలంలో 97 చిత్రాలు తీశాడు. 1935 సం.లో కొల్హాపూర్ సినీటోన్ వారి "గంగావ తరణం" చిత్రానికి దర్శకత్వం వహించాడు. ఇది ఫాల్కే తీసిన తొలి టాకీ, తన ఆఖరి చిత్రము. ఫాల్కే చిత్ర పరిశ్రమపై విసుగు చెందాడు. "నాకు సినిమా రంగంపై విసుగు పుట్టింది. నేను డబ్బు కోసం చిత్రాలను నిర్మించలేను. చక్కటి యితివృత్తాలను ఉత్తమ కళా విలువలతో చిత్రాలు నిర్మించలేనపుడు ఈ రంగంలో నేను వున్నా ఒకటే, లేకున్నా ఒకటే అని భావిస్తున్నాను" అని వెల్లడించా డానాడు

22 సంవత్సరాలు నిర్విరామంగా చిత్ర నిర్మాణ కార్యకలాపాలు కొనసాగించాడు. శారీరకంగా, మానసికంగా చిత్ర నిర్మాణంపై ఉత్సాహం అంతరించి పోయింది. 1935 సం. నుంచి 1944 సం. వరకు ఈ పదేళ్ల కాలంలో సంపాదించిన ధనం అంతా ఖర్చయి పోయింది. ఆరోగ్యం క్షీణించింది చిన్న ఇంట్లో దుర్భర దారిద్ర్యంతో బాధపడ వలసి వచ్చింది నాసిక్‌లోని తన స్వగృహంలో.

ఎందరినో వెలుగులోకి తీసుకు వచ్చిన ఫాల్కేని చరమ దశలో ఎవరూ ఆదుకో లేదు. వి.శాంతారామ్- ఫాల్కే చిత్రాల్లో పని చేయక పోయినా ఆయన యందు భక్తి గౌరవాలతో వారింటికి వెళ్లి పరామర్శించి ఏదో సాయం చేసేవాడు.

సామాన్య కుటుంబంలో జన్మించి, అసామాన్య వ్యక్తిగా తన సామర్థ్యాలను చూపి 16-2-1944న మృత్యువాత పడ్డాడు, తను జన్మించిన నాసిక్‌లోనే.

నిర్మాత- దర్శకుడు- నటుడు- ఛాయాగ్రాహకుడు- కూర్పు దారుడుగా



"రాజా హరిశ్చంద్ర"లో ఒక దృశ్యం

తన బాధ్యతలను ప్రతిభావంతంగా నిర్వహించి అందరి మన్ననలను అందుకున్నారు

మద్రాసుకు ఏదో సందర్భంగా ఫాల్కే వచ్చినప్పుడు వాహినీ వారి "దేవత" ప్రత్యేక ప్రదర్శన చూసి దర్శకుడు బి యన్ రెడ్డి ప్రతిభను అభినందించాడు

## ఫాల్కే రోడ్

ఫాల్కే మరణానంతరం బొంబాయిలో అయన విగ్రహాన్ని ప్రతిష్ఠించి "దాదాబాయి ఫాల్కే రోడ్ పేరుతో పెద్ద కూడలికి నామకరణం చేశారు

1970 సం ఫాల్కే శత జయంతి బొంబాయి నగరంలో మహా వైభవోపేతంగా జరుప బడింది ఈ సంవత్సరం నుంచే ఫాల్కే సంస్మరణార్థం భారత ప్రభుత్వం అయన పేరు మీద సినిమా పరిశ్రమకు ఉత్తమ సేవ లందించిన కళాకారులకు "ఫాల్కే అవార్డు" ప్రదానం చేయడం అరంభించింది

ఫాల్కే తీసిన ఒక్కో చిత్రానికి 10 నుంచి 15 వేల రూపాయలు ఖర్చు అయ్యేది నిర్మాణ కాలం మూడు నెలలు పట్టేది అతని వద్ద శాశ్వత సిబ్బంది నటీనటులు, సాంకేతిక శాఖల్లో పని చేసే వారు కలిపి 95 మంది పని చేసేవారు అన్ని శాఖల వారికి ఫాల్కే శిక్షణ నిచ్చేవాడు

## తొలి ప్రత్యేక ప్రచారం

హరిశ్చంద్ర చిత్రానికి బొంబాయి, ఇతర ప్రాంతాల్లో బాగా జనాదరణ లభించింది ఈ చిత్రాన్ని సూరత్‌లో ప్రదర్శిస్తే జనం చూడ్డానికి రాలేదు ఫాల్కే ఈ పరిస్థితికి నివ్వెర పోయాడు

సూరత్‌లో ప్రదర్శించే థియేటర్ యజమానితో ఈ విషయం చర్చించగా, అతనేమన్నాడో తెలుసా?

"ఇక్కడి ప్రజలు రెండణా లిచ్చి సుమారు మూడు గంటల పాటు కళ్ళముందు నటీనటులతో పాటలు— మాటలు— ఆటలతో నాటకాలు చూడ్డానికి అలవాటు పడ్డారు గట్టిగా గంటన్నర అడని నీ బొమ్మ చూడ్డానికి మూడణా లిచ్చి ఎవరు చూస్తారు?" అన్నాడా పెద్ద మనిషి ఫాల్కే ఆలోచనలో పడ్డాడు ప్రచార విధానంలో కొత్త విధానం ప్రవేశ పెట్టాడు ఆ ప్రచార కరపత్రం ఇలా వుంది:—

"57 వేల ఫొటోలతో కూడిన రెండు మైళ్ళ నిడివి గల చిత్రం ఈ చిత్ర ప్రదర్శన టిక్కెట్టు కేవలం మూడు అణాలు మాత్రమే!"

ఈ ప్రకటన ఊరంతా ప్రచారం గావించాడు. దీంతో జనం తండోప తండాలుగా వచ్చి చిత్రం చూడసాగారు

ఫాల్కే భారతీయ తత్వాన్ని ఎంతో గౌరవించే వాడు, దైవ భక్తి, మత విశ్వాసం, సాంప్రదాయాలపై మక్కువ వల్ల అన్నీ పురాణ గాథలనే చిత్రాలుగా తీశాడు

తన పేరుతో వున్న సంస్థను "హిందూస్థాన్ ఫిలిం కంపెనీ గా మార్చి చిత్ర నిర్మాణం సాగించాడు

నాసిక్‌లోనే చిత్రాలు తీసేవాడు బొంబాయిలో ప్రధాన కార్యాలయం వుండేది

1923 సం ప్రాంతాల్లో "టిలిగ్రాం", "గ్లాస్ ఫ్యాక్టరీ' అనే వార్తా విశేష చిత్రాలు కూడా తీశాడు

సినిమా సాంకేతిక అభివృద్ధి పరచుకోడానికి గాను మూవింగ్ పిక్చర్స్, బయస్కోప్ వంటి పత్రికలకు విదేశాలకు చందా కట్టి తెప్పించుకుని చదివే వాడు

చిత్రీకరణకు కావలసిన విద్యుచ్ఛక్తికి రెండు ఇంజన్లు, రెండు డైనమోలతో ఉత్పత్తి చేసుకొని తీసేవాడు చిత్రాలను

సినిమా సాంకేతిక పరిజ్ఞానాన్ని కూలంకషంగా తెలుసుకొని, భారతీయ సినీ జగతికి ఆద్యుడిగా, చిరస్మరణీయుడుగా మన మంతా ఆయనకు జేజేలు అర్పించక తప్పదు

30-4-1870న జన్మించిన ఫాల్కే తన జన్మను సార్థకం చేసుకున్నాడు ○

# ఈవారం లో మీ యోగం

**11-1-1991 శుక్రవారం మొదలు 17-1-1991 గురువారం వరకు**

**మేషం** పత్రికారంగాన శ్రమించు వారికి, పాత్రికేయులకు, 'పిక్చర్సు' కొనుగోలు చేయువారికి, రాజకీయవేత్తలకు అనుకూలత గలదు సభా మర్యాద యున్నది మాటల చాకచక్యంతో, కొన్ని వ్యవహారాలు సానుకూలమవుతాయి స్త్రీలకు: ఆదాయమందు స్వల్ప పెంపు

**వృషభం** దూర ప్రాంతాలకు వెళ్ళవల స్థితియందు పెంపు నూతన మిత్ర సమాగమం ఆప్తమిత్ర సందర్శనం చుట్టు ప్రక్కల గమనించి మెలగాలి స్త్రీలకు అనవసర తగాదాలు, యిబ్బందులు రావచ్చు గ్రహించండి

**మిధునం** సజ్జన సాంగత్యం, ధనవసతి, యత్న కార్యసాధనం, పెద్దల సహకారం, శుభ కార్యాచరణం, యిత్యాది సకల శుభములు జరుగుటకు 'ద్వితీయ 'గురు' గ్రహానుకూలత గలదు ప్రయత్నించాలి కాని, ధనరాబడికి లోటు లేదు స్త్రీలకు: వస్తు, వస్త్ర సేకరణ, శుభ వ్యవహారాలు

**కర్కాటకం** గురుని ఆశీస్సులు లేవు ఆరోగ్యరీత్యా బహు జాగ్రత్తపడాలి వృత్తియందు చెప్పదగిన మార్పు రావచ్చు కార్యం భారమైనదే. నెత్తిన పడుతుంది ఎలా సర్దుకుంటారో జాగ్రత్త! స్త్రీలకు: కొందరకు ప్రయాణం, కొందరకు వస్తు సేకరణ, కొందరకు ప్రయాణం తప్పక సాగించవలసి రావచ్చు గ్రహించాలి

**సింహం** ఆదాయ లోపం లేదు వ్యాపార రంగాన అనుకూలత వస్తు వాహన సేకరణకు అవకాశం ఇరుగు పొరుగువారు, తోడుగా పని చేయు వారిని గమనించి మెలగాలి కుటుంబానందానికి లోటు లేదు గాని, యింకా కొంత కాలం బాధ తప్పదు స్త్రీలకు ఆదాయ వృద్ధి, కార్యానుకూలత

**కన్య** వారమంతా అనుకూలం సర్వ విధాలా బాగున్నది అయితేనేం, 'అర్ధాష్టమ' శని బాధ కూడ ఉన్నది రాజకీయాలు తగవు సభా మర్యాదకు లోటు లేదు కార్యసిద్ధికి తాపత్రయపడక తప్పదు కొందరకు, వాహన సేకరణ స్త్రీలకు: వృత్తి ఉద్యోగములందు అనుకూలత గలదు

**తుల** 'అర్ధాష్టమ శని' రోజులు ఎంత జాగ్రత్తగా ఆహార విహారాదులందు ఉంటే అంత మేలు ఔషధ సేవకన్న, మంత్ర జపహోమాదులను ఆచరించుట శ్రేష్ఠం వ్యాపారమందు అనుకూల మార్పు రావచ్చు స్త్రీలకు: ఆరోగ్యమందు జాగ్రత్త అవసరం అధికారుల మన్ననకై యత్నిస్తారు

**వృశ్చికం.** శనిగ్రహం రాశి బహు యోగ దాయకుడు సభలందు మర్యాద, వృత్తి యందు పెంపు, ఉద్యోగ నిర్వహణయందు మేలు సుఖ శాంతులు 'అనూరాధ' వారికి అఖండ యోగమున్నదని తెలుపుట శాస్త్ర సమ్మతం కళారంగాన సదవకాశాలుండుట గమనించండి రాజకీయంగా కూడ వారాంతాన మేలున్నది. స్త్రీలకు: అభివృద్ధికరమైన మార్పు రానున్నది

**ధనుస్సు.** ఏ విధంగా మేలుగాదు వ్యాపారమందునా యిబ్బందే వ్యవహార మందునా వెనుక ముందు లాడవలసిన అగత్యం, సాహిత్యరంగాన ప్రసిద్ధత ఏర్పడనున్నది పాడి పంటలందు అనుకూల మార్పులు స్త్రీలకు: సుఖశాంతులు, ఆదాయం, విలాస వస్తు సేకరణ, ముఖ్య బంధు సమాగమం, గమనించండి

**మకరం** వయసు మిరినవారు జాగరూకతతో ఉండాలి కొందరకు ఔషధ సేవ తప్పదు ఆరోగ్య భాగ్యానికై ఔషధ సేవకన్నా భగవధ్యానం, మౌనం, గ్రహ పూజ, జపాదులు, చివరకు తపోధ్యానం కూడ అవసరమే అందునా 'రాహు శని' గ్రహాలయుతి గదా! స్త్రీలకు మిత్రానుకూలత, ఉద్యోగ మందు అనుకూలత

**కుంభం**- ధనలోపం లేదు వ్యాపారమందు ఒడిదుడుకులు లేకపోవు 'శని అనుకూలుడు గాడు గదా! అలాగే గురుడు కూడ, బహు దూరం వెళ్ళవలసిన అగత్యం పత్రికారంగాభివృద్ధి అతిధి అభ్యాగతుల ఆదరించవలసిన అగత్యం కూడా లేకపోలేదు స్త్రీలకు సభా మర్యాద రాజకీయరంగాభివృద్ధి, ప్రసిద్ధుల, ధనాఢ్యుల సహవాసం, గ్రహించండి

**మీనం** కార్యాచరణమున లోపం రాదు గురు, శుక్ర, శని గ్రహాలు అనుకూలురు వ్యాపార దక్షత, పత్రికా రంగానుకూలత, ఆప్తమిత్రుల రాక, ధనవసతి, అపూర్వ వస్తుసేకరణ, వ్యాపార రంగానుకూలత, కృషియందు పెంపు. వృత్తి రాణింపు స్త్రీలకు: కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి, ఆరోగ్య భాగ్యం

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

## బిజీ నీతి

ఆ దేహాల్ని
శీతోష్ణములు రుచి చూస్తున్నాయి
ఆకలిదప్పులు అగ్గివుల్లా గీస్తున్నాయి
మదత నలగని దుస్తుల్లో
నలిగే నీతి
చూపగలదా వాడిపై 'ప్రీతి'
అబ్బే! తను చాలా 'బిజీ'
అడక్కూడదు సుమా 'అపాలజీ'
ఎవరి రాత కెవరు కర్తలంటూ
చెబుతుంది 'గ్రాపాలజీ'!!

-ఎస్ బి గీతావాణి

# సంక్రాంతికి మారుపేరు ముగ్గులే!



వ్యాస రచయిత్రి కె వాణీ ప్రభాకరితో వేదుల వెంకట పద్మజ.

సంక్రాంతి పేరు చెప్పగానే ఇంటి ప్రాంగణంలో రంగురంగుల రంగ వల్లులు తీర్చిదిద్దడము- వాటిని బంతిరేకులతోను- రంగులతోనూ అలంకరించడం జ్ఞప్తికి వస్తుంది. ఆనవాయితీ ఉన్నవారు గొబ్బిళ్ళు పెట్టి పేరంటం చేస్తారు. దీపావళి అనగానే అబ్బాయిల పండుగ- సంక్రాంతి అనగానే అమ్మాయిల పండుగ అని ఒక సింబల్ ఉన్నది మనం ఎక్కువగా గీతల ముగ్గులు- చుక్కల ముగ్గులు వీటిని ముత్యాల ముగ్గులంటారు స్వస్తిక్



గుర్తులు- శంఖులు పద్మాలు గద, రదాలు ఇత్యాది ముగ్గులు కాక ఇప్పుడు చిల్కల చత్రాలు రకరకాల గొట్టాలు కూడా వస్తున్నాయి

ముగ్గుల కళ కూడా భగవతారాదనకే రూపుదిద్దుకొన్నదని మన సాంప్రదాయాలు తెలియ బరుస్తున్నాయి అమోఘమైన కళానైపుణ్యంతో భక్తి విశ్వాసంతో ఈ పండుగ చేస్తుంటాము అంతేగాక నిత్యము ముగ్గుపెట్టడం శుభకరము ఇంటి ముందు ముగ్గు అతిథి అభ్యాగతులకే కాక- శ్రీమహాలక్ష్మికి కూడా స్వాగతం పల్కుతాయి ఎంతో ప్రాచీనమైన ఈ కళ ఆధునిక యుగంలో కూడా అత్యంత ముఖ్యపాత్ర వహిస్తోందంటే అది గర్వించదగ్గ విషయము

ముగ్గు పెట్టక చుట్టు బోర్డర్ డిజైన్ వేసేందుకు ఎక్కువగా గీతలు- చేపలు- తామరలు పక్షులు, పాములు ఆకులు వంటి వాటితో నింపుతారు

బెంగాలీలు శేషనాగ్ ముగ్గును అంటే అందులో నోట పట్టుకొని పాములు వరసగా ఉంటాయి ఇక సూర్యుడు, చంద్రుడు, పద్మాలు ఇవి చాలా మంది వేస్తారు మనం ఎక్కువగా ముగ్గులో బియ్యంపిండి కలిపి వాడుతాము ఇది శాంతికి స్వచ్ఛతకు మారుపేరు

కేరళ రాజస్థాన్‌లో ముగ్గులు విబిన్న వర్ణాలతో నయనానందకరంగా ఉంటాయి ఈ మోడరన్ యుగంలో బ్రష్‌లతో పెయింట్స్‌తో ముగ్గులు పెడుతున్నారు కొంత మంది ఇంటిలోపల స్టికర్స్ వాడినా బయట ముగ్గులు పెట్టడంతో ఆనందం సంతృప్తి పొందుతున్నారు

ఫొటో, వ్యాసం- కె వాణీప్రభాకరి

## క్రాంతి- సంక్రాంతి



వచ్చింది వచ్చింది సంక్రాంతిలక్ష్మి
తెచ్చింది తెచ్చింది నవక్రాంతి మనకు
ఇంటి ముంగిట రంగవల్లులు
ఇంటిలోన అనురాగ వల్లరులు
ఇరుగు పొరుగున స్నే[illegible]
ఇవేకదా ఆనంద వల్లరులు ॥వచ్చింది॥

కష్టించి పనిచేసి సంపదలు పెంచుదాం
శ్రమయేవ జయతేయని
నిరూపించి చూపుదాం,
హిందూముస్లిం క్రైస్తవులు
మరి పార్శీయైనా
[illegible]మైనా ఏకులమైనా
సర్వేజనాస్సుఖినో భవంతు!
సదా కావాలి అదే మనకు ॥వచ్చింది

సమాజాన శాంతి అప్పుడే,
శాంతి[illegible]గర వేసి
నవచైతన్య [illegible] ఆరోపించి
క్రాంతి పథాన కదలిపోదాం
నవక్రాంతి పథాన కదలిపోదాం! ॥వచ్చింది

—తమిరిశ జానకి

# సావిత్రిని మరిచిపోలేము!

ఎటువంటి పాత్రనయినా అవలీలగా పోషించి తన అభినయ కౌశలంతో దాదాపు ఇరవై ఐదు వసంతాల పాటు ప్రేక్షకులను ఉర్రూతలూగించిన 'నట శిరోమణి' సావిత్రి 1936 డిశంబరు 6వ విజయవాడలో జన్మించింది.

ఆమె పూర్తి పేరు కొమ్మారెడ్డి సావిత్రి. తండ్రి శ్రీ కొమ్మారెడ్డి వెంకట్రామయ్య చౌదరి. తల్లి దుర్గమ్మ.

బాల్యం నుండి ఆమెకు లలితకళల పట్ల అమితమైన ఆసక్తి వుండేది. మొదట 'రాధాకృష్ణ' నృత్యనాటికలో సావిత్రి కృష్ణుని పాత్ర పోషించింది. అప్పటికి ఆమె వయసు ఏడేళ్ళే. ఆ తర్వాత కొద్ది కాలానికి ఆమె అరుణోదయ నాట్య మండలిలో చేరి దాదాపు ఒక సంవత్సరం పాటు వారి ప్రదర్శనల్లో పాల్గొన్నది. ఆ నాట్యమండలిలో శ్రీయుతులు ఎన్. టి. రామారావు, జగ్గయ్య, కె. వి. ఎస్. శర్మ తదితరులు నటిస్తుండేవారు. అనంతరం కొంతకాలం సావిత్రి స్వయంగా నవభారత నాట్యమండలిని ప్రారంభించింది. దీనికి కోట సుబ్రహ్మణ్యశర్మ నృత్య దర్శకుడు. 1950 లో నేషనల్ ఆర్ట్ థియేటర్స్ (దీని నిర్వహణ ఇప్పటి ప్రముఖ నిర్మాత శ్రీ అట్లూరి పుండరీ కాక్షయ్య) వారు



కాకినాడలో బుచ్చిబాబు గారి 'ఆత్మ వంచన' నాటికను ప్రదర్శించారు. ఆ నాటికలో సావిత్రి బెంగాలీ పిల్ల పాత్రను అద్భుతంగా పోషించి పృథ్వీరాజ్ కపూర్ ప్రశంసలను అందుకొన్నది.

1949 లో సారథీవారు 'అగ్నిపరీక్ష' చిత్రానికిగాను వేశ్యపాత్ర కోసం సావిత్రిని పిలిపించారు. అయితే మేకప్ టెస్ట్ అనంతరం వయసు చాలదని భావించి ఆ పాత్రకు మరొక నటిని ఎంపిక చేశారు. 1950 మే నెలలో సావిత్రి మద్రాసు చేరింది. సంసారం చిత్రంలో కొన్ని రోజులు నటించాక ఆమెను ఆ చిత్రం నుండి తొలగించి వేశారు. ఆ తర్వాత పాతాళభైరవిలో ఒక నృత్య నాటికలో 'నువ్ రమ్మంటి రానే రానోయ్' అంటూ అభినయించింది. అనంతరం సావిత్రికి పెళ్ళి చేసి చూడులో మంచి పాత్ర లభించింది. ప్రియురాలు, ఆదర్శం, రూపవతి, శాంతి ఆమె తొలి చిత్రాలు.

## దేవదాసు

అక్కినేని నాగేశ్వరరావు హీరోగా నటించిన వినోదా వారి 'దేవదాసు' చిత్రం ఆమె నట జీవితాన్ని గొప్ప మలుపు తిప్పింది. విషాదం, చిలిపితనం, శృంగారం మేళవించిన ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషించి మహానటిగా కీర్తింపబడింది. దేవదాసు, మిస్సమ్మ, అర్ధాంగి, మాయాబజార్, నర్తనశాల, పాండవ వనవాసం, వెలుగునీడలు, మూగమనసులు,



1965లో విడుదలైన 'పాండవ వనవాసం'లో సావిత్రి (ద్రౌపది), ఎన్. టి. రామారావు (భీముడు)

గుండమ్మ కథ, కోడలు దిద్దిన కాపురం తదితర చిత్రాలు ఆమె అసమాన అభినయ కౌశలానికి ప్రతీకలు.

సావిత్రి దాదాపు 250 చిత్రాలలో నటించింది. తెలుగు, తమిళ భాషల్లో సూర్య తేజంగా వెలుగొందిన సావిత్రి 1968 లో దర్శకురాలిగా మారి అన్ని ముఖ్య విభాగాలను మహిళలకే అప్పగించి 'చిన్నారి పాపలు' అనే చిత్రాన్ని రూపొందించింది. మాతృదేవత, వింత సంసారం, చిరంజీవి (చలం), తమిళంలో 'ప్రాప్తం' (మూగమనసులు) ఆమె దర్శకత్వంలో వెలువడిన ఇతర చిత్రాలు. 1956 లో తమిళ నటుడు జెమినీగణేశన్‌ను వివాహమాడింది. తెలుగువారి ఆడపడుచును, తమిళుల కోడల్ని అని సగర్వంగా చెప్పుకునేది సావిత్రి.

ఆంధ్ర మహిళా సంఘం వారు ఒక ఉత్సవంలో ఆమెకు 'నటశిరోమణి' బిరుదునిచ్చి సత్కరించారు. అలాగే తమిళ సినీ అభిమానులు సావిత్రికి 'నడిగయర్ తిలగం' అనే బిరుదు నిచ్చారు. సావిత్రి పలు ప్రజాహిత కార్యక్రమాల్లో పాల్గొన్నది. భారత్–చైనా యుద్ధం జరిగినప్పుడు నిధుల కోసం 'గలాటా కళ్యాణం' అనే నాటకాన్ని ప్రదర్శించి వసూలైన సొమ్మును ప్రభుత్వానికి అందజేసింది.


'వదిన'లో నాగేశ్వరరావు, రేలంగి, సావిత్రి

## ఖరీదైన కారు

మన నటీమణుల్లో తొలిసారిగా ఖరీదైన కారును ఉపయోగించిన ఘనత సావిత్రిదే. ఒకప్పుడు మహర్దశ ననుభవించి ఐశ్వర్యంతో విరాజిల్లిన సావిత్రి కాల ప్రభావం వల్ల అంతిమ దశలో అద్దె యింట్లో జీవించవలసి వచ్చింది. మధుమేహ వ్యాధికి, రక్తపోటుకు గురైనప్పటికీ ఆమె మద్యపాన వ్యసనాన్ని విడనాడలేకపోయింది. ఈ అలవాటే ఆమె ఆరోగ్యాన్ని క్రుంగతీసింది. 1980 మేలో ఒక కన్నడ చిత్రం షూటింగ్ నిమిత్తం బెంగుళూరు వెళ్ళి కోమాకు గురైంది. దాదాపు 20 నెలలు మృత్యువుతో పోరాడి 1981 డిసెంబర్ 26న తుదిశ్వాస విడిచింది. ఆమె చివరి చిత్రం 'రామాయణంలో పిడకల వేట'.

ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్ర వేసుకున్న సావిత్రిని మరచిపోవటం ఎవ్వరికీ సాధ్యం కాదు. ప్రభుత్వం ఆమె పేరిట ఒక అవార్డును నెలకొల్పితే బాగుంటుంది. వర్తమాన, భావి తరాలకు మార్గదర్శకంగా తెలుగు చలనచిత్ర చరిత్రలో సావిత్రి చిరస్థాయిగా నిల్చిపోతుంది.

–ఆకురాతి శేషాచలం


తోడికోడళ్ళు (1957)లో సూర్యకాంతం, కన్నాంబ, సావిత్రి


'మిస్సమ్మ'లో సావిత్రి, జమున



## త్వరలో "ఏప్రిల్ 1"

రాజేంద్ర ప్రసాద్ వీడియోగ్రాఫర్ అబద్ధాలపుట్ట మార్చి 1 నుండి 31 వరకు అన్నీ నిజాలే చెప్పే పక్షంలోనే అతన్ని పెళ్ళాడుతానని నాయిక శోభన చెబుతుంది సరేనని ఆ మాటమీదే ఉన్న తరుణంలో ఒకసారి నిజం చెప్పి హత్యా నేరంలో ఇరుక్కుంటాడు అప్పుడు అబద్ధం చెప్పి, ఏప్రిల్ 1న విడుదలవుతాడు నిజాయితీగా తను ఓడిపోయానని ఒప్పుకుంటే కాదు–నువ్వు ఓడి నన్ను గెలిచావు' అంటుంది నాయిక టీన్ ఏజ్ లవ్‌స్టోరీ," అన్నారు వంశీ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి భాస్కర్‌రెడ్డి నిర్మించిన పూర్ణతేజ క్రియేషన్స్ ఏప్రిల్ 1 చిత్రంలో రాళ్ళపల్లి, మల్లికార్జునరావు సాక్షి రంగారావు, ప్రదీప్‌శక్తి భీమరాజు, ఆనందమోహన్, చిదంబరం, కృష్ణారావు, కృష్ణభగవాన్ వై విజయ జయవిజయ, జయలలిత లక్ష్మీప్రియ కె వి లక్ష్మి, శుభ

పాల్గొన్నారు ఎల్ బి శ్రీరాం మాటలు, సీతారామశాస్త్రి పాటలు, ఇళయరాజా సంగీతం, ఎం వి రఘు ఛాయ అరుణ్ గౌడ్‌గాంకర్ శిల్పం శివశంకర్ నృత్యాలు

వి బ్రహ్మాజీ ప్రొడక్షన్, గొట్టుముక్కల పద్మారావు నిర్వహణ, ఉమాశంకర్‌బాబు కూర్పు చిత్రస్రవంతి సమర్పణలో మండవ గోపాలకృష్ణ ప్రమోటర్

## అసెంబ్లీ రౌడీ

"సూపర్ హిట్ అయిన 'వేలె కడ్చి యాచ్చి' తమిళచిత్రం మాతృక ఐతే, ఈ చిత్రంలో ఎక్కడా రాజకీయాల ప్రసక్తి ఉండదు డిసెంబర్ 14, జనవరి 6, జనవరి 13-30, మూడవ షెడ్యూల్ చిత్తూరు జిల్లాలో ఫిబ్రవరి 7 నుండి 17 వరకు జరగడంతో షూటింగ్ ముగుస్తుంది," అన్నారు ఎం మోహన్‌బాబు ఈయన ప్రధానపాత్ర నిర్వహిస్తూ నిర్మించే శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్ "అసెంబ్లీ రౌడీ" చిత్రంలో దివ్యభారతి నాయిక సత్యనారాయణ, జగ్గయ్య, పరుచూరి వెంకటేశ్వరరావు, రాళ్ళపల్లి, బ్రహ్మానందం, రాణీ, అన్నపూర్ణ, జలలిత ఇతర నటవర్గం పరుచూరి రుల రచన జాలాది- గురుచరణ్- కొనరాజు గీతాలు, కె వి మహదేవన్ సంగీతం, కె ఎస్ ప్రకాష్ ఛాయ, సుందరం / నృత్యాలు, సూర్యకుమార్ శిల్పం, ఎం బాలు సంయుక్త దర్శకత్వం, తోట రామకృష్ణ సహకార దర్శకత్వం, గౌతంరాజు కూర్పుతో వి వి రమణమూర్తి, కువ్వరాజ్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్, కె ఎస్ ప్రకాష్ ప్రొడక్షన్ కంట్రోలర్, ఎం కృష్ణ నిర్మాణ సారథి, బి గోపాల్ దర్శకుడు

—జి. వి. జి.

సీరియల్

# భారతమహాకవిత్రయం

## భాగవతుల సుబ్రహ్మణ్యం

**ఇంతవరకూ సాగినకథ-11:** చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుల కుల బ్రాహ్మణుడు నన్నయభట్టారకుడు. మహామంత్రి వజ్జియ, నన్నయల సలహాపై రాజ రాజ నరేంద్రుడు విజయాదిత్యుడిపై యుద్ధానికి సన్నద్ధమవుతాడు. సోమేశ్వర త్రైలోక్యమల్లుడు రాజ్యబహిష్కరణ చేసిన నారాయణభట్టు-నన్నయ ద్వారా రాజాశ్రయం పొంది అగ్రహారాలు దానంగా పొందుతాడు. నన్నయ రచించే ఆంధ్ర మహాభారతం ఆచంద్ర తారార్కం నిలిచివుండాలంటూ ఆధర్వణాచార్యుడు- నన్నయను ఆశీర్వదిస్తాడు. అధర్వణాచార్యుడి శాపం మూలంగా వీరమార్యుడు ఉన్మత్తుడవుతాడు.

*[గత సంచిక తరువాయి]*

### 35

*శకవత్సరం- 982....*

చావుతప్పి కన్నులొట్టపోయిన చందంగా తయారైన తాను 'గత ఎనిమిదిన్నర సంవత్సరాలుగా అజ్ఞాతంగా అడవులు పట్టిపోవలసిన దుర్గతి చోళరాజులవల్లనే కలిగింది కదా' అని నిద్రలో సైతం కత్తి నూరుకోసాగాడు విజయాదిత్యుడు.

పట్టపగలే చిమ్మ చీకటిని తలపించే నల్లమల అడవుల్లోని ఓ అత్యంత రహస్య స్థావరం అరణ్యాంతర్భాగంలో వుంది. అందులోని ఒక గుహలో దివిటీ వెలుగులో తన ముఖ్య అనుచరులు ఇరవై మందితో విజయాదిత్యుడు సమాలోచన జరుపుతున్నాడు.

చోళ'రాజేంద్రదేవుని' మట్టి కరిపించాలి...

తన పతనానికి హేతువైన రాజాధిరాజును అతడో ధూమ కేతువుగా తలచాడు ఆ తోకచుక్క తల తెగి నేల రాలిపోయింది. కాని అతడి తమ్ముడి రూపంలో అది తలెత్తి తనకు అనుక్షణం అరికాలిలో ముల్లులా సలుపుతోంది. రాజాధిరాజులాగ రాజేంద్రదేవుడు రణభీషణుడు కాడన్న సంగతి తమకు తెలుసు.

అదీగాక- ఇటీవల గత కొద్దికాలంగా అతడు వేదాంత ధోరణిలో పడి రాచకార్య విముఖుడైనట్టు తనకు అత్యంత విశ్వసనీయంగా తెలిసింది. అటువంటి నిర్లిప్తుడ్ని తేలిగ్గానే తుదముట్టించవచ్చు! భారీ పరివారం అవసరం లేదు. తగినంతబలగం చాలు!

మాయోపాయమే శరణ్యం....

ఒక ప్రాణానికి పది మంది ప్రాణాలు బలి తీసుకోగల సమర్థులో పదిమంది వెంట వున్నా తన పథకం సత్ఫలితమే ఇస్తుంది. చోళరాజ్యరమను తేలిగ్గా వంచించవచ్చు!

ఒక స్థిరాభిప్రాయానికి వచ్చిన వాడిలా తల ఊపి, తన ఎదుట వున్న యోధాను యోధుల్లోంచి నలుగురిని ఎంపికచేసి, వారి చెవుల్లో ఏదో రహస్యంగా ఊదాడు విజయాదిత్యుడు. వారు కూడా శ్రద్ధగా విని తలాడించి అభివాదం చేసి అక్కడ్నించి నిష్క్రమించారు. దక్షిణదిశగా కాంచీపురం వైపు ఏకదీక్షగా సాగిపోతున్నవాడు గంగాధరుడు.

### 36

అంతఃపురంలో యువరాణి సోమలదేవితో అచ్చనగండ్లు ఆడుతోంది కువమ.

"ఆ గడిలోని రత్నాలు నా స్వాధీనమయ్యాయి సోమా" కువమ పందెం గెలుస్తూ అంది.

"ఆగాగు! గెలుపెప్పుడైనా యువరాణిదే!" రత్నాలు తీసుకుంటున్న కువమ చేయిపట్టుకుంది సోమలదేవి.

"ఆ!... ఎంత రాణీ వారైతే మాత్రం దగాకోరు ఆట ఆడితే వూరుకుంటామేమిటీ?" కువమ చెక్కిట చేయిచేర్చి అలవోకగా మూతితిప్పుతూ అంది.

"ఇది మా ప్రాసాదం తెల్సా?" దర్పం ప్రదర్శించింది సోమల.

ఇంతలో- అటు వైపుగా వస్తూ ఆ మాట విన్న చిన్నరాణీ రేవలదేవి "తప్పమ్మా! జయాపజయాలు విధిలిఖితం. ఆటలోనైనా- అధికారంలోనైనా ఒకటే! మళ్ళీ ఆడి చూడండి. ఈసారి గెలుపు మీది కాకూడదా?" మెత్తగా మందలించింది.

కాస్త అతిశయంగా ఓ చూపు ప్రస

రించింది కుపమ.

"బాపనపిల్ల కెంత బడాయో చూడండి మాతృశ్రీ!" పిర్యాదు చేస్తున్నట్టుగా అంది సోమల.

"అసలు మీది స్నేహమా? వైరమా?" ఆశ్చర్యంగా అడిగింది రేవలదేవి.

"స్నేహాంతర్గత వైరం" తమాషాగా అంది.

"కారణం ?"

"నిజానికి అవ్యాజం. కాని అప్పుడప్పుడు మన స్వేచ్ఛా రాహిత్యానికీ, కుపమకున్న స్వేచ్ఛా జీవనానికీ ఇంచుక అసూయ."

"మనం రాజవంశీకులమమ్మా! అంతఃపురం దాటి వెళ్లాలంటే ఎన్నో అనుమతులు. అడుగడుగునా రక్షణ ఏర్పాట్లు- ఆ వైభోగం..." తల్లిమాట అందుకొని "హా!... ఏం వైభోగం ?... ఎంతసేపూ ఇవే కేళీవనాలు. ఇవే మందిరాలు. వాస్తవంగా లోకంలో వున్న సహజ సౌందర్యాన్ని తనివితీరా ఆస్వాదించాలన్నా... పోనీ! అంతెందుకూ, ఆ ద్రాక్షారామ భీమేశుణ్ణి అందరిలాగా ఉత్సవాల్లో దర్శించుకోవాలన్నా తీరదాయె" దిగులుగా అంది సోమల.

"ద్రాక్షారామమే కదా! తప్పకుండా పంపించే ఏర్పాటు చెయ్యనా?"

"చెలికత్తెలూ వద్దు... ముందూ వెనుకా విచ్చుకత్తుల సేనావద్దు"

"చిత్తం! కాసిన్ని వత్తులూ- దీపపు సెమ్మా" అందుకుంది కుపమ.

"పోవే కుపమా!"



"అవును యువరాణీ! భగవధ్యానానికి ధూపదీప నైవేద్యాలే కదా కావాలి"

"అవెలాగూ మన వెంట వస్తాయి లేవే! నాకు తోడుగా నువ్వొస్తావా?" సోమలదేవి, తల్లి అక్కడ్నించి నిష్క్రమిం చడం చూసి అంది.

"ఏమిటి ?... మనిద్దరం... ద్రాక్షా రామం..."

"ఏం భయమా ?"

"కాదు... ఈ సాహసం ప్రభువుల వారికి తెలిస్తే...?"

"తలలేం ఎగిరిపోవులే గాని... రా గలవా?"

"మా తండ్రిగారు..."

"భారత రచనకోసం మిత్రుల సాహచ ర్యంలోనే అహర్నిశలూ గడుపుతూంటారు. వారికేమీ అభ్యంతరం వుండదని నా నమ్మకం. అయినా శతాధిక ఇబ్బందులూ-సాకులూ వుండాల్సింది మాకుగాని మీకు కాదే..!"

"మీకే మమ్మా మహారాణులు..."

"నేర్చావు మహా... చాల్లే... తయా రుగా వుండు... ప్రచ్ఛన్న వేషాల్లో ఈ శివరాత్రి సంబరాలకు మనం ద్రాక్షారామం



వెళ్తున్నాం! అంతే!"

## 37

వసుమతీ వనితకు విభూషణ మనదగ్గ వేంగీదేశానికే నాయకరత్న భాసురమైన రాజమహేంద్రిలోని అది ఒక రమ్య భర్మ్య హర్మ్య తలం. అది సకల భువన లక్ష్మీవి లాసం. నాడక్కడ విద్యావిలాస గోష్ఠి జరు గుతోంది. ఆ విద్వద్గణాల మధ్య సూర్య చంద్రుల్లా నారాయణ- నన్నయ భట్టులు.

చాళుక్య మన్మధుడు, రాజ మనోహ రుడు అయిన రాజరాజనరేంద్రుడు భార తాంధ్రీకృతి శ్రవణాసక్తుడై వున్నాడు.

అరణ్య (పర్వం) లోకి ప్రవేశించాడు నన్నయ.

విద్వజ్జన విటపి కూడా గంభీరమై వింటోంది.

రెండాశ్వాసాల సభాపర్వానంతరం అరణ్యపర్వంలోని మూడు అశ్వాసాలు నీతి ధర్మ వివరణాత్మకమైన అఖ్యానాలుగా ఉద్దే శించినట్టు చెప్పి కిరాతార్జునీయగాథ, కాల కేయ నివాత కవచుల వధ, భీముని సౌగం ధికాపహరణం, నలోపాఖ్యానం, అనంతరం నహుషుడనే అభిశప్తుని అజగరోపాఖ్యానం, ధర్మరాజు నహుషుని ధర్మసందేహాలకు జవా బివ్వడం, నహుషునికి శాప విముక్తి వరకు రసప్లావితంగా కథాగానం చేశాడు నన్నయ.

విద్వత్పరిషత్ యావత్తూ హర్షామో దాలు వర్షించింది.

సభ్యులందరూ ఆ శ్రవణ సుఖంలోంచి ఇంకా తేరుకోలేక పోతున్నారు.

"ప్రాకట భూసురోత్తమా! నన్న పార్యా! కొన్ని సందేహాలున్నాయి అడగ వచ్చునా ?" పరిషత్ గౌరవాధ్యక్షుడిగా వ్యవహరిస్తున్న రాజరాజనరేంద్రుని వినయ సౌశీల్యమది.

"అడగవచ్చునా అని తాము ప్రస్తా వించాలా ఏమిటి కోదండపార్థా! దేని కైనా తాము సర్వవిధాలా అర్హులే! మిత్ర విద్వదంభోజవనపయోజ మిత్రులు తాము అజ్ఞాపించి తీరాలి కూడా!"

"ఎంత మాట? భూసుర ప్రవ రులైన నన్నపార్యుల వారి చిరుశంకలు తీర్చిన చాలును. అరణ్యపర్వం మూలంలో ధౌమ్యుడు ధర్మరాజుకు చెప్పినట్టు, వ్యాస భగవానులు లిఖించిన అష్టోత్తర శతసూర్య నామాలు వైశంపాయనులవారు జనమే



# ధర్మ సందేహాలు

## రచయిత సమాధానాలు

**బొడ్డపాటి వెంకటసుబ్బమ్మ, మచిలీపట్నం.**

ప్ర: మీ సీరియల్‌లో 'శబ్దానికి మహత్తర శక్తి ఉందని రాశారు నిజానికి-శబ్దానికి అంతటి శక్తి వుందా?

జ: వుంది 'తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః' అంటే మత్సర రహితులూ, అలోపులూ, దర్ప దంభ క్రోధ వర్జితులూ, బ్రహ్మ విద్యావేత్తలూ అయిన శిష్యులకు ఒక్కరికే శబ్ద తత్వం సంపూర్ణంగా గోచరిస్తుంది అంతేకాదు శబ్దోచ్చారణలో వుండే ఎగుడు దిగుడులే లేకపోతే భాష వినడానికి కటువుగా వుంటుంది కూడా! ఇది గమనించే సంస్కృత వైయాకరణులు ఉదాత్త అనుదాత్త స్వరితాలతో కూడిన శిక్షా శాస్త్రాన్ని కల్పించారు స్వరం తప్పినప్పుడు శబ్దం అపశబ్దమై పోతుం దన్నారు అపశబ్దం పలికితే కొన్ని సందర్భాల్లోనైతే ప్రాయశ్చిత్తం కూడా చెయ్యవలసి వుంటుందని వేదవిదులు అనుశాసించారంటే, శబ్ద శక్తి ఎంత గొప్పదో మీరే ఊహించుకోవచ్చు!

**అల్లిన వెంకట రమణమూర్తి, హైదరాబాద్-782**

ప్ర చారిత్రకాంశాల్ని అంత వివరంగా చెప్పడం ఎందుకు?

జ నిజానికి చరిత్ర పారం చెప్పడం నా ఉద్దేశం కాదు చారిత్రకాంశాల్ని వక్రీకరించకూడదన్నదే నా ఆశయం ఉదాహరణకి - నన్నయ తర్వాత దాదాపు 150 ఏళ్లపాటు మహా భారతాంధ్రీకృతి మరుగున పడిపోవడానికి ముఖ్య కారణాల్ని వివరంగా చెప్పవలసిందే! 'అననుకూల రాజ్య పరిస్థితులు' అని ఒక్క ముక్కలో చెప్పి తిక్కన భారతాంధ్రీకరణ చేపట్టిన దగ్గర్నుంచి నవల కొన సాగించవచ్చు! **కాని - ఒక్క కుదుపుతో 150 ఏళ్ల కథాగమనం దాటవేసినట్టు వుండకూడదనే భావంతో చారిత్రక వాస్తవాల్ని పాత్రల పరంగా చెప్పడం జరిగింది**

**క. కృష్ణవేణి, మద్రాసు-17**

ప్ర మీరు అందిస్తున్న ఐతిహాసిక సీరియల్ చాలా ఆసక్తికరంగా వున్నది కవిత్రయం ఏ ప్రదేశాలకు చెందినవారు? తెలుగులోనే ప్రాముఖ్యత నిచ్చి భారతం రాయించడానికి కారణమేమిటి?

జ మీ అభిప్రాయానికి కృతజ్ఞతలు కవిత్రయంలో - నన్నయ రాజమహేంద్రికి తిక్కన నెల్లూరి సీమకు, ఎర్రన అద్దంకిసీమలోని గుడ్లూరుకు చెందినవారు ఇక రాజరాజ నరేంద్రుడు పెక్కు భాషల్లో భారతం విన్నా, కేవలం తెలుగులోనే భారతం రాయించడానికి కారణాలను కథాపరంగా ఎప్పటికప్పుడు నవలలోనే పేర్కొంటున్నాను ప్రధానంగా వైదిక మతోద్ధరణ కారణం!

**సాహిణీ సురేష్‌కుమార్, పాలకొండ**

ప్ర నన్నయనాటి శబ్దాలకూ, ఇప్పటి శబ్దాలకూ అర్థంలో ఏమైనా తేడా లున్నాయా?

జ మంచి ప్రశ్న ఉన్నాయి నన్నయనాటి శబ్దాల్లో కొన్నిటికి ఇప్పటి అర్థాలే వేరు ఉదాహరణకి నన్నయ నాడు 'యౌవనవతి'ని తెలియజేసే 'అవ్వ' శబ్దం నేడు కాటికి కాళ్లు చాచిన ముసలమ్మలను సూచిస్తుంది అలాగే కంపు శబ్దం భారత రచనా కాలంలో సువాసనను సూచిస్తుంటే, నేడు 'దుర్గంధాన్ని' పలుకుతోంది కన్నడ భాషలో 'కంపు'నకు ఇప్పటికీ గౌరవముంది ఇదే అర్థ విపరిణామం అంటే పూజ్యము శూన్యార్థాన్ని సూచించడం, కైంకర్యం 'కాజేయుట' కావడం ఇలాంటివే!

జయునకు చెప్పారా- లేదా?"

"చెప్పారు... కాని మూలంలోని ఆ భాగాన్ని నేనే సంక్షేపించాను. 'సూర్యుం డర్యముండు భగుండను నివి మొదలుగా గల నామంబుల యష్టోత్తర శతంబు విధియుక్తముగా నుపదేశించె' అని ఒక్కముక్కలో నేను చెప్పడానికి గల కారణాన్నే తమరు ప్రస్తావించారను కుంటాను- అవునా?"

"అదే! సరిగ్గా గ్రహించారు"

"కథాభాగం లేని చోట నామావళి పఠితలకు విసుగుకలిగించడమే గాక పునరుక్తిగా కూడా పరిణమించే ప్రమాద ముందన్నది నా వాదన. అదీగాక కొన్ని భాగాలు నేను కథావశాన పెంచవలసి వచ్చింది. సమతుల్యత సాధించడానికి కూడ తప్పనిసరిగా అలా చేయవలసి వచ్చింది."

"నలోపాఖ్యానంలో మీ లేఖినీ విశృంఖలత మేమూ గ్రహించాంలెండి" రాజరాజు దరహాసం రువ్వుతూ అన్నాడు.

"అంతేకాదు బాంధవాంభోజ మణీ! అందులో హంసవల్ల నలదమయంతు లిద్దరూ ఒకరి గుణరూప విశేషాలను ఒకరు పరస్పరం తెలుసుకొని మనః ప్రభవానల బాధ్యమాన లైనట్టు పెంచాను"

"అవునవును! అంతేనా! మూలంలో లేని అర్థాంతర న్యాసాలంకారాలు కల్పించి చొప్పించిన పద్యాలు ఇంకా మాకు కర్ణపేయంగానే వున్నాయి...

"బుద్ధి పూర్వకంగా మార్చిన సందర్భాల విషయంలో ప్రభువులు నన్ను మన్నించాలి. అరణ్యం(పర్వం) లో పాండవులు ఏమేమి భుజించారో తెలుపమని జనమేజయుడు వైశంపాయనుణ్ని అడిగినప్పుడు 'బాణపాతితములైన' వివిధ మృగాలను పాండవులు ముందు బ్రాహ్మణులకు నివేదించి తర్వాత తాము కూడా తిన్నారని మూలంలో వుంది. ప్రస్తుత దేశ కాలమాన పరిస్థితుల రీత్యా సద్విజులకు మాంసభోజనం నిషిద్ధమని తామెరిగిందే! ఇది బుద్ధి పూర్వకంగానే వదిలేశాను.

"అదేమంత పరిగణనీయం కాదు. మాకూ సమ్మతమే! అసలు వైదిక మత ప్రాభవం- వైదిక మత వ్యాపనమే మా ధ్యేయమైనపుడు, ఆ మతౌన్నత్యాన్ని నిలపగలిగిన సందర్భాలనే తాము ప్రస్తావించడం తమ ఉచితజ్ఞతకు నిదర్శనం" ప్రశంసించాడు రాజరాజు.

"సహదేవుని దక్షిణ దిగ్విజయ యాత్రా సందర్భంగా- మూలంలో 'ఆంధ్రాం స్తలవనాం శ్చైవ' అని ఆంధ్రుల్ని కూడా చేర్చినట్టు వుంది. మన ప్రభువులు అరివీర భయంకరులు. అవక్రవిక్రములు. సహదేవుడే కాదు- దేవదేవుడికైనా ఎదురొడ్డి నిలబడగలరని బుద్ధి పూర్వకంగా నేనే ఈ పట్టికలోంచి ఆంధ్రశబ్దాన్ని తొలగించాను ప్రభూ!"

"భేష్! మీ దేశభక్తి కిది తార్కాణం. నేడెంత పుణ్యదినం... మా కపరిమితానందం కలిగించి, శ్రవణ పేయమైన భారతామృత సారాన్ని మాకందించిన మీకిదే మా చిరుకానుక" అంటూ ఇరవై బంగారు పళ్లెరాల్లో రాశులు పోసిన గద్యాణాలు అందించాడు రాజరాజనరేంద్రుడు.

"ప్రభూ! తమ ప్రశంసే చాలు! ఒక్కొక్క అక్షరం వెయ్యినిష్కాల పాటి" వారించబోయాడు నన్నయ.

"మా సంతోషం కోసం స్వీకరించండి"

సభలో హర్ష ధ్వానాలు మిన్నంటుతుండగా నన్నయ వాటిని పరిగ్రహించాడు.

## 38

విజయాదిత్యుడకంకా కలిసొచ్చే కాలం సమీపించలేదనడానికి తార్కాణం- ఛద్మ

వేషంలో చోళరాజ్యం చేరిన గంగాధరుణ్ణి రాజేంద్రదేవుడి దుర్గరక్షణా నిపుణులు రెండోకంటికి తెలియకుండా వధించడమే! వధించేముందే విజయాదిత్యుడి ఉనికిని ప్రశ్నించి, ఆ వివరాలు చారుల ద్వారా తమ ప్రభువుకు చేరవేశారు.

నిప్పులమీద ఆజ్యం పోసినట్టు రాజేంద్రదేవుడి హృదయం భగ్గుమంది.

మానువట్టని అతడి మనోగాయం మళ్లీ రేగింది.

అన్నగారిని కుటిలరీతిన పొట్టన పెట్టుకున్న విజయాదిత్యుణ్ణి తానీ జన్మలో ఉపేక్షించలేడు. అసలు నాడు రణభూమిలోనే విజయాదిత్యుడి అంతు చూసేవాడే కాని, అది సమయం కాదనీ- పైగా అతడికి వత్తాసు పలుకుతున్న కర్ణాట ప్రభువుతో బావగారు సంధికి సముకట్టారనీ విడిచిపుచ్చాడు. ఆనాటి రాజకీయ పరిస్థితులు అలాంటివి.

కాలగతిలో, తాను స్వతంత్రించి విజయాదిత్యుణ్ణి అంతంచేయడానికి సిద్ధమయ్యే సరికి అతడు అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు. ఇన్నాళ్లకి అతడి ఉనికి బయటపడింది. ఇక ఉపేక్షించరాదు. తానిన్నాళ్ళూ ఇదే ధ్యేయంతో సిద్ధపరచిన తన మేనల్లుడి ద్వారానే ఈ కార్యం సాధించాలి.

తక్షణం- కుళోత్తుంగుడికి ఓ వార్త చేరింది. వార్త సారాంశం- 'వెంటనే మధురాంతకీదేవితో కల్యాణానికీ- చోళ సామ్రాజ్య పట్టాభిషేకానికీ కూడా సంసిద్ధుడై కదలి రమ్మని'. అదికాక బావగారైన వేంగీ ప్రభువుకు ప్రత్యేకాహ్వానం వెళ్లింది.

అక్కగారు అమ్మంగీ దేవికి, చిన్నక్కగారైన రేవలదేవికి ఇదే అంశం ప్రస్తావిస్తూ విడివిడిగా ఆహ్వానాలు వెళ్లాయి.

# భారత మహాకవిత్రయం

బావమరిది ఈ హఠాన్నిర్ణయం రాజరాజ నరేంద్రుడికి విస్మయాన్ని కలిగించింది.

ఎప్పటికప్పుడు చిన్న బావమరిది యోగక్షేమాలు విచారిస్తున్నాడు తాను. రాజేంద్రదేవుడికి ఇటీవల వైరాగ్యం ఆవహించిందని విని కూడా, తాను దానిని అంతగా పరిగణించలేదు. ఇప్పుడీ ఆహ్వాన పత్రిక చూశాక అది వాస్తవమే అనిపించింది. ఆ క్షణంలోనే తన పెద్ద బావమరిది రణభూమిలో దీనంగా కోరిన చివరికోరిక కూడా రాజరాజ నరేంద్రుడికి గుర్తుకొచ్చింది.

చోళ రాజపుత్రికలతో తమకు పూర్వం నుంచీ వున్న సంబంధ బాంధవ్యాలు కొనసాగించడం పైపే అతడి మనస్సు మొగ్గు చూపింది.

రాజమహేంద్రి అంతటా యువరాజు కల్యాణోత్సవాలు భారీ ఎత్తున ప్రారంభమయ్యాయి.

వేదత్రయ మూర్తులు నిర్ణయించిన ఓ శుభముహూర్తాన వేంగి నుంచి మగపెళ్లివారు, చోళ రాకుమార్తె- నూత్నవధువు మధురాంతకీదేవి రాజ్యానికి తరలి వెళ్లారు.

## 39

గంగాధరుడి మరణవార్త విన్న విజయాదిత్యుడికి దిక్కుతోచలేదు తన ఆశలన్నీ వమ్ము అయ్యాయి. తాను కన్న కలలు కల్లలయ్యాయి. మాయోపాయంతో ముందు చోళ రాజ్యాన్ని పట్టుకోవాలనుకున్న తనకు చుక్కెదురు కావడంతో, అసలు పథకమే మారిపోయింది.

సవతి అన్నగారైన రాజరాజనరేంద్రుని పై పోరు సాగించాలంటే తనకు నిస్తారంగా అర్థబలం, అంగబలం వుండాలి. చేతిలో అధికారం వున్నప్పుడేగదా ఈ రెండూ సిద్ధించేవి. అడవుల్లో కాయ కసరులు తింటూ అజ్ఞాతంగా రోజులు గడుపుతున్న తనకు బలాలు ఎక్కడ్నించి వస్తాయి?

అయిపోయింది... ఇక ఒక్కటే దారి... యశోన్నతికి కించిత్ భంగకరంగా పరిణమించినా పరిణమించవచ్చుగాక! త్రైలోక్యమల్ల సోమేశ్వరుడిని మళ్లీ శరణువేడటమే మార్గం.

విజయాదిత్యుడు సిగ్గువిడిచి మరోసారి త్రైలోక్య ఆహవమల్ల సోమేశ్వరుణ్ణి ఆశ్రయించాడు. ఈ ఆలోచనకు బీజం వేసింది- చేదిరాజు యశః కర్ణదేవుడు.

అడిగిన తక్షణం ఆశ్రయం ఇచ్చి, ఆ కర్ణాటరాజు తన ఉదారబుద్ధి చాటుకున్నాడు. ఓబలంవాడి రాష్ట్రం విజయాదిత్యుడికి ఇచ్చి కంపిలి ముఖ్యపట్టణంగా పరిపాలించు కొమ్మన్నాడు.

'వేంగిరాజు నాకు సామంతుడు' అనిపించుకోవాలన్న తహతహ కర్ణాటరాజుకు చిరకాలంగా వుంది. రాజరాజ నరేంద్రుడి విషయంలో అది తీరలేదు. చచ్చి చెడిన విజయాదిత్యుడు కూడా వేంగీ చాళుక్యుడే కావడం అతడు తనను ఆశ్రయించడంతో, ఆ రూపంగానైనా తనకోరిక నెరవేరింద

## రాజరాజు కూతురు సోమల; నారాయణభట్టు కూతురు కుపమ

ద్రాక్షారామంలో- రాజరాజ నరేంద్రునిమరణానంతరం అతని కూతురు సోమలదేవి రెండేళ్ల తర్వాత చెక్కించిన ఒక శిలా శాసనం బయల్పడింది. ఇదికాక నారాయణభట్టు కూతురుకుపమ చెక్కించిన శాసనం కూడా ఇక్కడ దొరికింది. కుపమ శాసనంలో, ఆమె ద్రాక్షారామ భీమేశునకు అఖండదీపం నిమిత్తం శాలివాహన శకం 977లో ఒక లోహపు దివ్వె ఇచ్చినట్టు చెక్కబడి వుంది. సోమలదేవి శాసనంలో కూడా ఇటువంటి విషయమే ఉంది. అయితే ఈ శాసనం 987 నాటిది. ఇందులో ఒక సంస్కృత శ్లోకం, ఒక తెలుగు (సీస) పద్యం, ఆటవెలది పద్యం ఉన్నాయి. (సోమలదేవి రాజరాజనరేంద్రునికి రెండో భార్య రేవలదేవి యందు జన్మించింది.)

శాసనంలో సంస్కృత శ్లోకం లోని అర్థం ప్రకారం లేడివంటి కన్నులు గలిగినదియు, తామరల వంటి బుజములు గలిగినదియు అయిన సోమల, భీమేశ్వరునకు బంగారముతో చేయబడిన మందార పుష్పమును, వెండి ప్రమిదయును అఖండదీపం నిమిత్తం ఇచ్చింది.

అలాగే సీస పద్యంలోని ఆరో చరణంలో 'మణ్డ' శబ్దానికి దీపపాత్ర అని అర్థం. కొన్ని ప్రాంతాల్లో 'మండిగ' అనే పదాన్ని మూకుడు అనే అర్థంలో వాడుతున్నారు. పెద్ద మూకుడులో చమురు పోసి అఖండ దీపం పెట్టడం గుళ్ళలో మనం చూస్తున్నాం! అలాంటిదో మూకుడు వెండితో చేయించి సమర్పించినట్టు ఈ శాసన విషయం.

నుకొన్నాడు త్రైలోక్యమల్ల సోమేశ్వరుడు.

విజయాదిత్యుడికిప్పుడు తన మనో రథాన్ని సాధించుకోడానికి తగిన బలం-బలగం లభించాయి. ఒక పద్ధతి ప్రకారం తాను చోళరాజ్యం మీదకువెళ్తూ, కర్ణాట ప్రభువును వేంగిమీదకు దండెత్తేలా పురికొల్పాడు. రెండు రాజ్యాల్లో పరిస్థితులు అనుకూలంగా వున్నాయని భావించిన తరుణంలో వీరిద్దరూ యుద్ధం ప్రకటించారు.

## 40

'ఋషీణాం పునరాద్యానాం- వాచ మర్థోను ధావతే' [ఋషుల వలుకులు అర్థాన్ని అనుసరిస్తాయి]... ప్రాతఃకాలం నుండి, ఆ నాడెందుకో భవభూతి నుడివిన ఈ వాక్యం పదే పదే స్ఫురణకు వస్తోంది నన్నయకు.

నిత్యానుష్ఠానాలు ముగించి, యథాప్రకారంగా భారతరచనకు కూర్చున్నాడు.

మొత్తం భారతానికే కీలకమైన అరణ్యపర్వంలో తాను ఆంధ్రీకరించిన భాగాన్ని ఓసారి అనుశీలించాడు. అరణ్య, శాంత, అనుశాసనిక పర్వాలు మూడూ భారతంలో అతిపెద్ద పర్వాలు కావడంవల్ల హెచ్చు తగ్గులెన్ని చేసినా ప్రధాన కథకు భంగం కలగకుండా ఉపాఖ్యానాలు నడిపించుకుంటూ పోవడానికిముందే నిర్ణయించుకున్నాడు. కిరాతార్జునీయం, నైషధం, సావిత్ర్యుపాఖ్యానం అన్నీ సభారంజకంగా తాను అరణ్యపర్వాన్ని వర్ణించి విన్పించినపుడు రాజరాజుసభ తనెంత శ్లాఘించిందో గుర్తు చేసుకున్నాడు.

'అరణ్య పర్వ మనగా
నారణ్య ప్రముఖ షోడశాంతః పర్వా
దార మయి సకల సూరి స
భారమ్యంబగుతృతీయపర్వము వెలయున్'

-అని తాను పఠించగానే సభలో మిన్నుముట్టిన కరతాళధ్వనులింకా చెవుల్లో మార్మోగుతూనే వున్నాయి.

సభాపర్వ అంతంలో పాండవులు అడవికి వెళ్లినమార్గం వివరించాక, నారాయణుని కోరిక మేరకు చేర్చిన పద్యం ఎంత నిండుదనాన్నిచ్చిందో జ్ఞప్తి కొచ్చింది నన్నయకు.

'వీరులగు పాండు సుతులు మ
హారణ్యనివాస నిరతులయిధరణీబృం
దారక సహస్రములతో
సారమతుల్ చనిరి నిత్యసత్యవ్రతులై'

.... ఈ పద్యం రాసేదాకా మిత్రుడు తనని వదల్లేదు. సమయ సందర్భోచిత




వ్యాఖ్యలు అతడిసొత్తు.

అర్జునుడికి యుద్ధంలో శత్రుసేనలను ఛేదించుకుంటూ వెళ్లే ఉపాయం నారాయణుడు (కృష్ణుడు) చెప్పినట్టు వ్యాసఘట్టాల్ని చెండాడుతూ పోయే రీతిని నారాయణభట్టే చెప్పగలడు. అది అనితరసాధ్యం.

ఒక్కొక్కసారి ఎంత శాంతంగా చెప్తాడో, అంత వీరావేశంగా కూడా మార్గబోధ చేస్తాడు. ఒకానొక వీరావేశంలో శ్రీకృష్ణుడు చక్రం పట్టినట్టు, మిత్రుడు తనకుమారుగా అతడే ఘంటధారణ చేస్తాడా అన్పించేలా చెలరేగిపోతాడు.

ఎన్ని జన్మల తపోఫలమో కదా తానిటువంటి మిత్రుని బడయుట...

నెచ్చెలిస్మరణలోంచి కథాగమనంలోకి వచ్చాడు నన్నయ.

వర్షరుతు వర్ణనం ప్రస్తుత ఘట్టం...

పాండవులు గంధమాదన పర్వతం చేరినప్పుడు కురిసిన వర్షాన్ని వర్ణిస్తూ

"కురిసె బ్రచండవృష్టి ఘన ఘోషము
లెల్ల కెలంకులన్ భయం
కరములు గాగ రాలె కరకాతతులొప్ప
దటిల్లతాళి వి
స్ఫురితముగా బ్రపూర్ణ జలపూరము
లగ్గిరి కుంజ భూరిని
ర్ఝర తటినీ విశాల కటసాలచయంబు
వియూళితంబుగన్" అనే పద్యం రాశాడు.

నహుష ప్రశ్నలకు ఉచితరీతిన సమాధానాలొసంగి, ధర్మరాజు నిద్రాశ్రమం చేరినప్పుడు వర్షం కురిసిన వైనాన్నిపుడు తాను వర్ణించాలి.

ఒక్కసారి వర్షాన్ని తల్చుకున్నాడు...

సిద్ధ సంకల్పుడు కనుక, చూస్తుండగానే వర్షం ఫెళ ఫెళార్భాటంగా కురియసాగింది. వర్షంతోనే పద్యం కూడా సాగింది...

"ఖర కిరణ తాపమున సురు
తరదవదాహామునశోషితములైన వనాం
తర తరుతతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గదుబెడ
గయ్యెన్"

అంత వర్షంలోనూ తడుస్తూ నారాయణభట్టు, నన్నయను చూడవచ్చాడు.

"ఘన తరసైకతమందొకో..." పద్య రచన పూర్తి చేసి "మిత్రమా! కుశలమా!" అని అడిగి సుఖాసీనుని చేసి, పాద్యాదులిచ్చి కవన చర్చకుపక్రమించాడు నన్నయ.

"ప్రక్షాళనాద్ధి పంకస్య దూరాదస్పర్శనం వరం"- అనే న్యాయం ప్రకారం సంస్కృత వ్యాకరణాన్ననుసరించి నేను 'లక్షణసారం' రాశానా! అయినా ఒక్కోసారి నాకే సంతృప్తిగా లేక కొన్ని ప్రత్యయాలు వెయ్యలేక పోతున్నాను" నన్నయ్య అన్నాడు.

"అతడు- వాడు అనే పర్యాయ పదాల్లో 'డు' అనేది తెలుగు ప్రత్యయం. అదే కన్నడంలో 'ను' అనే ప్రత్యయం వస్తుంది. అతను, వాను అని ప్రయోగం చవచ్చు! ఏ ప్రాంతంలో ఏయే పదాలు ఏ అర్థాల్లో సంకేతసుప్రసిద్ధాలయ్యాయో వాట్ని సందర్భానుసారం గ్రంథాల్లో ప్రయోగించుకోవచ్చు!" నారాయణభట్టు తేల్చి చెప్పేశాడు.

"ఇహ తు ప్రవ్యాహార్య సంకేతిత సుప్రసిద్ధ మేవపదం"- అని నేనూ లక్షణం చెప్పాను కదోయి!... కాని శిష్టప్రయోగం

# భారతమహా కవిత్రయం

ఎలావుందో శబ్దం అలావాడాలన్న నియమా నికి కట్టుబడి..." నన్నయమాట మధ్య లోనే అందుకుంటూ "ఒక్కోసారి శిష్టప్ర యోగానికి కూడా నువ్వు దూరంగా వెళ్లిన సందర్భాలున్నాయి" అన్నాడు నారాయణ భట్టు.

"నేనా!?... ఎక్కడబ్బా?" ఆలోచ నలో పడ్డాడు నన్నయ.

"నీకు వైదికశిష్ట వ్యవహారపదాలంటే ఎంతో ఇష్టం కదూ! 'భోజనార్థం ఉండు' అనే అర్థంలో 'క్షణియించు' అనే పదం వాడావు గుర్తుందా?"

"అవును! ఉదంకోపాఖ్యానంలో 'నీవు మా అతిథివి. మా యింట కృతభో జనుడవై వెళ్లు' అని పౌష్యుడు ఉదంకుని క్షణియించేడు అంటూ ప్రయోగించేను"

"ఆ!... అదే!... 'క్షణం కృ' ధాతువునుండి క్షణియించు అనే తత్సమ ధాతువు నువ్వొక్కడివే వేసేవు. అదేం నేరం కాదు. అంచేత ఇకపై ఎప్పుడూ పద ప్రయోగాల్లో నీ స్వతంత్ర్యరీతిని- నీ ముద్రని కించపరచుకోకు. భావి తరాలకు అదే మార్గదర్శక మవుతుంది."

"అదిసరే!... వయోభారం నన్ను ఎక్కువ రాయనివ్వడం . లేదు. మున పటిలా ఏకదిగిన అరవంఘ పద్యాలయినా సాగడంలేదు. దానికితోడు మనో వ్యాకు లత ఒకటి.."

"వ్యాకుల చిత్తానికి కారణం ?" ఆశ్చ ర్యంగా అడిగాడు నారాయణభట్టు.

"ఓహో! నీకు తెలియదు కదూ! విజ యాదిత్యుడు మళ్లీ తలెత్తాడు. మీ కర్ణాట ప్రభువును మళ్లీ దువ్వి, యుద్ధసన్నద్ధు డవు తున్నాడు"

"అన్యాయం!... మనం శ్రమించి చేసిన సంధి..." నారాయణభట్టు మాట అందుకొంటూ "సంధి నియమాన్ని ఉల్లం ఘించి మరీ నైతిక పతనానికొడిగడు తున్నాడు. చరిత్రలో చిరస్థాయిగా- మన రాజనీతిజ్ఞతకు గుర్తుగా మిగిలిపోతుందని మనం భావించిన సంధికి కాలం చెల్లను న్నదని పిస్తోంది."

"ఇప్పుడు మనం చేయదగ్గది ?..."

"ఏమీ లేదు- యుద్ధం తప్ప"

"మళ్లీ యుద్ధమా ?"

"యుద్ధం వస్తే రావచ్చు! ఈసారి యుద్ధం చేసి తీరవలసిందే! విజయమో- వీరస్వర్గమో తేలిపోవాలి"

"ప్రభువులవారు ఇటీవల నీతో జరిపిన సమాలోచన సారాంశమిదా?"

"కేవలం ప్రభువే కాదు!... కత్తి పట్ట గలిగిన మా పంచప్రధానుల అభిమతమూ అదే!"

"అంటే... నువ్వు కూడా !..."

"ఈ నన్నయ ఘంటధారణా విజృం భణ మాత్రమే ఇంతవరకు నువ్వెరుగు దువు. యుద్ధం తథ్యమైతే నా ఖడ్గచలన పారీణత కూడా నీకు దర్శన మవుతుంది."

"నీకు మిత్రుడనైనందుకు నేనెంతో గర్వపడుతున్నాను నన్నీ! నీ ప్రభుభక్తీ- దేశరక్షణా నిరతీ శ్లాఘనీయం. కవన లాలి త్యాన్ని వెలయించిన కరకమలాలే అయినా, అవసరమైతే కదనపాండితినీ ప్రదర్శించా లన్న నీ గుణ విశేషాలు అందరికీ మార్గ దర్శకం కావాలి" మనస్ఫూర్తిగా అభినం దించాడు నారాయణభట్టు.

(ఇంకావుంది)



'ఆంధ్రపత్రిక' ఆదివారం అనుబంధం పాఠకులకు

## సంక్రాంతి కానుక

## 'సంధ్యాసమీరాలు' (నవల)

### శ్రీమతి జి.భవానికృష్ణమూర్తి (రచన)

మనసు తపిస్తుంది- మమత వరిస్తుంది- మంచి ఫలిస్తుంది- ఇదే సమ్యక్ జీవితం. ఇలాంటి వ్యక్తుల జీవితాలపై, పరిస్థితుల ప్రభావం పడి నప్పుడు ఏమవుతుంది? సంకోచంలేని వారు తెగిస్తారు- సంయమనం గలవారు సుమతులవుతారు. వారు సన్నిహితులైనా, సంపన్నులైనా విభిన్న మార్గాలలో చరిస్తారు. అనురాగబంధం ముట్టేసినప్పుడు, తిరిగి అందరూ కలుస్తారు.

ఇలాంటి ఉదాత్తమైన ఇతివృత్తంతో, మమతానురాగాలు మేళవిం చిన పాత్రలతో రసరమ్య సన్నివేశాలతో సుప్రసిద్ధ నవలారచయిత్రి శ్రీమతి జి. భవాని కృష్ణమూర్తి లేఖినినుంచి జాలువారిన సుమసౌరభ భావతరంగాలే 'సంధ్యా సమీరాలు'.

ఈ నవలను ఆంధ్రపత్రిక ఆదివారం అనుబంధంలో ధారావాహికంగా ప్రచురించి సంక్రాంతి కానుకగా సమర్పిస్తున్నామని తెలుపుటకు సంత సిస్తున్నాం:

-ఎడిటర్

# హలో! డాక్టర్ నేనేం చెయ్యాలి?



డా. కొత్త రవీంద్రబాబు

**బి.పవన్, విజయవాడ.**

ప్ర : వయసు 22 సంవత్సరములు. కీచుగొంతుగావుంది.

జ : నిర్జన ప్రదేశంలో నింపాదిగా కూర్చుని పెద్దగా మాట్లాడడం ప్రాక్టీసు చేసుకోండి.

**ఎం.ఎ.శాస్త్రి, కంభంపాడు.**

ప్ర : ఉత్తమసాహిత్యం చదవాలనివుంది.

జ : సాహిత్యంలో నోబెల్ బహుమతి గ్రహీతల పుస్తకాల అనువాదాలు సంపాదించి చదవండి. ప్రాచీన కావ్యాలు, నాటకాలు చదవండి.

**ఎ.ఎస్.రావు, గుంటూరు.**

ప్ర : ఏది ఉత్తమసాహిత్యం.

జ : దేశకాలభేదాలనధిగమించగల్గినదే ఉత్తమసాహిత్యం.

**వై.సి.హెచ్.శేఖర్, విజయనగరం.**

ప్ర : వయసు 18 సంవత్సరములు. ఆడవాళ్ళతో మాట్లాడుతుంటే భయం, ఆందోళన, చేతులు వణకుతాయి.

జ : ఇండిరాల్ పది మిల్లీగ్రాముల బిళ్ళ ఉదయం ఒకటి సాయంత్రం ఒకటి వేసుకోండి రెండు నెల్లపాటు.

**ఎన్.సాయిప్రసాద్, ఖర్గపూర్.**

ప్ర : వయసు 21 సంవత్సరములు. రెండు భుజాల మీద వెంట్రుకలు వుండటం వలన ఏదో గావుంది.

జ : యుక్త వయసులో అలా రావటం సహజం.

**ఎ.శ్రీనివాసరావు, నర్సరావుపేట.**

ప్ర : 17 సంవత్సరములు. సన్నగా వున్నాను. చిన్నప్పుడు పోలియో వచ్చింది.

జ : ఒరబోలిన్ బిళ్ళ రోజూ ఒకటి చొప్పున నాలుగు నెలలు బెస్టోజైమ్ టానిక్ ఉదయం సాయంత్రం భోజనం తర్వాత ఆరు నెలలు వాడండి.

**ఎన్.సుమతి, ఒంగోలు.**

ప్ర : వక్షోజాలు సరిగ్గా లేవు. బాధగా వుంది.

జ : ప్లాస్టిక్ సర్జన్‌ను సంప్రదించండి.

**పి.ఎన్.రెడ్డి, కావలి.**

ప్ర : వేశ్యతో కలిశాక అంగం మీద పుండు లేచింది.

జ : డాక్సీ ఐ గొట్టాలు ఉదయం సాయంత్రం ఇరవై రోజులు వాడండి.

**ఎ.సుందరరావు, బాపట్ల.**

ప్ర : వాసెక్టమీ చేయించుకున్న దగ్గర్నుండి రతి సామర్థ్యం తగ్గింది. భయంగావుంది.

జ : మీరు అపోహ పడుతున్నారు. వాసెక్టమీ తర్వాత రతి సామర్థ్యం పెరుగుతుంది గాని తగ్గదు. ట్యురవిన్ గొట్టం రాత్రి పడుకోబోయేముందు పది రోజులపాటు వాడండి.

**ఎన్.సత, ముక్కామల.**

ప్ర : ఋతుస్రావం సరిగ్గా రాదు.

జ : లేడీ డాక్టరుగారికి చూపించుకొని మందులు వాడండి.

**డి.శశిధర్, నెల్లూరు.**

ప్ర : ఎడమకాలి మీద చర్మవ్యాధితో బాధ పడుతున్నాను.

జ : ఎక్జిమా వ్యాధి తరచు వస్తుంటుంది. అది మీ వంటి తీరు. ఎక్కువగా పూతమందులే వాడండి.

**ఎన్.సత్యనారాయణ, కొత్తపేట.**

ప్ర : భుజాల మీద ముఖం మీద మచ్చలకు విట్ ఫీల్డ్ ఆయింట్‌మెంట్ వాడవచ్చా?

జ : విట్‌ఫీల్డ్ ఆయింట్‌మెంట్ వలన ప్రయోజనం ఉంటే వాడవచ్చు. ఆయింట్‌మెంట్ కంటికి తగులకూడదు.

**ఎ.ప్రసాద్, చీరాల.**

ప్ర : వయసు 21 సంవత్సరములు. రెండు సంవత్సరముల నుండి గేదెతో రతిలో పాల్గొను చున్నాను. అంగం కింద నొప్పిగావుంది.

జ : పశు సంపర్కం మానండి. బొరోవిన్ ఆయింట్‌మెంట్ అంగం కింద రాసుకోండి.

**పి.సుశీల, వేజెళ్ళ.**

ప్ర : మా అబ్బాయి మట్టి తింటున్నాడు. ఎంత ప్రయత్నం చేసినా మాన్పలేకుండా వున్నాము.

జ : మెబెక్స్ బిళ్ళలు ఉదయం సాయంత్రం మూడు రోజులు వాడండి. జింకోఫర్ టానిక్ భోజనం తర్వాత చెంచా మందు రోజుకు రెండు సార్లు తాగిస్తుండండి. రక్త హీనత వలన పిల్లలు మట్టి తింటారు. ●



# అందానికి, పలువరుస చందానికి
# "ఆర్థోడాంటిక్స్" చేస్తున్న సేవ

*ఒక దంత వైద్యనిపుణుడు మరొక వర్ధమాన*
*స్పెషలిస్టు డాక్టర్‌తో జరిపిన సాధికార సంభాషణం*
*పాఠకులకు మరింత ఉపయోగంగా వుంటుందని అనుకుంటున్నాము-ఎడిటర్*

ఆధునిక యుగాన్ని, వైద్యపరంగా స్వర్ణయుగంగా చెప్పుకోవచ్చు. కంప్యూటర్ల ప్రాధాన్యత పెరిగి, రోగ నిర్ధారణ అతి సులభతరమయింది. విదేశాల్లో విపరీతమైన మొత్తంలు ఖర్చు పెట్టి వైద్యం చేయించుకోవలసిన పరిస్థితులు మారి, స్వదేశంలోనే తక్కువ ఖర్చుతో వైద్య సదుపాయాలు చెప్పుకోదగిన రీతిలో మెరుగయ్యాయి. దంతవైద్య పరంగా కూడా గణనీయమైన అభివృద్ధిని మనం చూస్తున్నాం. అయితే, పాశ్చాత్య దేశాల్తో పోల్చి చూచినట్లయితే, మనం యింకా చాల వెనుకబడి వున్నామనే చెప్పాలి. దంత వైద్యంలో సౌందర్య దంత వైద్యానికి అధిక ప్రాధాన్యత లభిస్తున్నది. ఇందులో భాగంగా 'ఆర్థోడాంటిక్ చికిత్స' గురించి, విజయవాడలోని ప్రముఖ ఆర్థోడాంటిస్ట్, డా. సి. శేఖర్, ఎం.డి.ఎస్. యేమంటారో చూద్దాం.

ప్ర: డాక్టర్ గారూ! 'ఆర్థోడాంటిక్స్' ప్రత్యేక విషయంగా మీరు పి జి డిగ్రీ తీసుకొన్నారు గదా! దీని గురించి కాస్త వివరిస్తారా?

జ: ఆర్థోడాంటిక్స్, అనే పదానికి శాస్త్రీయపరంగా ఎలాంటి అర్థం వున్నప్పటికీ, సామాన్యులకి సైతం అర్థం అయ్యే విధంగా చెప్పాలంటే, ఎత్తు పల్లని, ఎగుడుదిగుడు పల్లని, వంకర టింకర పల్లని సరిచేయడంతో పాటు, దవుడల్లో కూడా లోటుపాట్లేమయినా వుంటే సరిచేసి, అందమైన పలు వరుసగా తీర్చిదిద్దడం అని చెప్పుకోవచ్చు. ఈ చికిత్స వల్ల, పల్లు అందంగా కన్పించడంతో పాటు, కొన్ని దంత-చిగురు, వ్యాధులను అరికట్టే అవకాశం కూడా వుంది.

## వయస్సుతో నిమిత్తంఉందా?

ప్ర: ఈ చికిత్సకు, వయస్సు ప్రాధాన్యత యేమయినా వుందా?

జ: వయస్సు ప్రాధాన్యత లేకపోలేదు. 12-20 సంవత్సరాల మధ్య వయస్కులలో యీ చికిత్స చాలా త్వరగా పూర్తవుతుంది. అయితే, ఎలాంటి వయస్సులోనైనా, చిగుళ్ల-పల్ల, ఆరోగ్య పరిస్థితి ప్రోత్సాహకరంగా వుంటే, యీ చికిత్స చేయించుకోవచ్చు. అయితే వయస్సు పెరిగే కొద్ది, చికిత్సా సమయం కూడా ఎక్కువగా వుంటుంది.

## ఆడపిల్లలకే పరిమితమా?

ప్ర: ఈ చికిత్స కేవలం ఆడపిల్లలకే పరిమితమా? మీ దగ్గరకు ఎవరు యీ చికిత్స కోసం ఎక్కువగా వస్తుంటారు?

జ: మొదట్లో, ఆడపిల్లలే యీ చికిత్స విషయంలో ఎక్కువ ఉత్సాహం చూపించేవారు. అయితే, దంత సౌందర్యానికి ప్రాధాన్యత నిచ్చే మగపిల్లలు సైతం యీనాడు ఆర్థోడాంటిక్ వైద్యం కోసం ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నారు.

ప్ర: ఆర్థోడాంటిక్ చికిత్సా విధానంలో భిన్నమయిన పద్దతులేమయినా వున్నాయంటారా?

జ: పలు వరుస క్రమాన్ని బట్టి, దవుడల పరిస్థితిని బట్టి, చికిత్సను నిర్ణయించవలసి వుంటుంది. అయితే, మామూలుగా చెప్పుకోవలసి వస్తే, ఆర్థోడాంటిక్ చికిత్స రెండురకాలుగా వుంటుంది. రిమువబుల్ అప్లియాన్స్ పద్ధతి ఒకటి, రెండోది ఫిక్స్‌డ్ అప్లియాన్స్ పద్ధతి. రిమువబుల్ అప్లియాన్స్ పద్ధతిలో, అవసరమయినప్పుడు క్లిప్పును తీసుకునే సౌకర్యం వుంటుంది. ఈ క్లిప్పు ముఖ్యంగా పల్ల మధ్య చిన్న చిన్న ఖాళీలు వున్న వారికి, పల్లు తీయవలసిన అవసరం లేనివారికి మాత్రమే వేయబడుతుంది. దీనికి భిన్నంగా, పల్లు బాగా ఎత్తుగా వుండి, కొన్ని పల్లు తీయవలసిన పరిస్థితి యేర్పడినప్పుడు ఫిక్స్‌డ్ చికిత్సా విధానం అవసరం అవుతుంది. అవసరాన్ని బట్టి ఒక్కోసారి శస్త్రచికిత్స ద్వారా కూడా పల్లు సరిచేయవలసి రావచ్చు. దీనిని సర్జికల్ కరెక్షన్ అంటారు.

## పల్లు తీయాలా?

ప్ర: పల్లు తీయవలసిన పరిస్థితి అంటున్నారు. ఈ చికిత్సలో తప్పనిసరిగా పల్లు తీయాలంటారా?

జ: ఆర్థోడాంటిక్ చికిత్సలో పల్లు తీయాలనే ప్రత్యేక నియమం ఏమీ లేదు. కాని, పల్లు బాగా ఎత్తుగా వున్నప్పుడు, వీటి ఎత్తు తగ్గించే విషయములో వెనుకకు జరపాలి కాబట్టి,

డా. కె.ఎల్.వి. ప్రసాద్
ఇంటర్వ్యూ



డా॥సి.శేఖర్.ఎం.డి.ఎస్.తో

అవి వెనక్కు జరగాలంటే, దవుడలో ఖాళీ ప్రదేశం వుండాలి కాబట్టి, ఆ ఖాళీ ప్రదేశాన్ని కల్పించే విధానంలో అవసరాన్ని బట్టి పై దవుడలోని వెనుకవల్లు (ప్రీ-మోలార్లు) రెండు, క్రింది దవుడలోని వెనుక వల్లురెండు తీసివేయవలసి రావచ్చు. అయితే, చికిత్స పూర్తయిన తరువాత ఆ ఖాళీ ప్రదేశం కూడా మూసుకు పోతుంది

ప్ర ఆర్థోడాంటిక్ చికిత్స కోసం మీరు వుపయోగించే పరికరాలు మన దేశం లోనే లభ్యమవుతున్నాయా? లేక విదేశాల నుండి దిగుమతి చేసుకోవ లసిన పరిస్థితి యేర్పడుతున్నదా?

జ మనదేశంలో ఆర్థోడాంటిక్ చికి త్సను గురించిన సమాచారం అంద రికీ అందుబాటులో లేకపోవడం వల్ల, అవసరానికి సరిపడినంత మంది ఆర్థోడాంటిస్టులు లేనందున, చికిత్స నిమిత్తం అవసరం అయిన పరికరాలు, మెటీరియల్సు, మనదేశంలో అంతగా తయారు చేయబడడం లేదు అందు చేత మంచి ఫలితాలను దృష్టిలో వుంచుకొని, తప్పనిసరిగా విదేశాల నుంచి కొన్ని సున్నితమయిన పరి కరాలు, మందులు దిగుమతి చేసుకో వలసిన అవసరం యేర్పడుతున్నది

ప్ర ఆర్థోడాంటిక్ చికిత్స సామాన్యుడికి అందుబాటులో లేదన్నది కొంతమంది అభిప్రాయం ఇది నిజం అనుకుం టాను కూడా ఈ విషయంలో మీరేం చెబుతారు?

జ ఈ అభిప్రాయంలో కొంత నిజం లేక పోలేదండి! అయితే చికిత్స కోసం వుపయోగించే పరికరాలు, మందుల ధరలు వూహించని రీతిలో పెరిగిపో వడం వల్ల ఈ భారం సామాన్యుల మీద పడక తప్పడం లేదు అయితే, హైదరాబాద్‌లోని ప్రభుత్వ దంత వైద్యశాలలో మాదిరిగా, కనీసం జిల్లా ఆసుపత్రులలోనయినా, యీ చికి త్సను ఉచితంగా చేసే యేర్పాటు చేస్తే, సామాన్య ప్రజానీకానికి తప్ప నిసరిగా మేలుజరుగుతుందని నా అభిప్రాయం

ప్ర డాక్టర్‌గారూ! చికిత్సా సమయంలో ఏమైనా యిబ్బందులకు గురి అయ్యే


ట్రీట్ మెంట్ ముందు


ట్రీట్ మెంట్ తర్వాత

ప్రమాదముందంటారా?

జ చెప్పుకోదగ్గ యిబ్బందులంటూ ఏవీ వుండవండి! అయితే క్లిప్పులు వేసు కొన్న తరువాత క్రొత్తదనం వల్ల, వల్ల మీద కొన్త ఒత్తిడి పడడం వల్ల కొద్దిగా యిబ్బంది అనిపించవచ్చు అయితే వారం రోజుల్లో పరిస్థితి చక్కబడు తుంది ఇలా కాక ఎక్కువరోజులు ఏవైనా యిబ్బందులు కలిగితే, వాటిని దంతవైద్యుల దృష్టికి తీసుకువచ్చిన వ్వుడుసమస్యను పరిష్కరించే వీలవు తుంది

## చికిత్సా కాలం

ప్ర చికిత్స పూర్తి కావడానికి ఎంతకాలం పట్టవచ్చునంటారు?

జ ఈ చికిత్స, ఆయా దవుడల-వల్ల, పరిస్థితి మీద ఆధారపడి వుంటుంది

ఫిక్సెడ్ అప్లియాన్స్


ఇరవయి సంవత్సరాల లోపు వయస్సు గల వారిలో చికిత్స ఒక సంవత్సర కాలంలో పూర్తి కావచ్చు ఇర వయి సంవత్సరాలు పైబడిన వారికి, మాత్రం ఒకటిన్నర సంవత్సరాలపైనే పట్టవచ్చు అయితే, నిర్ణీత సమయం అంటూ లేదు క్లిప్పులు ఎంత శ్రద్ధగా వాడగలిగితే, అంత త్వరలో చికిత్స సత్ఫలితాలనిస్తుంది

ప్ర ఆర్థోడాంటిక్ చికిత్స పొందే వారికి మీరిచ్చే సలహా యేమిటి?

జ. ముఖ్యంగా, యీ చికిత్స పొందే వారి సహకారం సరిగా లేకపోతే, వైద్యులు చేసేది యేమీ వుండదు అపాయింట్ మెంట్ ప్రకారం వచ్చి పరీక్ష చేయించుకోవడం ముఖ్యం క్లిప్పులు వేసుకున్నవాళ్లు జామకాయ లవంటి గట్టి పదార్థాలను కొరక కూడదు రోజుకు కనీసం మూడుసా ర్లయినా బ్రష్ చేసుకోవాలి ఇలాంటి వారి కోసం ప్రత్యేకమైన బ్రష్‌లు కూడా లభ్యమవుతున్నాయి. తర చుగా శుభ్రమయిన నీటితో, నోటిని పుక్కిలించడం అవసరం అన్నింటికి మించి, ఫలితాల కోసం వైద్యు లను అదేపనిగా తొందరచేయకూ డదు. ఎలాంటి సమస్య వచ్చినా, యితరుల సలహా పాటించక సరా సరి దంతవైద్యులను సంప్రదించడం మంచిది

O




**ఇంతవరకూ సాగినకథ–16:** నాటకాల పిచ్చి వున్న రామకృష్ణ–గణపతి స్నేహితులు. లా చదివేందుకు అలహాబాద్ వెళ్లిన రామకృష్ణకు సిన్హా–రబీన్ స్నేహితులవుతారు. టి.బి. సోకిన నవనీతకు రామకృష్ణ వైద్యం చేయిస్తూ ఆ కుటుంబానికి సన్నిహితుడవుతాడు. రామకృష్ణ నవనీతను పెండ్లి చేసుకోవాలన్న తన నిర్ణయాన్ని గణపతికి తెలియజేస్తాడు. నవనీత టి.బి. నుంచి కోలుకుంటున్నదని తెలిసి రామకృష్ణ సంతోషిస్తాడు.

(గత సంచిక తరువాయి)

## 23

రామకృష్ణకు విశాఖపట్నంలో చాల ఉల్లాసంగ రోజులు గడచి పోతున్నాయి. పాత స్నేహితులతో కాలక్షేపం బాగానే అవుతూంది. విశాఖ చేరింతరువాత రబీన్ చటర్జీకి, దేవేంద్రసిన్హాకు తనింటికి వచ్చి కొన్ని రోజులుండమని కోరుతు ఉత్తరాలు వ్రాసేడు. రబీన్ తను భార్యతో దసరా శలవులకు అక్టోబరు మాసంలో వస్తానని వ్రాసేడు. దేవేంద్రసిన్హా తన జవాబులో –

"నీ ఆహ్వానానికి చాల థాంక్స్. వచ్చే నెల మొదటి వారంలో తప్పకుండా వస్తాం. ముఖ్యంగ మా నాన్న, అమ్మ వెళ్ళడానికి చాల ఆతృత చెందుతున్నారు. నా చెల్లెలు నీలకు నీ మీద చాల కోపమొచ్చింది. నీవు వ్రాసిన ఉత్తరాన్ని తను నా నుండి తీసుకుని శ్రద్ధగా చదివింది. నీవు నీలను మాతో రమ్మని కోరలేదు. నన్ను, మా అమ్మను, మా నాన్నను మాత్రమే రమ్మని వ్రాసేవు. అందుకే నీల కంత కోపం, అలక. నువ్వు ఇకముందు రాయపూరు వస్తే నీతో మాట్లాడదట. కనీసం నీకు కప్పు టీని కూడ తన చేతి మీదుగ ఇవ్వదట. మరి నీఇష్టం. మేము మాత్రం తప్పక వస్తాం."

రామకృష్ణ నవ్వుకున్నాడు. వెంటనే నీల పేరున ఓ ఉత్తరం వ్రాసేడు.

"డియర్ ఫ్రెండ్ నీల– నీ అన్నయ్య వ్రాసిన ఉత్తరం చేరింది. నిన్ను ఆహ్వానించలేదని, నీకు నా మీద చాల కోపం వచ్చిందని తెలియ జేసేడు. నువ్వు నాతో మాటలు మానేసి, కనీసం టీ కూడ ఇవ్వకపోతే నేను తట్టుకోగలనా? ఇంతకీ నేను మన దేవేంద్రకు వ్రాసిన లేఖలో నీ పేరు వ్రాయడం మర్చిపోయను ఏమరుపాటున. అంతేగాని కావాలని చేసిన పనికాదు. అందుచేత దీనినే ప్రత్యేక ఆహ్వానంగ భావించి నువ్వు తప్పకుండ మీవాళ్ళతో కలసి విశాఖపట్నంకు మా ఇంటికి తప్పక రావల్సిందని కోరుతున్నాను. నా స్నేహితుడి చెల్లెలైన ఈ చిలిపి నీలను చూడాలని మా అమ్మ చాల కుతూహల పడ్తూంది. మీ అందరి వివరాలను మా అమ్మకు చెప్పేను. మా అమ్మ తరఫున కూడ మీ అందరికి ఇదే ఆహ్వానమని నీ అన్నకు, అమ్మగార్కి, నాన్నగార్కి చెప్పు. మీ అందరి రాకకు ఎదురు చూస్తుంటాము."

మరో పది రోజులకు దేవేంద్రుడి నుండి ఉత్తరం వచ్చింది. అందులో మరో వారం రోజులలో వారంత బయలుదేరి రాయపూర్ నుండి లింక్ ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నట్టు వ్రాసేడు వస్తున్న తారీఖు తెలియజేసి.

వారం రోజులు గడిచి పోయేయి నెమ్మదిగ. రామకృష్ణ ఇంట్లో మామయ్యకు అత్తయ్యకు, తల్లికి తన స్నేహితుల రాక గురించి చెప్పేడు. వాళ్ళు సంతోషించేరు. తల్లి శాంతాదేవి పనివాళ్ళతో మేడమీదున్న గదుల్ని శుభ్రంగా చేయించి, కర్టెన్లను, దుప్పట్లను మార్పించింది. ఆ రాత్రి వచ్చే

అతిథులకోసం రొట్టిల్ని తయారు చేయించి ఉంచింది.

రామకృష్ణ ఇల్లు చాల పెద్దది. క్రిందన మిగత గదులతో బాటు మూడు పడక గదులున్నాయి. ఒకగదిలో శాంతాదేవి, మరో గదిలో నరసింహం, అతని భార్య ఉంటున్నారు. మేడమీద మెట్లెక్కగానే ఓ హాలు. ఆ హాలుకి మధ్య నుండి ఓ పొడుగాటి వరండా పశ్చిమానికుంది. ఆ వరండాకు చెరో వైపున రెండేసి పడక గదులున్నాయి. రెండు పడకగదులకు మధ్యన బాత్‌రూమ్, లేవటరి అనుబంధితంగ నున్నాయి. కుడిప్రక్క నున్న రెండు గదులలో ఒక దాంట్లో రామకృష్ణ ఉంటున్నాడు. ఆ వరుసనున్న చివరిగదిని స్నేహితుడు దేవేంద్రకు ఏర్పాటు చేసేడు.

అలాగే వరండాకు ఎడమవైపు నున్న రెండు పడక గదులను, ఒకటి సత్యజిత్‌సిన్హాకు, రెండవది సీలకు కేటాయించేరు. మామూలుగ ఎవరైన బంధువులు గాని, అతిథులు గాని వస్తే ఆ మేడమీద గదుల్లో ఉండడానికిస్తారు. శాంతాదేవి దగ్గర చుట్టాలెవరైన వస్తే దిగువ భాగంలో నున్న ఆ మూడవ పడక గదిలో ఉండనిస్తారు. అందు చేత వాళ్ళింటికి ఎందరు అతిథులు వచ్చిన వారికేమి ఇబ్బంది ఉండదు.

అలాగే పనివారు కూడ వంటకి, ఇంట్లో చిల్లర పనులకు, బయట సామాన్లు కూరగాయలు తేవడానికి, నరసింహంగారి కారు నడపడానికి, తోటపని చూడడానికి అందరు మనుష్యులున్నారు



షెడ్డులో ఓ అంబాసిడర్ కారు, ఓ ఫియట్ కారు ఉన్నాయి. ఆ రెండు కార్లు తీసుకుని రాత్రి రామకృష్ణ, అతడి మేనమామ నరసింహం స్టేషనుకు వెళ్ళారు. అతిథుల్ని రిసీవ్ చేసుకున్నారు. పరిచయాలయ్యేక ఇంటికి బయలుదేరేరు సామాన్లను తీసుకుని. ఇంటికి చేరింతరువాత రామకృష్ణ అతిథులందర్నీ తన తల్లికి, మేనత్తకు పరిచయం చేసేడు.

బట్టలు మార్చుకుని అందరు భోజనానికి వచ్చిం తరువాత శాంతాదేవి దగ్గరుండి వడ్డించింది. వారంత తృప్తిగ భోజనం చేసి మేడమీదకు వచ్చేక నరసింహం వారి వారి పడక గదుల్ని చూపించేడు. అన్ని సౌకర్యాలతో నున్న ఆ ఇల్లు వారికి బాగా నచ్చింది. సిన్హాకు వారిలా వీరికి ఇండస్ట్రీస్, సినీమాహాల్సు లేకపోయిన రామకృష్ణ కుటుంబీకులు బహు సంపన్నులే అని అర్థమైంది.

మరునాడు అందరు స్నానాదులు అయ్యేక కాఫీ, ఫలహారాలు సేవించేక సిన్హా తన కుటుంబ సభ్యులతోను, రామకృష్ణతోను మేడమీద హాలులో సమావేశమయ్యేడు.

"డాడీ! మీరందరికి కాఫీయే కావాలని చెప్పేరా? నాకు టీ త్రాగకపోతే అదోలా గుంటుంది," అని నీల గునిసింది.

"ఏం- కాఫీ బాగోలేదా?" చిరునవ్వుతో అడిగేడు రామకృష్ణ

## ప్రణయవల్లరి

"బాగుంది గాని నాకు టీ అలవాటే."

"అదేమి పనికిరాదు. వీళ్ళింట్లో ఉన్న పది రోజులు నువ్వు వాళ్ళు త్రాగే కాఫీయే త్రాగాలి, వారి దక్షిణాది వంటల్నే తినాలి. అప్పుడే మనం వాళ్ళను బాగా తెల్సుకోగలం. మార్పుకూడ మధురంగా ఉంటుంది. రామకృష్ణ మనింటికి వచ్చినప్పుడు మనతో బాటు టీ త్రాగడం లేదు," అన్నాడు తండ్రి సత్యజిత్‌సిన్హా.

"సరేలెండి- మీరంత ఏకీభవిస్తే నేనేం చేయగలను. కాని కృష్ణాజీ మీరు అప్పుడప్పుడు నాకు మా వాళ్ళు చూడకుండ ఓ కప్పు టీ ఇస్తుండండి," అంది చిలిపిగ.

అందరు నవ్వుకున్నారు.

"దానినాన్న గారు, అన్నయ్యలు దాన్నెంత ముద్దుచేసేరంటే దానిష్టమే జరగాలి అలా జరిపించుకుంటుంది నేర్పుగ కూడ," అని నవ్వుతునే చెప్పింది రమాదేవి రామకృష్ణతో.

"సరే- రామకృష్ణా! మేము పది రోజులు ఇక్కడ ఉందామను కుంటున్నాము."

"అదేంటిసార్- అలా వీలుపడదు. నేను ముందుగానే దేవేంద్రకు వ్రాసేను తప్పనిసరిగ పదిహేను రోజులుండాలని."

"సరే- ముందా పదిరోజు లైనాక ఇంకా చూడవల్సిన చోట్లుండిపోతే ఆ సరికి మా నీలకు బోరుగ ఉండకపోతే మా ఉనికిని పొడిగిస్తాం- సరేనా? మరి మేము ఏ ఏ పరిసరాలను చూడాలి- ఎలా ఈ పదిరోజులు సరదాగా గడపాలో చెప్పు. ఓ క్రమబద్ధంగ రోజుల్ని గడపడం నాకు ఇష్టం," అన్నాడు సత్యజిత్‌సిన్హా.

"అలాగే కానీండి. ఒకనాడు బీచిరోడ్డు మీదుగ కారులో విశాఖ నుండి భీమిలి వెళ్దాం. కొండల మీంచి పోయే ఆ రోడ్డు, తూర్పు దిశగ మహాసముద్రం చూడ ముచ్చటగనుంటాయి. భీమిలీలో బ్రిటిష్ కాలం నాటి పెదపెద్ద సౌధాలు ఈ నాడు శిథిలావస్థలో నున్నాయి. వాటిని చూసి రావచ్చు.

ఒకనాడు ఇక్కడ నుండి 50 కిలో మీటర్ల దూరంలో నున్న విజయనగరం గ్రాండ్ ట్రంక్ రోడ్ మీదుగ కారులో పోయివద్దాం. అక్కడున్న గంటస్థంబం, అక్కడి కోట ప్రశస్థమైనవే. ఆ ఊరులోనే నాకు పరిచయమున్న గొప్ప చిత్రకారుడు అంట్యాకుల పైడిరాజు గారున్నారు. వాళ్ళింటికి వెళ్ళి అతను చిత్రించిన పటాలను చూసివద్దాం. అందమైన అద్భుత చిత్రాలవి.

మరోనాడు ఇక్కడకు 12 కిలో మీటర్ల ధూరంలో నున్న సింహాచలంకు వెళ్దాం. అక్కడ సింహం ఆకారంలో నున్న కొండపై నున్న శ్రీ వరహాలక్ష్మీ నరసింహ స్వామి వారిని దర్శించి వద్దాం. ఆ దేవాలయం పురాణ ప్రసిద్ధమైనది.

మరో నాడు అవుటర్ హార్బర్ని సందర్శించి, అక్కడ నుండి పోర్టుకు వచ్చి పోర్టును చూసుకుని పడవలో సముద్ర విహారం చేసి వద్దాం.

మరోనాడు ఇక్కడున్న కాల్టెక్సు రిఫైనరీని, కోరమండల్ ఫెర్టిలైజర్స్ ప్లాంటుని చూద్దాం.

ఇంకొకనాడు హిందుస్థాన్ జింక్ **ఫ్యాక్టరీని, భారత్ హెవీ ప్లేటు అండవెసల్సు ఫ్యాక్టరీని చూద్దాం.**

ఇంకోనాడు నేవల్ బేస్‌ని, హిందూస్థాన్ షిప్ యార్డుని చూసొద్దాం ముఖ్యంగ షిప్‌యార్డులోని పడవల తయారి చూడవల్సిందే.



ఇంకొక నాడు ఈ ఊరుకు నూట నలభై కిలో మీటర్ల దూరంలో నున్న అరకువేలీకి పోయివద్దాం ట్రెయినులో వెళ్తే సుమారుగ 50 పెద్ద పెద్ద సొరంగాల ద్వారా వెళ్ళడం జరుగుతుంది అంత ఎత్తైన కొండలను దొలచి రైలు మార్గానికి సొరంగాలను నిర్మించడం ఓ గొప్ప ఇంజినీరింగు నైపుణ్యమనే చెప్పొచ్చు. అరకువాలీ చాల అందంగ ఉంటుంది. అక్కడ చక్కని బొటానికల్ గార్డెను, ఓరోజ్ గార్డెను ఉన్నాయి. వెళ్ళేప్పుడు ట్రెయినులో వెళ్ళి వచ్చేటప్పుడు కారులో వద్దాం త్రోవలో బొర్రాగుహల్ని చూసి రావచ్చు ముందుగ మనకారును అరకు పంపిద్దాం రోడ్డు మార్గము పర్వత శ్రేణులపైనుండి," అని "మిగతా రోజుల్లో ఈ పట్టణ బజార్లు, షాపింగ్, చక్కని సినిమాలు, **ఆహ్లాదపరచే బీచి ఉండనే ఉన్నాయి,"** అని కార్యక్రమాన్ని ముగించేడు

"ఈ పది రోజులు నేను తప్పనిసరిగ బీచికి వెళ్ళాలి," అంది నీల.

'ఏం–మీ పట్నంలో బీచి లేదా?" అని అమాయకంగ ముఖం పెట్టి రామకృష్ణ అడిగేడు.

వెంటనే నీల "ఏది– ఎక్కడుంది? మీరు చూసేరుగ మా ఊరుని," అనేసి తన తప్పిదాన్ని తెల్సుకొని నాలిక కర్చుకుని "కృష్ణాజీ!మీకు జాగ్రఫీ రాదు," అంది. కాని ఆ సరికే అందరు నీలను చూస్తూ గలగల నవ్వేసేరు.

"మీ అమ్మగారితో ఏ భాషలో మాట్లాడాలి? మీ మామయ్య గారితో ఇంగ్లీషులో మాట్లాడుతున్నాం– ఇబ్బందేమి లేదు" అన్నాడు సత్యజిత్‌సిన్హా.

"మా అమ్మగారికి, మా అత్తయ్యకు, ఇంగ్లీషు ధాటీగా మాట్లాడ లేకపోయిన, వ్యవహారానికి పనికొచ్చేంత ఇంగ్లీషు వచ్చు. వారిరువురు ఆ రోజుల్లో స్కూలుఫైనల్ పాసయిన వాళ్ళే. వారిద్దరికి కాస్త హిందీ కూడ వచ్చు. అందుచేత మీరు ఏ భాషలో మాట్లాడిన వారికి, అర్థమౌతుంది, గాని జవాబు చెప్పేటప్పుడు ఆ రెండు భాషల్ని కలపి ఏదో విధంగ మాట్లాడగలరు. మా మామయ్యకు హిందీ బాగానే వచ్చు. పనివాళ్ళకు కాస్తా, కూస్తా హింద అర్థమౌతుంది. వాళ్ళంత హిందీ సినీమాలు చూస్తున్న వాళ్ళే," అని నవ్వుతు చెప్పేడు రామకృష్ణ.

"నేను రెండు పదాల్ని తెలుగులో మాట్లాడగలను. నిన్న రాత్రి మీ అమ్మగారి వద్ద తెల్సుకున్నాను," అన్నాడు దేవేంద్రుడు.

"నాకూ ఒకమాట వచ్చు– కాని నువ్వు ముందుగ చెప్పు" అంది నీల.

"భోజన్ చేయండి– కర్రీ కావాలా. ఇక నీ మాట చెప్పు" అని నవ్వుతూ చెల్లెలి వైపు చూచేడు దేవేంద్రుడు.

"రామమ్మా! మంచినీళ్ళు."

అందరు వారి గ్రహణ శక్తికి నవ్వుకున్నారు.

"నేను వెళ్ళే లోగా తెలుగు బాగా నేర్చుకుంటాను" అని ఎంతో విశ్వాసంతో అంది నీల.

"నీ మాటకేమో గాని మా అమ్మ మాత్రం బాగానే మీ నుండి హిందీ నేర్చేసుకుంటుంది," అన్నాడు రామకృష్ణ.

"మీ మామయ్య గారు మనతో వస్తారా?"

"రాలేరండి– అతనికెప్పుడూ కోర్టు కేసులే. సాయంత్రాలు మనతో గడుపుతారులెండి."

"మనలో మాట– మీ మేనమామ ఏమైన డ్రింకు పుచ్చుకుంటారా?" అని మెల్లగ అడిగేడు సత్యజిత్‌సిన్హా.

రామకృష్ణ నవ్వేసి- "మా మామయ్య ఏం చేసిన కాస్త సీక్రెట్‌గా చేస్తుంటాడు. అందుకే అంత సక్సెస్‌ఫుల్ ఏడ్వకేటయేడు. వయస్సులో ఉన్నప్పుడు మా అత్తయ్య మా మామయ్యకు భయపడేదట– ఇప్పుడు రివర్సు. మా మామయ్య ఇప్పుడు మా అత్తయ్యంటే జంకుతాడు. అప్పటికి అప్పుడప్పుడు ఏవో పార్టీలని క్లబ్బుల్లో కాస్త విస్కీ సేవించి వస్తుంటాడు. సిన్హాజీ నేనొకనాడు మేడ మీద మీ ఇద్దరికి పార్టీ ఏర్పాటు చేస్తాను. మా అత్తయ్య, మా అమ్మ కాస్త సనాతనులే అయినా అప్పుడప్పుడు పార్టీలలో మందు సేవించి వస్తే అంత గొడవేం చెయ్యరు," అని చెప్పేడు.

"కృష్ణాజీ! మా ఆయన నాకు చిన్నప్పుడు భయపడలేదు, ఇప్పుడు నేనంటే జంకులేదు. మీ అత్తయ్యలా నేను కంట్రోలు చెయ్యలేక పోయేను," అని నవ్వుతునే భర్త మీద చాడీలు చెప్పింది

## సంక్రాంతి

సంక్రాంతి వచ్చింది
సంతోషం తెచ్చింది!
వీదుల్లో గంగిరెద్దు
ముంగిట్లో రంగుల ముగ్గులు
వాకిట్లో గొబ్బెమ్మలు...
సంక్రాంతి వచ్చింది.
సంతోషం తెచ్చింది!
రచ్చల్లో కోడి పందాలు
కన్నెల్లో సంబరాల జోరు
వాకిట్లో హరిదాసు హెూరు
సంక్రాంతి వచ్చింది
సంతోషం తెచ్చింది!
కన్నెల కలకలలు
చిలుకల గుసగుసలు



పక్షుల కిలకిలలు...
సంక్రాంతి వచ్చింది
సంతోషం తెచ్చింది!
వీధిలో భోగిమంట
గాదెలో కొత్తపంట
పలికింది గుడిగంట...
సంక్రాంతి వచ్చింది
సంతోషం తెచ్చింది!
హరిదాసుని పాట పిలుపు
కొత్త జంటకు మేలుకొలుపు
ప్రజల హృదిలో సరాగాలుపలుకు
సంక్రాంతి వచ్చింది
సంతోషం తెచ్చింది!

–పచ్చిగోళ్ళ సుధ

"రమా! నువ్వు ప్రయత్నించలేదు సరికదా నన్ను నీ సహకారంతో మరింత పాడు చేసేవు." అని సిన్హా అనేసరికి ఆమె కాస్త రెచ్చిపోయి–

"మీరు మరి మాట్లాడకండి– ఎవరు ఎవర్ని పాడు చేసేరో అందరికి తెల్సు. ఇంకా నన్ను చెప్పమంటారా కృష్ణాజీకి," అనేసరికి భర్త సిన్హా నిజంగ జంకిపోయి– "నీకేం కావాలంటే అది కొనిస్తా గాని నా త్రాగుడు కథల్ని మరి చెప్పకు" అని బ్రతిమాలేసరికి అందరు నవ్వుకున్నారు.

ఆ నాటి ప్రోగ్రాం ప్రకారం భోజనాల్ని రెండు కారియర్లలో సర్దుకొని సముద్రతీరం మీదుగ భీమిలికి బయలుదేరేరు అంబాసిడర్ కారుని తీసుకుని.

కారు వెనుక సీటులో సిన్హా, అతని భార్య, నీల కూర్చుంటే ముందు సీట్లో రామకృష్ణ దేవేంద్ర కూర్చున్నారు. రామకృష్ణ ఆ కారుని డ్రైవ్ చేసేడు. వెనుక ఎత్తైన కొండలు, దిగువన చక్కని సముద్ర తీరం చూస్తు అందరు చాల సంతోషించేరు. అలా కొంత దూరం పోయేక జీడిమామిడి తోటలు వచ్చేక ఆగి వారంతా అమెరికాలోని గ్రాండ్ కానియన్స్ లాంటివి చిన్న నమూనాలో నున్న సన్నటి లోయల్లోంచి కాస్త దూరం వెళ్ళి అక్కడున్న

## ప్రణయవల్లరి

జీడిమామిడి తోటలో జంబు కాన పర్చుకుని అందరు కూర్చున్నారు.

పిక్నిక్ వాతావరణంలో ఆ కారియర్లను తీసి భోజనం చేసి అక్కడ కాస్సేపు విహరించి మళ్ళీ కారు వద్దకు వచ్చి భీమిలి వైపుకి బయలుదేరేరు. భీమిలీ చేరేక ఆ శిథిలమైన పెద్ద పెద్ద భవనాల్ని చూచి సత్యజిత్‌సిన్హా చాల ఆశ్చర్యపోయేడు. అట్లాంటి ఓ భవనాన్ని కొని, ఆ నమూనాలోనే ఆ భవనాన్ని పునర్నిర్మించి అందులో నివసించి రోజు సముద్ర స్నానం చేస్తు ఆ చక్కని సముద్రతీరంలో గడపుతే జీవితం ఎంత మధురంగ ఉంటుందో అని ఊహాగానం చేసేడు.

విశాఖపట్నం నుండి భీమిలి వరకున్న ఆ బీచి రోడ్డు, సరుగుడు చెట్ల తోటలు, ఆ జీడిమామిడి తోటలు, ఆ విశాలమైన సముద్రతీరం, ఆ ఉత్తుంగ తరంగాలు, కాస్త దూరంలో నిశ్చలంగ నిల్చిన ఆ కొండలు వారందర్ని ఎంతో ఆహ్లాదపరిచేయి. అలా అలా తిరిగి రాత్రి ఎనిమిది గంటలకు ఇంటికి చేరేరు.

## 24

ఆ మరునాడు ప్రొద్దున్న ఫలహారమైయేక అందరు కారులో విజయనగరంకు బయలుదేరేరు. విజయనగరంలో మహారాజా వారి కోటను దర్శించేరు.

"ఈ కోటను ఒకటవ ఆనందగజపతి రాజుగారు 1713వ సంవత్సరంలో పునాదులను వేయించి నిర్మింప జేసేరు. ఈ కోట గోడల్ని ఎంత కట్టుదిట్టంగ నిర్మించేరంటే ఆ నాడు ఫ్రెంచి సైన్యం దాడి చేయడానికి సాహసించ లేకపోయి మహారాజుతో చేతులు కలిపి స్నేహం చేసేరు. ఈ విజయనగరం రాజులందరు దానశీలురు, కళాప్రియులు. సాహిత్య, సంగీత, నృత్య విద్యలలో వారికి ఎనలేని ఆసక్తి, అభిమానం. సంస్కృత, ఆంధ్ర భాషలంటే వారికి అమితమైన గౌరవం. ఈ విద్యలన్నిటిని వారు ఎంతో ఆదరణ చూపి ప్రోత్సహించేరు. ఈ పట్నంలో మహారాజులు 1857వ సంవత్సరంలో మిడిల్ స్కూలును తెరిచేరు. 1860వ సంవత్సరంలో సంస్కృత వేదపాఠశాలను స్థాపించేరు. 1919వ సంవత్సరంలో సంగీత కళాశాలను నెలకొల్పేరు.' అని రామకృష్ణ వారికి అన్ని సంస్థలను చూపెట్టేడు.

తరువాత అందరు అంట్యాకుల పైడిరాజుగారి గృహానికి వెళ్ళేరు. అక్కడ రామకృష్ణ వారి సందర్శి ఆ మహాకళాకారుడికి పరిచయం చేసేడు. పైడిరాజుగారు చిత్రించిన పటాలను వారు సందర్శించి సంతోషించేరు. ఆ చిత్రకారుని కళాభిజ్ఞతను వారు

### కలం స్నేహం

కథ, బొమ్మలు: జి.వి.ఎస్. రావు.

అనగనగా ఓ వెంకటేశం. అతగాడికి అమ్మాయిలతో కలం స్నేహం చెయ్యాలని తెగ కోరిక. ఇలా ఉండగా–

ఒక రోజున ఒక పత్రికలో సీత అనే అమ్మాయి ఎడ్రస్ సేకరించి–



ఆ అమ్మాయి కూడా జవాబు రాసింది వారి కలం స్నేహం కొన-సాగుతుండగా ఒక రోజున "ఒకసారి మా ఇంటికి రండి. ఫలానా ట్రైన్‌లో రావాలి" అంటూ రాసింది సీత.



వెంకటేశం ఎగిరి గంతేసాడు పాపం పై కప్పు దూలం తగిలి తల బొప్పి కట్టింది!

మర్నాడే రైలెక్కాడు.



కొనియాడేరు.

గంట స్థంభాన్ని చూసేక ఓ హోటల్లో భోజనం చేసి తాటిపూడి రిజర్వాయరును చూడడానికి బయలుదేరేరు. త్రోవలో నీల అంది.

"విజయనగరం అన్ని విద్యలకు, కళలకు పుట్టిల్లు, మహారాజుల పోషణలో అభివృద్ధి చెందింది గాని టౌను అంత దర్జీగా ఉందేమి. పగలే అన్ని దోమలు విజృంభించి కరుస్తున్నాయే–ఎవ్వరూ పట్టించుకోరా? ఆ సన్నటి గతుకుల రోడ్లు, ఆ కంపు కొట్టే చెరువులు, ఆ పాత పెంకుటిండ్లు అందము చందము లేని ఆ దుకాణాలు–నిజంగ ఆ ఊరు చాల బీదగ, ధూళిగ ఉంది. మున్సిపాలిటీ శ్రద్ధ తీసుకోరా? అంతటి చారిత్రక ప్రాముఖ్యత ఉన్న నగరాన్ని అలా గాలికి వదిలేయడం ఏమి బాగోలేదు," అని తన అభిప్రాయాన్ని నిష్కర్షగ చెప్పేసింది.

"విజయనగరం జిల్లా కేంద్రమయితే తప్పక అభివృద్ధి చెందుతుందని నా ఆశ," అన్నాడు రామకృష్ణ.

వారందరికి తాటిపూడి జలాశయం యెంతో నచ్చింది. ఆ రమణీయ ప్రదేశం వారికి ఆహ్లాదంగ తోచింది. అలా బ్రిడ్జి మీద నడుచుకుంటు మధ్యకు వెళ్ళి నాలుగు ప్రక్కలకు చూచి ఆనందించేరు అలా గట్టమ్మట నడుచుకుంటు డామ్ వరకు వెళ్ళి చూచేరు.

## కోరిక!

మూఢాచారపు
మతోన్మాద పోరాటంలో
కులం ఒక అడ్డు గోడ!
మతం ఒక మర్రి నీడ!
రెండూ తాత్కాలిక భ్రమలు!

మనిషి కోరేది
మానవత్వం ఐతే;
మానవత కోరేది
సమైక్యతా భావం.
విశ్వశాంతి రాగం!

-ఎల్. ప్రఫుల్లచంద్ర

అలా తిరుగుతున్నప్పుడు నీల వెనకబడి, రామకృష్ణ ప్రక్కన నడుస్తు "కృష్ణాజీ! మీరు నేను పడవలో అలా రిజర్వాయరులో విహారం చేస్తే ఎంత బాగుంటుందో," అంది.

"ఎందుకు బాగుండదు–బాగుంటుంది. కాని ఇక్కడ డాల్ సరస్సులో లా పడవలు లేవుగ."

"అదేనా చింత. కృష్ణాజీ! మనం ఇన్ని సార్లు కలుస్తున్నాం, కలసి తిరుగుతున్నాం కదా మరి మీకు నా మీద ప్రేమ పుట్టడంలేదా?" అని అడిగింది.

"నా గుండె గది ఖాళీగా ఉంటే ఏమో అనుకోవచ్చు గాని అది నవనీత అనే అమ్మాయి నువ్వు రాకముందే ఆక్రమించుకుంది. అందుకే నో వేకన్సి ఇన్‌మై హార్ట్" అని నవ్వేసేడు

నీల గాఢంగ నిట్టూర్చింది.

"చూడు నీల నీ నిట్టూర్పు గాలికి ఎలా ఈ సరస్సులో అలలు పుట్టాయో," అని చిలిపిగ అన్నాడు.

"అవును మీకంతా జోకుగ తోస్తుంది గాని నా బాధ మీకర్థమవటం లేదు."

"ఎందు కర్థమవదు బాగానే తెలుస్తోంది. అందుకే మీ నాన్నగార్కి చెప్తాను నీకు త్వరగా చక్కని వరుడ్ని చూసి పెండ్లి చేసేయమని."

ఇంతలో వీరు మిగతా వారిని కలియడంతో ఆ సంభాషణ అక్కడితో ఆగిపోయింది. అక్కడ సాయంత్రం వరకు గడిపి అందరు బయలుదేరి విశాఖపట్నంకు వచ్చేసేరు కొత్తవలస మీదుగ.

ఆ రాత్రి భోజనాలయేక అందరు కూర్చుని మాట్లాడుకుంటుంటే ఏదో పుస్తకం రిఫరెన్సుకు కావల్సివచ్చి తేవడానికి రామకృష్ణ మేడమీదకు వెళ్తే నీల కూడ బట్టలు మార్చుకుందికని మేడపైకి వెళ్ళింది. మేడమీద రామకృష్ణ యథాలాపంగ నీలను అడిగేడు.

"నువ్వు బి. ఎ. పాసయేవుకదా. మరేమైన పోస్టు గ్రాడ్యుయేటు కోర్సు చదవుతావా?"

"నాకు మరి చదవాలనిలేదు. వయస్సు



వచ్చిందికదా హాయిగ నీలాంటి చక్కని వాణ్ని చేసుకుని పిల్లల్ని కనాలనుంది" అని సన్నగ నవ్వుతు అంది

"నీల! నువ్వు వట్టి సిగ్గులేనిదానివి నిన్ను అడగడం నాదే తప్పు" అన్నాడు

"నాకు కావల్సినవాడివి - నీ దగ్గర నా కెందుకు సిగ్గు"

"నాకు నా మనస్సులో భావం చెప్పిన నువ్వా మాటను వదలడంలేదే!"

"నేను రాబర్ట్ బ్రూస్ లాంటిదాన్ని ట్రై అండ్ ట్రై అంటిల్ యు సక్సీడ్ అన్నది నా మతం"

"అయితే నేను చాల జాగ్రత్తగ ఉండాలి"

"సరే నీ జాగ్రత్త నీది - నా ఆశ నాది" అని నవ్వేసి తన గదిలోకి పోయింది

రామకృష్ణకు ఎందుకో కాస్త బెదురు కల్గింది నీలను కాస్త దూరంగ నుంచడం యెందుకైనా మంచిదను కొన్నాడు

ఆ మరునాడు అందరు ప్రొద్దున్నే

# ప్రణయవల్లరి

బయలుదేరి సింహాచలంకు వెళ్ళేరు కొండ దిగువనుంచి ఆలయం వరకున్న మెట్లు వరుసని చూసి

"మెట్లెక్కి వెళ్ళడంలో ఓ థ్రిల్ ఉంది పదండి మెట్లెక్కి వెళ్దా"మన్నాడు దేవేంద్రుడు

"అన్ని వందల మెట్లను ఎక్కడం ఈ వయస్సులో నా తరం కాదు మీ అమ్మ హార్ట్ సంగతి మీకు తెల్సుగ ఆమెను ఎలాగు ఎక్కనివ్వను అందుచేత మేమిద్దరం కారులో కొండపైకి పోతాం మీరు ముగ్గురు కష్టపడి సరదాగా మెట్లెక్కి రండి' అని నవ్వుతు చెప్పి తను ఆ కారును డ్రైవ్ చేసుకుంటు పోయేడు డాక్టర్ సత్యజిత్ సిన్హా

రామకృష్ణ, నీల, దేవేంద్రుడు సరదాగా కబుర్లు చెప్పుకుంటు ఆ మెట్లమీదుగ పోయేరు

కొండపైన ఆలయంలో దేవుని పూజలు జరుగుతున్నపుడు రామకృష్ణ ఎడమ చేతిని తన కుడి చేత్తో పట్టుకుంది. ఎవరైనా చూస్తే చూడని అన్న సాహసంతో రామకృష్ణ చేతిని మెల్లగా తీసుకొనటోయేడు గాని నీల వదలలేదు. ఆ విషయాన్ని మొదట చూసిన నీల తల్లి రమాదేవి భర్తకు చిక్కి చూపెట్టింది కండ్లతో సంజ్ఞచేసి సత్యజిత్ సిన్హా చూసి చిరునవ్వుతో ఊరుకున్నాడు దేవేంద్రుడు చూసేడో లేదో కాని అతను సాధారణంగ చెల్లెలి విషయంలో ఏమి పట్టించుకోడు

సత్యజిత్ సిన్హా ఇంటి వాతావరణమే అంత ఎవరి స్వేచ్ఛ వాళ్ళది ఒకరి అదుపాజ్ఞలలో ఒకరుండరు అలాగని తిరుగుబాటుదార్లు కారు వాళ్ళంత ప్రేమతో పెరిగినవాళ్ళే వారంతా ఒకే కుటుంబ సభ్యులని మరచిపోలేదు ఆ అనురాగబంధముంది కాని పిల్లలంతా స్వేచ్ఛాప్రియులు ఆ విషయంలో వారికేమి నిబంధనలు, కట్టుడులు లేవు

ఒకవేళ నీల, రామకృష్ణ ప్రేమించుకుంటే ఆ ప్రేమకు ఏవిధమైన అభ్యంతరం ఆ ఇంట్లో ఎవ్వరు చెప్పరు ముఖ్యంగ ఆఖరు పిల్ల నీలంటే ఆ తండ్రికి ఎంతో అనురాగం ఆమె ఆనందాన్ని దేన్ని కాదనడు ఆ తండ్రి ఆ తల్లి మాత్రం అప్పుడప్పుడు కూతుర్ని తన పరిధిలో ఉంచడానికి ప్రయత్నిస్తుంది

రామకృష్ణకు ఇబ్బందిగనున్న ఆ పరిస్థితులో అందరి మధ్యన ఏమి అనలేక ఊరుకున్నాడు ఆ పూజారి వారిరువురు నవ దంపతులనుకొని రామకృష్ణ గోత్రం, సిన్హా గోత్రం అడిగి ఆ విధంగా పూజలు జరిపించేడు ఆ విధంగానే దీవించేడు

ఆ ప్రదేశమంత తరువాత తిరిగి, ఆ కొండపైనున్న సంపంగి పూలనుచూచి రమాదేవి, నీల చాల ముచ్చటపడగ ఆ చెట్లవద్దనున్న ఆ సామికి అయిదు రూపాయలిచ్చి ఓ వంద పువ్వుల్ని కోయించి వారికిచ్చేరు కాస్సేపయేక అందరు కారులో ఇంటికి తిరుగు ప్రయాణ మయ్యారు

(ఇంకా ఉంది)

## సెక్స్ బాంబ్

సెక్స్ బాంబ్‌గా అందరూ అనుకుంటున్న సోనువాలియా 'అన్ని' వ్యవహారాల్లోను బాగా ఎదిగిపోయింది శ్రీదేవి, మీనాక్షి శేషాద్రి వంటి తారలు ఎక్కడైనా షూటింగ్‌లకు వెళ్ళేప్పుడు తల్లుల్ని వెంట తెచ్చుకుంటారు కాని సోను మాత్రం మామయ్యను వెంట పెట్టుకొని వెళ్తోంది వెళ్లటమేకాదు నానా 'పాట్లు' (?) పడుతోంది 'సైబాన్' చిత్రం షూటింగ్ యూనిట్ వీళ్ళ వ్యవహారం చూసి అవాక్కయి పోయారట వాళ్ళు మాత్రం నిరాటంకంగా, నిర్విరామంగా 'ప్రేమ యాత్రలకు బృందావన' మని తేలిపోతున్నారట మరి సెక్స్‌బాంబ్ బిరుదు సార్థకం చేసుకోవద్దు మ్! !



# యువతా! కవితా!!

## మానవత్వం

మనిషిలో మంచి
ఉప్పొంగితే
మానవత్వం
వికసిస్తుంది...
ఇది ప్రకృతి!
మనిషిలో మృగం
ప్రజ్వరిల్లితే
మానవత్వమే
నశిస్తుంది...
ఇది వికృతి!!

- పి. యస్. కృష్ణమూర్తి

## మతం

మతం- నిద్రిస్తున్న త్రాచుపాము
మతం- అడవి గర్భంలో దాచుకొన్న నిప్పు!
మతం-
విషవాయు విహారంలో కలరా!
మతం-
సుఖ పరిష్వంగంలో నున్న ఎయిడ్స్!
మతం-
రక్తం రుచి మరిగిన జలగ!
మతం-
చప్పుడు లేకుండా వచ్చే 'గజ్జి'!
మతం మత్తు మందుకు
ఇవి నానార్థాలు-
వదలకుంటే తప్పవు
మనకు అనర్థాలు!

- బి. నాగభూషణం

## పుణ్యాత్ములు!

గుళ్లో దైవానికి మొక్కి
గుప్పిళ్లతో ఇస్తారు
దక్షిణలు!
గుడి బైట ముష్టిదానికి
పైసా రాల్చటానికి చూస్తారు
ఉత్తర దక్షిణాలు!!

- వై. రాజేష్



## కాటుక

నీ అందమైన చక్షువులకు
మరింత అందాన్ని చేర్చానని
అనుకుంటుంటే
పొంగిపోయా!
కాని
కర్కష పాదాల క్రింద
నలిగి నీవు విడిచే
కన్నీరులో కలిసి
జారి పోవలసి వచ్చి
కృంగిపోయా!

- భరత్‌కుమార్, బి.

## భావవీణ

తీయని కోరికల వైపు
మనసు మొగ్గినప్పుడు
ఆశయాల ఊసులు
మొగ్గ తొడుగుతున్నప్పుడు
పరాకుని చేయకుమని
స్పందనా సమిధలు
పోటు పొడవగ
హృదయ వికాసంతో
భావవీణ మ్రోగుతుంది
మమతా సమతా
సోయగాలను మీటుతుంది!

- జి. శ్రీశైలం

## నేటి భారతం

వెన్ను పోటు
రాజకీయంలో!
పన్ను పోటు
బడ్జెట్లో!
కత్తి వేటు
దౌర్జన్యపు గూట్లో!
కన్ను గీటు
కుట్రల కుంపట్లో!
ఆటు పోటు
సగటు జీవి ఇంట్లో!
అవినీతి పాటు
అక్రమాల వాకిట్లో!
అన్ని పాట్లు
బిగించిన పొట్లంలో!
వస్తువు పక్కన
రేట్లు తూట్లు
పేద జీవి ముంగిట్లో!

- చివుకుల వాసుదేవమూర్తి

## అతి

'స్వేచ్ఛ వుండాలి
అతి స్వేచ్ఛ
అరాచకాలకు మూలం!
తెలివి వుండాలి
అతి తెలివి
అనర్థాలకు మూలం!
సంతానం వుండాలి
అతి సంతానం
కష్టనష్టాలకు మూలం!
ప్రజాస్వామ్య దేశంలో
'అతి'ని అందలం ఎక్కిస్తే
అక్రమాలకు అన్యాయాలకు
దోపిడీ దౌర్జన్యాలకు
అదుపు లేనట్టే...
ప్రమాదం
కొని తెచ్చుకొన్నట్టే!
అందుకే
'అతి సర్వత్ర వర్జయేత్!'

- చివుకుల వాసుదేవమూర్తి

# "రాజకీయాలమీద పూర్తి దృష్టి సారించవలసిన స్థితి"

(గత సంచిక తరువాయి)

## "నాకూ ఆశ రేకెత్తుతూ వుంటుంది...

"నాకు చాలామంది స్వయంగా తెలియజేస్తున్నారు. మీరు 'చిత్రరంగం నుండి, రాజకీయ రంగానికి మారిన తర్వాత మేము చిత్రాలు చూడ్డం మానేశామని చెప్పారు. నామీద ఎంతో అభిమానంగల కళాపోషకులు-' ధన్య జీవులు- నా ఆత్మీయులు వున్నారు. నాకూ ఆశ రేకెత్తుతూ వుంటుంది- గాని... ఇప్పుడున్న పరిస్థితులు .. నేను రాజ 'కీయాలమీద దృష్టిని సారించినంత వరకూ- పూర్తి న్యాయం చేకూర్చలేనేమో నని నా భావన.. " అన్నారు శ్రీ రామారావు.

## రొమాంటిక్ హీరో

శ్రీ ఎన్టీఆర్- ఆటల్లో- ఓ 'సర్కస్ రాముడు'- పాటల్లో- 'శృంగార రాముడు' . 'చేష్టల్లో- 'ఛాలెంజ్ రాముడు .' ఎటునుండి- ఎటు చూసినా ఆయన 'సెభాష్ రాముడే'...!

'ఆరేసుకోబోయి పారేసుకున్నాను' అని- కవ్వించినా,

'ఓలమ్మితిక్క రేగిందా'- అని ఊరించినా,

'లేచింది మహిళా లోకం'- అని ప్రబోదించినా,

'చేతికి చిక్కావే పిట్ట'- అని ఉలికించినా,

'అలిగితివా సఖీ'- అని ఊరడించినా,

'పగల రాణివి నీవే- సొగసు కాడను నేనే'- అని ఏడిపించినా,

'మంటలు రేపే నెలరాజా - ఈ తుంటరి తనమూ నీకేల?' అని వేదన చెందినా,

"తెలుగు జాతి మనది నిండుగ వెలుగు జాతి మనది..."

-అని పాడిన పాటనే,

-నడిచిన బాటగా ఎంచుకున్న తెలుగు తల్లి ముద్దు బిడ్డ -శ్రీ ఎన్టీఆర్

# ఎన్. టి. ఆర్.



యువరత్న బాలకృష్ణ, వసుంధర దంపతుల తొలి బిడ్డ ముద్దుల మనవరాలు చిరంజీవి 'బ్రహ్మణి'తో.

## కరువు నివారణకు నడుం కట్టిన 'కథా నాయకుడు'

1952వ సంవత్సరంలో దారుణ క్షామానికి గురయింది- రాయలసీమ అక్కడి ప్రజలు అన్నార్తులై అలమటించిపోతుంటే,

'శ్రీ రామారావు నడుం కట్టి ముందుకొచ్చారు. సినీరంగంలోని కొంతమంది నటీ నటుల్ని కలుపుకున్నారు కోస్తా జిల్లాల్లో విస్తృత పర్యటన జరిపారు. నాటకాలు వేశారు. ఆపదలో వున్న అభాగ్యుల కోసం జోలెత్తారు. రు. 1,50,000 వసూలుచేసి పంపించారు కరువు నివారణకు నడుం కట్టిన మొట్టమొదటి కథా నాయకునిగా చరిత్ర కెక్కారు అందుకే- ఆయన ఓ 'దీన జనోద్ధారకుడు'

'నటరత్న'తో ఆంధ్రపత్రిక సినీస్పెషల్ రిపోర్టర్ శ్రీ భీశెట్టి జరిపిన ప్రత్యేక ఇంటర్వ్యూ

### జాతీయ రక్షణ నిధి

1965వ సంవత్సరంలో - పాకిస్తాన్ యుద్ధ సమయంలో- జాతీయ రక్షణ నిధికి- ఆపద్బాంధవుడు శ్రీ రామారావు మళ్లీ దేశం కోసం ముందుకొచ్చారు. రాత్రింబవళ్లూ శ్రమించి పది లక్షలు వసూలు చేశారు దానిని ఆనాటి ప్రధాని శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రికి అందజేశారు. అందుకే- ఆయన ఓ 'త్యాగధనుడు .'

### తుఫాను నిధి

1977వ సంవత్సరంలో కనీవినీ ఎరుగని భయంకర ఉప్పెన కోస్తా జిల్లాల్ని కకావికలం చేసింది వేలాది మందిని పొట్టన బెట్టుకుంది. అంతకు పదిరెట్ల మందిని, నిర్వాసితుల్ని చేసింది ఆ భయంకర- దారుణ- విపత్కర సమయంలో చలించిపోయాడా వరాల దేవుడు పదిహేను లక్షల రూపాయలు వసూలు చేసి 'ఆంధ్ర తుఫాను సహాయ నిధికి' అందజేశారు. అందుకే ఆయన- ఓ 'కారుణ్యమూర్తి.'

### శ్రీకృష్ణ పాత్ర

శ్రీకృష్ణ పాత్ర అంటే- శ్రీ రామారావుకి ఎంతో ఇష్టం

ఆయన నటించిన 42 పౌరాణిక చిత్రాల్లో 17 చిత్రాల్లో ఆయన 'శ్రీకృష్ణ' పాత్రధారణ చేశారు. అందుకే ప్రపంచ

ప్రజల మన్ననలూ- ఆరాదనలూ పొందిన ఆయన 'రూపం దేవుని రూపానికి ప్రతి' రూపంగా నిలిచిపోయింది


'గుండమ్మకథ'లో సావిత్రితో

## చారిత్రక పాత్రలు

శ్రీ ఎన్ టి ఆర్ బ్రహ్మనాయుడు- చంద్రగుప్తుడు- మొగల్ సామ్రాజ్యాధి నేత అక్బర్- ఆంధ్ర భోజుడు శ్రీ కృష్ణదేవ రాయలు- దుష్యంత మహారాజ సత్యహరిశ్చంద్రుడు- సాహస భట్టి విక్రమార్కుడు- వాల్మీకిలాంటి అరుదైన అపురూప పాత్రలు దరించడం వల్లనే. ఆయా పాత్రలలో ప్రాణవమొచ్చింది. ప్రాణ ప్రతిష్ఠ జరిగింది

## జానపద పాత్రలు

అందానికి- రీవికి- రాజసానికి- అసలు సిసలైన రాకుమారుని రూప లావణ్యాలకు పెట్టింది పేరు- శ్రీ రామారావు

తెరమీద ఆయన కత్తి ఝుళిపిస్తే

ఓ- 'జయసింహ మెరుస్తాడు

ఓ- తోట రాముడు కళ్ళముందు నిలుస్తాడు.



ఓ-'రేచుక్క తళుక్కుమంటాడు

ఓ-'జగదేక వీరుని కద'- తెర కావ్యంలా నిలుస్తుంది

అలాగే శ్రీ రామారావు నట పట్టాభిషేకానికి- 'మర్మీశ్వరి'- 'చిరంజీవులు - 'రక్త సంబంధం'- గుడి గంటలు చిత్రాలు తరతరాల తీపి గుర్తులుగా చలన చిత్ర చరిత్రలో నిలిచిపోతాయి -

మీరు నటించిన లవకుశ మాయా బజార్ పాండవ వన వాసం శ్రీకృష్ణ పాండవీయం లాంటి కళా ఖండాలను చూసిన కోట్లాదిమంది ప్రేక్షకులు- ఇటీవల టి వి లో ప్రసారమైన రామాయణం' 'మహా భారత్ ల కంటే ఘనంగా నేషనల్ నెట్‌వర్క్ ప్రోగ్రామ్‌లో మీ నుండి ఒక మహత్తర కళా వైభవాన్ని కళ్లారా చూడాలని ఉవ్విళ్ళూరుతున్నారు ఆ ఆశ నెరవేరే అవకాశ ముందంటారా?

## సుముఖుడనుకాను'

"నాకు విరామం లేదు జీవితానికి విశ్రాంతి అన్నది ఇంతవరకూ లభించ లేదు 'విశ్వామిత్ర" చిత్ర నిర్మాణమే నా ఏకాగ్రతను పంచుకోవడం జరిగింది ఇంకా టీ వీ సీరియల్స్ బెడదగా- నా భుజస్కంధాల మీదుగా పెట్టుకోవడం నా కిష్టం లేదు ఇన్ని





'నటరత్న - యువరత్న



దృక్పథాలు పెట్టుకున్న వ్యక్తి - అన్నింటికీ సరైన న్యాయం చేకూర్చ లేదని నా అభిప్రాయం ప్రత్యేకతలేని ఏ పనీ చేయడానికి నేను సుముఖుడను కాను ' అని చెప్పారు శ్రీ రామారావు

అప్పటికి సమయం అయిదున్నర దాటింది

అదే సమయంలో -

'యువరత్న నందమూరి బాలకృష్ణ షూటింగ్ ముగించుకొని వచ్చారు

నల్లని ప్యాంటుమీద తెల్లని ఫుల్ హ్యాండ్ షర్టు వేసుకొని- 'హీరో'లా వచ్చారు

యువ కిశోరంలా వచ్చారు

ఒ రాకుమారునిలా కన్పించారు

'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' కోసం ఇంటర్వ్యూ చేస్తున్నారు మంచి కథకుడు అంటూ బాలకృష్ణకు విశ్వ విఖ్యాత సార్వభౌముడు 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' స్పెషల్ రిపోర్టర్ గురించి ప్రశంసా పరిచయం చేశారు

అభినందించారు శ్రీ బాలకృష్ణ

ఆ తర్వాత-

ఎదురుగ్గా హాలుకు మధ్య భాగంలో టేబిల్ మీదున్న బుద్ధుని విగ్రహం కన్పించింది

ఇంటర్వ్యూ కొనసాగిస్తూ "సార్! బుద్ధుని విగ్రహం- హాలుకు మధ్యగా పెట్టివుంది అది మీకు అభిముఖంగా వుంది సిద్ధార్థుడంటే మీకంత యిష్టమా? మీ అభిప్రాయం?" ప్రశ్నించాను

ఒక్కసారి శ్రీ రామారావుగారు బుద్ధుని వేపు దృష్టిని సారించారు చెప్పడం మొదలు పెట్టారు

బుద్ధుని గురించి ఆయన చెప్పిన దేమిటి?

(ఇంకా వుంది)

# భయం నీడలో జరిగిన అద్భుతమైన టెస్ట్ పోటీ!

'ప్రపంచ క్రికెట్ 'టెస్ట్' కేంద్రాలలో క్రొత్తగా 'చండీఘడ్' యిటీవల చేరింది. దీనికి కారణం హర్యానావాసి, నేటి మేటి ఆటగాడు 'హరికేన్' (తుఫాన్)గా ఖ్యాతి పొందిన కపిల్ దేవ్ కృషి యున్నది. మొట్టమొదటి చండీఘడ్ టెస్టులో మన దేశం శ్రీలంకపై గెల్చింది. ఎంతో ఉద్రేకము, అలజడిగాయున్న పంజాబ్, హర్యానాలలో 'టెస్టు' పోటీ నిర్వహించుట కష్టతరము అయిన పని. క్రికెట్ అభిమానుల, అధికారుల కృషి వలన ఎటువంటి దుర్ఘటన జరగకుండా, ముందు ఆలోచనతో నిర్వాహకులు తీసుకొన్న సెక్యూరిటీ ఏర్పాట్లవలన టెస్టు పోటీ దిగ్విజయముగా ముగిసింది. టెస్టు ఆటగాళ్ళు, నిర్వాహకులు, మీడియావారు, పోలీసులు- టెస్టు పోటీ ఎటువంటి అవాంఛనీయ సంఘటన

## శ్రీలంకమీద భారత్ గెలుపు: ఒక సమీక్ష

లేకుండా ముగిసినందుకు హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.


కపిల్ దేవ్ పిచ్ పరిచేస్తున్న చిత్రం


చండీఘడ్ స్టేడియంలో భద్రతా సిబ్బంది

చండీఘడ్ మన దేశంలో ఆధునిక నగరం. పంజాబ్, హర్యానాలు విడిపోయినప్పుడు ఉమ్మడి రాజధానిగా రూపొందించబడిన నగరం. ప్రపంచ అగ్రగామి నగర నిర్మాత, లీ కార్బిజర్ తయారుచేసిన ప్లానుల ప్రకారం 'సెక్టర్స్'గా యీ నగరం విభజించబడినది. ప్రస్తుతం నెలకొల్పబడియున్న పరిస్థితులలో యీ నగరవాసులు జీవనాధారం సంపాదించుకొనుటకు, కుటుంబ పోషణకు కావలసిన వస్తువుల కొనుగోలుకు మాత్రం వీధిలోనికి వస్తారు. ఇతర సమయాలలో యింటిలోనే వుంటారు. ఇటువంటి సమయంలో టెస్టుపోటీ తిలకించుటకు యిల్లు వదలి ప్రజలు రాకపోవుటవలన టెస్టు పోటీ జరిగిన నాలుగు రోజులలో మూడు రోజులు 'సెక్టర్ 16 స్టేడియం' ఖాళీగా కనిపించింది. కాని టెస్టు జరిగిన నాలుగు రోజులు తుపాకి శబ్దము వినిపించకపోవుట ఆ నగర వాసులకు విచిత్రము అనిపించింది. అందుకే ధైర్యముచేసి తమ అభిమాన ఆటగాళ్లను తిలకించుటకు ప్రజలు ఆఖరి రోజు వచ్చారు. ఇదివరలో యిదే పరిస్థితులలో కరాచీలో జరిగిన టెస్టు పోటీ కాలములో తుపాకుల, బాంబుల మోతకు ప్రేక్షకులే గాక, ఆటగాళ్లు సహితం భయభ్రాంతులు అయ్యారు.

### భారీ భద్రతా ఏర్పాట్లు

కొందరి అభిప్రాయములో కావలసిన దానికన్నా ఎంతో ఎక్కువగా 'సెక్యూరిటీ' ఏర్పాట్లు చేయబడ్డాయి. కొన్ని వేల సంఖ్యలో ఆయుధములు చేతబట్టిన పోలీసు, మిలటరీవారు స్టేడియంలోపల, బయట కనిపించారు.

దీనితో క్రికెట్ అభిమానులు, స్థానిక ప్రజలే గాక టెర్రరిస్టులు సహితం భయపడ్డారు. సెక్యూరిటీ జవానులు టెస్టు ఆటగాళ్ళు, అధికారులు వుండే నిషేధ ప్రాంతములో సహితం ఆక్రమించుకున్నారు. ఇది క్రీడాకారులకు కొంత అసౌకర్యము అనిపించింది.

ఇండియా రెండు ఏళ్లలో ఆడిన 14 టెస్టు పోటీలలో యిదే మన భూభాగంపై మనం సాధించిన మొదటి గెలుపు.

ఇప్పుడు చండిఘడ్ ప్రపంచంలో 53వ టెస్టు కేంద్రం. బొంబాయి, కొలంబో, జోహాన్స్‌బర్గ్‌లలో మూడు స్టేడియంలలోను, బ్రిస్బేన్, డర్బన్, లాహోర్, మద్రాసులలో రెండు స్టేడియంలలో టెస్టు పోటీలు యిప్పటికి జరిగాయి. అనగా 63 టెస్టు స్టేడియంలు అయ్యాయి.

చండీఘడ్ మన దేశంలో 14వ టెస్టు కేంద్రం. అహ్మదాబాద్ (2), బెంగుళూరు (9), బొంబాయి (31), కలకత్తా (26), కటక్ (1), ఢిల్లీ (22), హైదరాబాద్ (3) జైపూర్ (1), జలంధర్ (1), కాన్పూరు (16), లక్నో (1), మద్రాసు (29), నాగపూరు (3), టెస్టులు జరిగిన కేంద్రాలు. ప్రపంచంలో టెస్టు కేంద్రాలలో మన దేశం ప్రథమ స్థానం. పాకిస్తాన్ 9 కేంద్రాలలో ద్వితీయ స్థానం, ఇంగ్లాండు 7 కేంద్రాలలో తృతీయ స్థానం, ఆస్ట్రేలియా 6 కేంద్రాలలో నాల్గవ స్థానం, న్యూజిలాండ్ 5 కేంద్రాలు, వెస్టిండీస్ 5 కేంద్రాలు, దక్షిణ ఆఫ్రికా 4 కేంద్రాలు, శ్రీలంక 2 కేంద్రాలు కలిగియున్నవి.

- ముకరమ్

సీరియల్

# సాగరమథనం

## అడివి సూర్యకుమారి

**ఇంతవరకూ సాగిన కథ-21:** శ్రీలంక ట్రింకోమలిలో నెలకొల్పిన సేవాగ్రాంలో జయసూర్య డాక్టర్‌గా చేరతాడు. సాగర్ ఆచూకీ కోసం పోలీసులు సేవాగ్రాంకి వస్తారు. డచ్చిపోర్టులోని కోటలోకి ప్రవేశించిన సాగర్‌ను సింహళ ఈలం సభ్యులు చుట్టుముడతారు కాని సాగర్ తప్పించుకొని వాళ్ల నుండి సమాచారం రాబడతాడు. ఆ సమాచారం అందించిన వారిని కాల్చి వేయమని స్థితబోధి ఆదేశిస్తాడు. కొంతమంది రౌడీలు శక్తిని, సేవాగ్రాంలోని వారిని ఎత్తుకు వెళ్లినట్లు తీకూ- సాగర్‌కి తెలియజేస్తాడు. శక్తి చాకచక్యంతో మహావీరదూత ఎస్టేట్ అంతా ధ్వంసం చేస్తుంది. ఎస్టేట్‌లోకి ప్రవేశించిన సాగర్‌ని లొంగిపొమ్మంటాడు.

(గత సంచిక తరువాయి)

అసలప్పటికే అతను అగ్నిపర్వతంలా ఉన్నాడు. ఇప్పుడు ఉడుకుతూ వస్తున్న లావాలా పైకొచ్చేశాడు.

ఇంతలో అతని మీదికి జాన్ శామ్యూల్, రసూల్ వచ్చారు ముగ్గుర్ని మూడు నిముషాల్లో మట్టి కరిపించి మహావీరదూత జుట్టు పట్టుకొన్నాడు. ఈడ్చి గోడకేసి కొట్టాడు. అతని నుదురు పగిలింది, రక్తం ధారలు కట్టి నోట్లోకి ఉప్పగా వస్తోంది

'చెప్పు, శక్తి ఎక్కడ?'

మళ్ళీ ఈడ్చి డొక్కలో తన్నాడు. అతని కడుపులో నరాలన్ని ముద్దలా ఒకచోట చేరుకున్నాయి తెగి,

కుప్పలా పడిపోయాడు కింద.

అతన్ని వదిలేసి ఆ హాల్ నుండి ప్రక్కగదిలో కెళ్ళాడు సాగర్

దూరం నుండి పోలీసు వ్యాన్లు, జీపులు వస్తున్న సైరన్లు విన్పించాయి.

ఆ గదిలో లేదు, అవతలి గదిలో రక్తపు ముద్దలా పడివుందామె

'శక్తీ' అతని పెదవులు భయంగా ఉచ్చరించాయి. గబగబ దగ్గరి కెళ్ళి చూశాడు. శ్వాస ఆడుతోంది.

భుజంలో కాళ్ళలో చేతుల్లో బుల్లెట్లు దిగాయి. ఆమెను అలాగే చేతుల మీద వేసుకొని వెనక వైపు నుండి గబగబ కింది కొచ్చాడు.

దిలీప్ అతని కెదు… 'వాళ్ళందరిని పంపేశాం' అన్నాడు.

'ముందు అర్జెంటుగా జీప్ తీసుకురా' అన్నాడు.

'జయసూర్య ఎడి?' అడిగాడు.

వాళ్ళతో వెళ్ళిపోయారు. ఇక్కడ అందరిని పోలీసులు స్వాధీనపరుచుకుంటున్నారు' అన్నాడు పరిగెడుతూ దిలీప్.

పోలీసులు దిగిన జీపులున్నాయక్కడ.

డ్రైవర్ సీటులో కూర్చున్నాడు దిలీప్.

శక్తిని ఒడిలో పడుకోబెట్టుకొని కూర్చున్నాడు సాగర్. జీప్ సంధించిన బాణంలా దూసుకుపోతోంది.

"శక్తీ... శక్తీ" పిలుస్తున్నాడు సాగర్.

జీప్ కుదుపులకి మెల్లిగా కళ్ళు తెరిచిందామె. 'శక్తీ!' అతని చేతులు ఆమెను చుట్టుకొన్నాయి. మొహం ఆమె వైపు వంగింది. 'శక్తీ' మళ్ళీ పిలిచాడు సాగర్ ఆదుర్దాగా.

'మీరు... మీరు అగ్నికదూ' శక్తిని కూడదీసుకొంటూ అస్పష్టంగా అడిగింది.

అతని కళ్ళల్లో మెరుపు.

'ఎలా కనుక్కున్నావ్?'

'ఈ చేతులు... ఈ చేతులు ఆ రోజు అడవిలో... సిలన్ స్ప్రింగ్ వాళ్ళని చంపి నాకు చూపుతూ.... ఈ చేతులు ఈ స్పర్శ. . అదే .. కదూ'

'ఔను. వాళ్ళు నన్ను తెలుసుకొన్నారు. నన్ను చంపేందుకు కారులో బాంబు పెట్టారు లక్కీగా ఏమైందంటే నీకు చీరె కొందామని కారు దిగి షాపులో కెళ్ళాను. ఇక్కడ కారు పేలిపోయింది. నేనే పోయాననుకున్నారు. భట్టాచార్య ప్రత్యేక



మైన మాస్క్ తయారు చేయించారు. కనుపాపలు, కళ్ళు కూడా ఇలా కన్పడేట్లు ప్రత్యేకమైన మేకప్ చేయించుకున్నాను.

"నన్ను. . నన్నెంత బాధ పెట్టారు. నాకు చెప్పకూడదూ"

'సారీ... భట్టాచార్య ఎవరికీ తెలీని యొద్దన్నారు. ఆఖరికి నీక్కూడా. మాటకి కట్టుబడిపోయాను. నిన్ను చాలా బాధ పెట్టాను. నన్ను నేను కంట్రోలు చేసుకోడాని కెంత శక్తి కూడగట్టుకోవాల్సొచ్చిందో...' అంటూ నవ్వేసి 'అక్కడా నువ్వే కావాల్సొచ్చింది' అన్నాడు

శక్తి మాట్లాడలేదు

'శక్తి... శక్తి ' మైగాడ్... దిలీప్ త్వరగా పోనీ' అన్నాడు

శక్తి స్మృతి విహీన అయ్యింది. ఒక గంట తర్వాత ఆమెను జయసూర్య కప్పగించాడు సాగర్. ఆమె శరీరంలో దిగిన బుల్లెట్లు తీసి డ్రెస్సింగ్ చేశాడు జయసూర్య. పిల్లలంతా ఏడుస్తూ నిలబడ్డారు. ఆమెకేం ప్రమాదం లేదని చెప్పేకగాని వాళ్ళు కదలలేదు

మర్నాడు...

ఉదయం ఎనిమిది గంటలవేళ స్థిత బోధికి టెలిఫోన్ వచ్చింది. 'ఫోన్ ఎత్తాడు ఆయన. "నాటోన్ మీకు చిరపరిచితమే. రాత్రి మహావీరదూత ఎస్టేట్స్‌లో జరిగిన మారణకాండని గొప్ప విశేషంగా మీ రనుకుంటుండొచ్చు. కాని అంతకన్న గొప్ప విశేషాన్ని నేను కనుక్కున్నాను. ఇందుకు సంబంధించిన పూర్తి సాక్ష్యాలు నేను సవినయంగా మీ ముందుంచ దలచుకొన్నాను. సరిగ్గా ఈరోజు పదిన్నర గంటలకి విధాన పరిషత్ సెంట్రల్ హాల్‌లో ఒక ఐదారు వందల మంది కూర్చోవడానికి వీలు కల్పించండి. ఇది శ్రీలంక రక్షణకి సంబంధించి మొట్ట మొదటి, చివరిమెట్టు కాగలదు. అక్కడే మీరు నన్ను చూడగలుగుతారు, నేనెవరో తెలుసుకుంటారు. అయితే ఒక్కమాట అక్కడికొచ్చే ఏ ఒక్కరిపైనగాని మీరెలాంటి దౌర్జన్యానికి పాల్పడినా మీరెవరూ మిగలరు' అని పెట్టేశాడు

ఐదు నిముషాలు గట్టిగా ఆలోచించాడు స్థితబోధి వెంటనే స్పెషల్ బ్రాంచి అధికారులతో మాట్లాడి సెంట్రల్ హాల్‌లో పదిన్నర గంటలకి సమావేశానికి ఏర్పాట్లు చేశాడు గట్టి పోలీసు బందోబస్తుకు ఆదేశించాడు. ఛీఫ్ సెక్రటరీకి ఫోన్‌చేసి ఆయన్నాహ్వానిస్తూ ఆయనతో పాటు ఆంతరంగిక శాఖమంత్రి ఆ శాఖ కార్యదర్శిని, సీనియర్ మిలిటరీ అధికారుల్ని రమ్మనమని కోరాడు. అతని కిప్పుడా అజ్ఞాతవ్యక్తిపై నమ్మకం కుదిరింది.

పదిన్నర గంట లవుతోంది.

ఒక్కరు కూడా యూనిఫారమ్‌లో లేకుండా అనేక వందల మంది పోలీసులు విధాన పరిషత్ చుట్టూరా అడుగడుక్కి నిలబడి ఏదో పని చేసుకుంటున్నవారిలా నటిస్తున్నారు.

సరిగ్గాఅదే సమయంలో

కొన్ని బస్సులు, జీపులు ఊరేగింపులా వచ్చి ఆగాయి. మఫ్టీలో వున్నవారు స్థాణువుల్లా నిలబడి చూస్తున్నారు. ముందు జీపులో నుండి దిగిన వ్యక్తిని అనుసరించి





## రచయిత్రి జవాబులు

రజని, ఉమాదేవి– నూజివీడు

ప్ర సాగరమదనం కల్పిత కదా?

జ కాదు సంఘటనలు (సాధ్యమైనంత వరకూ) యదార్థాలు

ప్ర ఈ నవల వ్రాయటానికి మీకు గల ఇన్స్పిరేషన్ ఏమిటి?

జ క్లుప్తంగా చెప్పాలంటే శ్రీలంకలోని దారుణ పరిస్థితుల్ని ఉటంకించే ఒక వీడియో ఫ్లైట్‌షాట్ నేనీ నవల వ్రాయడానికి ఇన్స్పైర్ చేసింది ఇవిగాక- మెక్ డొనాల్డు బ్రెయిన్ క్లాగలీ మొదలగువారు వ్రాసిన వ్యాసాలు– ఈ నవల వ్రాయడానికి బాగా ఇన్స్పైర్ చేశాయి

శ్యామల కె – గన్నవరం ప్రశాంతి- పొన్నూరు

ప్ర మీరు పాఠకులకి ఈ నవల ద్వారా ఏం చెప్ప దలచుకున్నారు?

జ సమైక్యతాభావం, జాతుల సామరస్యం లోపిస్తే దేశం ఎలా నాశన మవుతుందో శ్రీలంకని ఉదాహరణగా చూపించాలనుకున్నాను రెండు– ఈ అరాచక శక్తుల్ని అవకాశంగా తీసుకొని విదేశీ శక్తులు ఎలా ఒక దేశ సమగ్రతకి భంగం కలిగించేది–

మూడు– శ్రీలంకలో భారత్ ఐ పి కె ఎఫ్ ద్వారా జోక్యం కల్గించుకోవటం భారతదేశ రక్షణకెంత అవసరమో వివరించి చెప్పడం

లక్ష్మీ నరసింహాచార్యులు దిట్టకవి,- రావెల కృష్ణారావు– ఎర్రగొండపాలెం

ప్ర వైవిధ్యం గల ఈ సీరియల్‌లోని పాత్ర చిత్రీకరణ మీకు కష్ట మన్పించలేదా?

జ లేదు సీరియల్‌లోని పాత్రలు చాలా వరకు శ్రీలంకలోని సజీవ పాత్రలే ఎక్కడో ఒకటి, అరాతప్ప పోతే ఏ పాత్రలు, ఏ లక్ష్యంతో తమ పనులు కొనసాగించటానికి కృషి చేశాయన్న విషయం అర్థం చేసుకోవడానికి కొంత పరిశ్రమ అవసరమైంది నాకు

నూతక్కి వెంకటేశ్వర్రావు–
జమ్మలమడుగు భరద్వాజ– తిరుపతి

ప్ర ఎటువంటి రచనలు ప్రస్తుతం వస్తే బాగుంటుందని మీ ఉద్దేశం?

జ వ్యక్తిని సంస్కరించే రచనలు కేవలం సమస్యని సామాజిక జీవితాన్ని ఆవిష్కరించి పరిష్కారాన్ని పాఠకుడికే వదిలేయకుండా చిన్న సూచన ఇస్తూ రచనలొస్తే బాగుంటుందని నా ఉద్దేశం ○

## సాగరమథనం

**వారంతా అతి క్రమశిక్షణతో లోపలికి నడిచొచ్చారు ఒక్కరు కూడా మాట్లాడిన శబ్దం లేదు అందరూ వెళ్ళి హాలులో కూర్చున్నారు వీరంతా కూర్చోగానే యాంటీ రూమ్స్‌నుండి స్థితబోధితో పాటు అనేకమంది ప్రత్యేకంగా ఆహ్వా నించబడ్డ అధికారులంతా వచ్చి కూర్చు న్నారు**

స్థితబోధి వచ్చినవారి నుద్దేశించి ఫ్రెండ్స్ మీ క్రమశిక్షణ నాకు నచ్చింది నాతో ఈరోజుదయం టెలిఫోన్‌లో మాట్లాడిన వ్యక్తి ఎవరో వచ్చి నాతో మాట్లాడాలి' ఈ డయాస్ మీదికి ఆహ్వానిస్తున్నాను' అన్నాడు

అనగానే సాగర్ లేచి డయాస్‌మీది కొచ్చాడు స్థితబోధితో కరచాలనం చేస్తూ అయామ్ సాగర్ అన్నాడు అని 'మీరు పర్మిషనిస్తే నేను మీ అందరితో కొద్దిసేపు మాట్లాడ్తాను' అన్నాడు

స్థితబోధి సరేనన్నట్లు తలూపాడు

ఫ్రెండ్స్ ఇక్కడ సమావేశమైన వారంతా ఎవరా అని మీకాశ్చర్యంగా వుందికదూ! వారెవరో తెలిశాక మీరింకా ఆశ్చర్యపోతారు

అదిగో ఆ చివరినుండి హాలు మూడొంతులు ఆక్రమించిన ఐదు పందల మంది శ్రీలంక విద్యార్థి నాయకులు - నిన్నటిదాకా మహావీరదూత చెరలో మగ్గిపోయి జీవచ్ఛవాల్లా మారిన ఈ దేశ బావి పౌరులు ఆ తర్వాత కూర్చున్నవారు పి ఎ పి ప్రతినిధులు సమరసింహ మేఘవర్ణులు వారి గ్రూపు సభ్యులు ఆ తర్వాత కర్నల్ పరంజ్యోతి సిలన్‌స్ప్రింగ్ నిర్మాత వారంతా సిలన్‌స్ప్రింగు సభ్యులు

అని అతననగానే కూర్చున్న అధికారుల గుండెల్లో అణుబాంబులు పేలి నట్లయింది స్థితబోధి ఆశ్చర్యంగా సాగర్ వైపు చూశాడు అతను క్రితంలో చేసిన కొన్ని పనుల ద్వారా అతనిపట్ల ఓ అభిప్రాయానికొచ్చాడు స్థితబోధి

**తూర్పు పడమరల్లాంటి ఈ గ్రూపులను, వారి నాయకులను** సభ్యులను ఎలా కలువగలిగాడు, ఎలా ఒక తాటిమీదికి లాక్కు వచ్చాడు? ఎవరీ సాగర్? ఏ అద్భుతశక్తి ఇతనిలో వుంది? స్థితబోధి, తన అధికారం కూడా మరిచి అయోమయంగా అతని వైపు చూస్తు న్నాడు

'డియర్ ఫ్రెండ్స్, నేనిక్కడ మీ ముందు ఇలా నిలబడింది కేవలం రెండుమూడు ప్రశ్నలడగటానికి మీరు దయచేసి సమాధానం ఇవ్వండి మొదటి ప్రశ్న వీరి డిమాండ్స్ తీర్చటానికి మీకున్న అభ్యంతరా లేమిటి?

స్థితబోధి మైకందుకొని, అసలు వారి డిమాండ్స్ ఏమిటో చెప్పమనండి' అన్నాడు

దానికి సాగర్ తాను చెప్పాడు రాష్ట్ర స్థాయిలో తమిళం అధికార బాష కావడం, వారి పిల్లలు తమిళ మీడియంలో చదువుకోవడం, వారి ప్రాజెక్టులు పార్లమెంటులో అప్రూవ్ చేయబడి కేంద్రం చేతనే ఎగ్జిక్యూట్ చేయబడటం ఇవి ముఖ్యమైనవి

స్థితబోధి వాటికి సమాధానంగా 'ప్రాజెక్టుల విషయంలో డిస్ట్రిక్ట్ డెవలప్‌మెంటు కౌన్సిల్స్ నిర్ణయం తీసుకుంటాయి. దానికి ఛైర్మన్ ప్రెసిడెంటు చేత అప్పాయింట్ కాబడి, ఒక ఎగ్జిక్యూటివ్ కమిటీ కలిగివుండి డిస్ట్రిక్ట్ మినిష్టర్ మెంబర్‌గా వ్యవహరిస్తాడు. ఇన్ డైరెక్టుగా ఇది కేంద్ర ప్రభుత్వపు పరిధిలో నే వుందికదా! ఇకపోతే లాంగ్వేజి విషయంలో - తమిళాన్ని ఈ రోజు అధికార భాష చేస్తే రేపు ఉర్దూని అధికార భాషగా చేయమని మూర్స్ అడిగే అవకాశం ఉంది. ఇలాగే ఇంకొకరు. ఈ విధంగా చేస్తూ పోతే దేశం మొత్తం బలహీనమైన కొన్ని రాష్ట్రాలుగా ఏర్పడి ఏ స్వార్థపూరితమైన దేశం వత్తిడికో లొంగి శ్రీలంక రక్షణకి గొడ్డలిపెట్టు కాగలదు'' అన్నాడు స్థితబోధి

సాగర్ అందుకొని 'నార్త్ అమెరికాలో క్యూబెక్ జాతీయులకి రాష్ట్ర హోదా యిచ్చి పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చారు ఇన్ని సంవత్సరాలుగా అక్కడ ఎటువంటి సమస్య రాలేదే? అలాగే స్పెయిన్‌లో 'బాస్క్యూ' జాతీయులకు కూడా ఇచ్చారు అక్కడా ఎటువంటి సమస్య లేదు కదా?' అన్నాడు సాగర్.

'అవి శ్రీలంక అంత చిన్న దేశాలు కావు. అందుకే అక్కడ సాధ్యమైంది' అన్నాడు స్థితబోధి.

సింగపూర్ శ్రీలంక కన్నా చిన్నదే కదా మరి అక్కడ తమిళం, చైనీ భాషలు అధికార భాషలుగా వున్నాయి. అలాగే స్విస్ దేశంలో జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్. భాషలు అధికార భాషలుగా చెలామణిలో వున్నాయి. ఎక్కడా లేని సమస్యలు మీకే వస్తాయనుకోవడం వాస్తవాన్ని విపరీతంగా ఆలోచించడమే' అన్నాడు సాగర్.

'ఆ దేశాల్లో మరి వారెలా పరిష్కరించుకుంటున్నారో గాని ఈ కంట్రీలో ఇంప్లిమెంట్ చేయటం కష్టం' అన్నాడు స్థితబోధి.

'అలా ఎందు కనుకోవాలి? వికేంద్రీకరించ బడ్డ రాష్ట్రాలకి ప్రత్యేక కోర్టులు, కార్య నిర్వాహక శాఖలు, స్వంత చట్ట, విధాన సభలు, విశ్వవిద్యాలయాలు ఉంటాయి ఫెడరల్ ప్రభుత్వం దేశభద్రత, కరెన్సి, ఎగుమతి దిగుమతులు, విదేశీ శాఖ, పౌర హక్కులు, జాతీయాభివృద్ధి మండలి, పొరుగు రాష్ట్ర వివాదాలు- ఈ సబ్జక్టులు మటుకే డీల్. చేస్తుంది అటువంటప్పుడు వారికి ప్రత్యేక రాష్ట్రాలివ్వటానికి ప్రత్యేక స్వయం ప్రతిపత్తి ఇవ్వటానికి మీ కభ్యం తర మేమిటి? యూరప్, ఫ్రాన్స్, స్పెయిన్, ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలలో ఇలాగే వుంది నేను కేవలం అదే ప్యాటన్ ఫాలో కమ్మని అనడంలేదు వాటిని మార్గదర్శక సూత్రాలుగా మాత్రమే తీసుకొని మనం కొత్త రూల్స్ వ్రాసుకోవచ్చు''

'నేనీ విషయాలన్నీ ప్రధాన కార్యదర్శితో, మిగతా సంబంధిత మంత్రులతో చర్చిస్తాను' అన్నాడు స్థితబోధి. వెంటనే అంతరంగిక మంత్రి (దేశ వ్యవహారాల మంత్రి) దయాస్ మీదికొచ్చి-

''ఇక్కడున్న గ్రూపుల నాయకులతో కమిటీ ఫామ్ చేసి వాటి ఇంప్లిమెంటేషన్‌కి చర్యలు తీసుకుంటాను'' అన్నాడు.

సాగర్ లేచి మాట్లాడుతూ 'మనం ఇప్పుడు రెండు ంహదారుల కూడలిలో వున్నాం. సదవగా ౦తో అందరూ కలిసి ఒక మధ్యే మార్గాన్ని ఎంచుకొని తమిళ శ్రీలంక అన్న పదాలు మర్చిపోయి శ్రీలంక నేషనల్స్‌గా అందరు జీవించటం ప్రారంభిస్తే ఇపుడు మీ దేశం కోల్పోయిన ఆస్తిపాస్తుల్ని తిరిగి పొందటానికి కనీసం 50 సం లు పడుతుంది అలాంటి జీవితాన్ని ప్రారంభించి శ్రీలంకని స్విస్ ఆఫ్ ది ఈస్ట్ అనిపించుకొంటారో లేక విద్రోహ చర్యలతోనూ, ద్వేషంతోనూ, జాతి తిరుగుబాటు తనంతో మారణ హోమాన్ని పెంచుకుంటూ లెబనాన్ ఆఫ్ సౌత్ ఈస్ట్ ఏషియా అవుతారో మీరే నిర్ణయించుకోండి. ఏ ఉద్దేశంతో రాష్ట్రాలకి స్వయం. ప్రతిపత్తి ఇవ్వకూడదని ప్రభుత్వం నిర్ణయించిందో ఆ ఉద్దేశం పూర్తిగా దెబ్బతిని ఈ రోజున స్వార్థపరులైన అనేక దేశాలవారు శ్రీలంకని తమ శక్తికొద్ది నాశనం చేశారు. అతి త్వరలో మీరంతా ఒక అవగాహనకొస్తే భారతదేశానికి ఎంతో సంతోషంగా వుంటుంది ఐ పి. కె. ఎఫ్.ని మీ దేశానికి పంపడంలో కొన్ని వందల కోట్ల రూపాయల నష్టం భరించింది. ఎందుకంటే పొరుగుదేశం క్షేమంగా ఉండాలి. ఇరుగు పొరుగు దేశాలు ఒకరి క్షేమాన్ని మరొకరు కాంక్షించాలి. అందుకనే సార్క్ సమావేశాలు, అలీనోద్యమాలు స్థాపించింది.

(ఇంకా వుంది)



హడావిడిగా ఆఫీసు వైపు అడుగులేస్తున్న నేను రాజారావు ఇంటిముందు వున్న గుంపును చూసి నడక వేగం తగ్గించి ఆ గుంపు దగ్గరికి చేరుకున్నాను.

"ఏమైంది?" ఒకతన్ని అడిగాను.

"రాజారావు భార్య చనిపోయింది" చెప్పాడతను.

ఉలిక్కిపడ్డాను నేను. ఆ రెండు పోర్షన్‌ల ఇంటిలో ఒక దాన్ని అంగడిగా, రెండోదాన్ని ఇంటిగా వాడుకుంటున్నారు రాజారావు దంపతులు.

"నిన్నరాత్రి అగ్గిపెట్టె, సిగిరెట్ ప్యాకెట్ కొన్నప్పుడు బాగానే వుంది. అంతలోనే ఇంత దారుణమా?" నా మనసు ఆక్రోశించింది.

"ఎలా చనిపోయింది?" అడిగాను నేను.

"ఆఁ .ఏదో మొగుడూపెళ్లాల తగవు. అంత మాత్రానికే వురి పోసుకొంది మహా తల్లి."

గుంపును తోసుకొనిలోపలికెళ్లాను నేను. ఆమెను వరండాలో పడుకోబెట్టి వున్నారు తెల్లటి గుడ్డ మెడ వరకు కప్పబడి వుంది నా కళ్లలో నీళ్లు తిరిగాయి ఇక అక్కడ నిలబడలేక పోయాను. భారంగా ఆఫీసు వైపు కదిలాను.

ఆమెను గురించిన ఆలోచనలు నాలో తుమ్మెదల్లా ముసర సాగాయి. ఆమెంటే నాకు గౌరవం, ఆరాధన తెల్ల కలువలా స్వచ్ఛంగా వుండే ఆమెంటే నాకెంతో ఇష్టం. నల్లగా వుండే అతనంటే నాకెందుకో అయిష్టం. ఆమెను చూడ్డంకోసమే నేను రోజూ ఆ అంగడి కెళుతుంటాను. కానీ ఆమె నాకేసి చూసినప్పుడు ఆ చూపుల్లో ఏ ప్రత్యేకతా వుండేది కాదు. ఆ చూపులు మామూలుగా-చాలా మామూలుగా వుండేవి. కానీ ఆ చూపులంటే నాకిష్టం. అంత నాకిష్టమైన చూపులు నాకిక లభించవన్న సత్యాన్ని నాగుండె భరించలేకుంది

అరగంట సేపు కూడా నేను ఆఫీసులో కూర్చోలేకపోయాను. సెలవు పెట్టి ఇంటి దారి పట్టాను. దారిలో ఆ ఇంటి వైపు చూశాను. ఇందాకటి జనం అక్కడ లేరు. శవం కూడా అక్కడ లేదు. నలుగురైదుగురు కూర్చొని వున్నారు నిశ్శబ్దంగా. అంతటా శ్మశాన నిశ్శబ్దం నెలకొని వుంది.

నాకు ఆశ్చర్య మేసింది. రాత్రి బాగా వున్న మనిషి బహుశా ఏ తెల్లవారు ఝామునో చనిపోయి వుండవచ్చు. ఆమె తరఫు బంధువులకు, ఆప్తులకు తెలియజేయడానికి, వాళ్లు రావడానికి కనీసం ఒక రోజన్నా పడుతుంది, ఎవరైనా సాయంత్ర వరకు శవాన్ని వుంచడానికి ప్రయత్నిస్తారు కానీ వీళ్లు ఇంత వుదయాన్నే, ఇంత హడావిడిగా శవాన్ని తరలించారు. ఎందుకని!

నాలో ఎందుకో ఏదో అనుమాన బీజం పడింది. నేను ఇంకోటి కూడా గమనించాను. ఇందాక గాని, ఇప్పుడుగాని తీవ్రంగా పెద్దగా ఏడవడంలేదు. మొక్కుబడిగా కన్నీళ్లు తుడుచుకుంటూన్నారుతప్ప హృదయంలో నుండి వచ్చే దుఃఖం వారెవ్వరిలోనూ కనబడటంలేదు. రాజారావు మాత్రం దూరంగా కూర్చొని గడ్డం కింద చెయ్యిపెట్టుకొని శూన్యంలోకి చూస్తున్నాడు.

నాలో అనుమానం నెమ్మదిగా బలపడింది. 'ఆమె ఆత్మహత్య చేసుకోలేదు. వాడే హత్య చేసి వుంటాడు. అసలు వాడే దొంగలా వుంటాడు. ఎర్రటి కళ్లు, వాడి రూపం . హంతకుడికి కావలసిన అన్ని హంగులూ వాడిలో వున్నాయి. ఏ కట్నం కోసమో లేదా అనుమానంతోనో చంపేసి వుంటాడు. రాస్కెల్! అది కప్పిపుచ్చడానికి ఇంత అర్జెంటుగా శవాన్ని మోసేశారు. ఈ విషయం ఆమె తల్లి దండ్రులకు తెలిసి వాళ్లు వచ్చి పోలీసు కేసు పెట్టకామానరు. వీడు కటకటాల్లోకి వెళ్లకా మానడు' నా మనసు పరి పరి విధాల పోతోంది.

నాలుగు రోజులు అక్కడ విశేషాలేమైనా కనిపిస్తాయేమోనని చూశాను. కానీ అక్కడ ఏమీ జరగలేదు అదే శ్మశాన నిశ్శబ్దం. నాకు మాత్రం కళ్లు తెరిచినా, మూసినా ఆమే కనిపించసాగింది. 'నాకు న్యాయం చెయ్యండి. నన్ను అన్యాయంగా చంపేశారు' అని ఏడుస్తూ కన్పిస్తోంది నాకు నిద్ర కరువైంది.

ఐదో రోజు రాజారావును పలకరించడానికి వెళ్లాను. కాసేపు అతనికి ఓదార్పు మాటలు చెప్పి ఇంత దారుణం ఎలా జరిగిందని అడిగాను. దాని కతను "ఎందుకులెండి అయిపోయిందేదో అయిపోయింది. గుర్తుకు తెచ్చు కున్నందువల్ల ఏం లాభం?" అని నిట్టూర్పు విడిచి లేచి లోపలికి వెళ్లిపోయాడు. ఆ మాట లంటున్నప్పుడు అతనిలో తడబాటు స్పష్టంగా కనిపించింది. నేను అక్కడి నుండి వచ్చేశాను.

'నీ అక్కకో, చెల్లెలికో ఇలా అర్థాంతర చావు వస్తే వూరుకుంటావా?' అని నా అంతరాత్మ నన్ను ప్రశ్నించడం మొదలు పెట్టింది. ఆమె ఎవరో, నేను ఎవరో, ఆమెకోసం నేనెందుకింత బాధ పడుతున్నానో నాకే అర్థం కాలేదు. మానసిక సంబంధమో లేక పూర్వజన్మ సంబంధమో అంటే ఇదే కాబోలు అని అనిపించ సాగింది.

వారం రోజుల తర్వాత నాకాళ్లు అప్రయత్నంగా పోలీసు స్టేషన్‌లో అడుగు పెట్టాయి. ఎస్.ఐ. నాకు తెలిసిన వాడు కావడంతో వెంటనే ఆ విషయాన్ని అనుమానాస్పద కేసుగా రిజిస్టరు చేసి ముందుగా రాజారావును అరెస్టు చేశారు. అప్పుడు నా మనస్సు

కురుట పడింది.

పోలీసులు ఇన్వెస్టిగేషన్ మొదలయ్యింది. శవాన్ని బయటకు తీసి పోస్టు మార్టం చేశారు. ఊర్లో సంచలనం కలిగించింది సంఘ ఎవ నన్నందరూ ఒక హీరోలా చూడసా గారు. హఠాత్తుగా ఎంతో ఎత్తుకు ఎదిగిపో యిన ఫీలింగొచ్చింది నాకు. ఒక స్త్రీకి జరిగిన అన్యాయాన్ని వెలికి తెచ్చిన ఆదర్శమూర్తిగా అందరూ నన్ను పొగడసాగారు.

బెయిలు మీద బయటకొచ్చిన రాజారావు ఒక రోజు బజార్లో నాకు ఎదురుపడ్డాడు, సూటిగా నావైపే చూస్తూ నా దగ్గరికి రాసా గాడు. నాకు భయం కలిగింది. సపోర్టు కోసం అటూ ఇటూ చూశాను. నన్ను రక్షించే వారెవరూ కనిపించలేదు. ఈలోగా రాజారావు నా దగ్గరకొచ్చి నిలబడ్డాడు

"మీతో కొద్దిగా మాట్లాడాలి పక్కకొ స్తారా?" నెమ్మదిగా అన్నాడు రాజారావు

"ఎందుకూ?" అడిగాను కాస్త భయంగా.

"ఏమీలేదు ఐదు నిమిషాల్లో వెళ్లిపోదురు గాని రండి" అంటూ ముందుకు నడిచాడు నేను అతన్ని అనుసరించాను.

ఇద్దరం పార్కులో ఒక మూల సిమెంటు బెంచిపై కూర్చున్నాము. రాజారావు మాట్లాడ్డం మొదలు పెట్టాడు.

"నా మీద రిపోర్టు ఎందు కిచ్చారని నే నడగడంలేదు. నా భార్య నా వల్లే చనిపో యిందని కూడా ఒప్పుకుంటున్నాను. అయితే

## ఉరిపోసుకున్న భార్య

ఆ పరిస్థితి ఎందుకొచ్చిందో మీకు తెలుసా?"

తెలియదన్నట్టుగా తలాడించాను నేను.

"మీ వ్యక్తిత్వం నాకు తెలును. బహుశా మీరు నా భార్య ఒక అమాయకురాలని, ఆమెను అన్యాయంగా నేను చంపేశానని భావించి నా మీద రిపోర్ట్ ఇచ్చి వుంటారు. నేనూ ఆమెను అమాయకురాలనే భావిం చాను. చాలా మంది భర్తల్లాగే ఆమెను అపురూపంగా చూసుకున్నాను కానీ నా నమ్మకాన్ని వమ్ము చేస్తూ, నా గుండె లను కోసివేస్తూ ఆమె మా అంగడికి వచ్చే ఒక యువకుడితో సంబంధం పెట్టుకొంది. అది గమనించిన నేను ఆమెను చాలాసార్లు మందలించాను. ఆ పద్ధతి మానుకొమ్మని బతిమలాడుకున్నాను. కానీ నా మాటలు ఆమె చెవి కెక్కలేదు. ఆ విషయం బయట పడితే పరువు పోతుందని లోలోపలే అంతులేని మానసిక క్షోభ ననుభవించాను. చివరికి ఆమె ప్రవర్తన శృతి మించింది. ఒక రోజు ఆ యువకుడితో కలిసి ఎక్కడికో వెళ్లింది. మరుసటి రోజు తిరిగి వచ్చింది. ఆ రోజు నాలో కోపం కట్టలు తెంచు కొంది. ఆమెపై కఠినంగా చెయ్యి చేసుకున్నాను. అంతే! ఆ రాత్రి ఆమె వురి పోసుకొంది.

ఇందులో నా తప్పేమిటి? చెడు మార్గాన వెళ్లే నా భార్యను మందలించ డమా? పరువు పోతుందని బజార్న పడకుండా వుండడమా?"

నా గుండె నెవరో ముక్కలుగా తరుగు తున్నట్లనిపించింది. అతను చెప్పిన భయం కరమైన నిజాన్ని నేను జీర్ణించుకోలేకున్నాను.

రాజారావు మళ్లీ చెప్పసాగాడు.

"ఆరోజు జరిగిన విషయం, ఆమె ప్రవ ర్తన ఆమె తల్లి దండ్రు లకు కూడా తెలుసు. నా మంచితనం తెలిసిన వారవడం చేత వాళ్లు మౌనంగా వుండిపోయారు ఆత్మహత్య విషయం బయటపడితే పోలీసు కేసవుతుందని వున్న కాస్త ఎరువు పోతుందని మా పెద్ద లంతా ఆలోచించి శవాన్ని తొందరగా తీసు కెళ్లారు. కానీ మీ పుణ్యాన ఆ విషయం పోలీసుల దాకా వెళ్లింది"

"అయాం సారీ రాజారావ్! ఇంత దూరం నేను వూహించలేదు నే నిప్పుడే కేసు విత్‌డ్రా చేసుకుంటాను" అన్నాను ఉద్వేగంగా

"లాభంలేదుసార్! కేసు కోర్టులో ఫైల యిపోయింది. ఎల్లుండే విచారణ" అన్నాడు రాజారావు.

"అయితే కోర్టులో నాది పొరపాటని, అది సహజ మరణ మని చెప్తాను" అన్నాను.

రాజారావు శుష్కమైన నవ్వు నవ్వాడు.

## వీక్లీ పోస్ట్

### తొలి చిత్రాలు

19-12-90వ తేదీతో వెలువడిన "ఆంధ్ర సచిత్ర వారపత్రిక"లో 16వ పేజీలో "తెలుగులో తొలి చిత్రాలు" తెలియ జేసారు బాగానే ఉంది కానీ, తెలుగుదేశంలో మొదటి థియేటర్ మారుతి సినిమాహాలు "విజయవాడ" అని, స్థలం తెలియ జేయలేదు అలాగే, స్వర్ణోత్సవం జరుపుకొన్న తొలి తెలుగు చిత్రం- 'ప్రేమాభిషేకం' (1981) అని వ్రాసారు. కాని, 'లవకుశ' చిత్రం 1964లో స్వర్ణోత్సవం జరుపుకొన్నట్లు 'స్టేట్ సెంట్రల్ లైబ్రరీ"లో అప్పటి "ఆంధ్రపత్రిక" (డైలీ)లో ఏదో "వ్యాసం" గూర్చి సేకరించగా 1983లో నేను, నా కళ్లారా చూసాను మరి "ప్రేమాభిషేకం" తర్వాత కూడా స్వర్ణోత్సవాలు జరుపుకొన్న చిత్రాలు "షిఫ్ట్"లతో రెండు ఉన్నాయి (అతిగా చేసిన 'షిఫ్ట్'లు మినహాయించిన 'చిత్రాలు' కాక) మరి 1977లో "అడవి రాముడు" మాట అది కూడా 1978లో స్వర్ణోత్సవం జరుపుకొంది.

—పెమ్మెత్స సూరిబాబు (హైదరాబాద్)

### ఇంటర్వ్యూ

నందమూరి తారక రామునికి మీ పత్రిక అందించిన అక్షర కుసుమాలు చూశాను 67 సంవత్సరాల కళా విశ్వరూపానికి, 83 సంవత్సరాల పత్రికామతల్లి అందించిన ఆశీస్సులు అవి

'కృషి వుంటే మనుషులు ఋషు లౌతారు' అన్న పాటకు మీరు అందించె ఫోటోలు అర్థాలు తాత్పర్యాలు

యం వి ఎస్ హరినాధరావు
(నన రచయిత) ఒంగోలు

### అలనాటి చిత్రాలు

**శీర్షికలో పాత చిత్రాల సమీక్షలు, ఆ చిత్రాల ప్రకటన వివరాలు ఇటీవల ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రతీ వారం ప్రచురించడం పాఠకులకు ఆనందదాయకం అనే చెప్పాలి అనాటి చిత్రాలు – ఈ నాటి యువతరం చూచే అవకాశం లేనందున నాటి చిత్రాల గొప్పదనం ఈవిధంగా తెలుసుకునే అవకాశం కల్గుతుంది. విషయ సేకరణ గావిస్తున్న భీశెట్టి గార్ని అభినందించి తీరాలి....**

**అయితే ఈ శీర్షిక పేరుకు తగ్గట్టు "మేటి" చిత్రాల గురించే ప్రచురిస్తే ఈ లేఖ నేను రాయవలసిన అవుసరం వుండేదికాదు. మరదలు పెళ్లి, పుట్టిల్లు వంటివి 'మేటి' చిత్రాల జాబితాలో వుండదగ్గవి కాదు. ఆ సమీక్షల్లోనే ఆ చిత్రాల లోటుపాట్లు విశదమవు తున్నాయి. ఆ చిత్రాలు ఆర్థికంగా**

## సంక్రమణ లక్ష్మి



కన్నె మనముల మేలి
కళల వన్నెల జాలు
తీర్చి దిద్దిన ముగ్గు
తీరులందున గ్రాలు

సంక్రాంతి సంబరము
సరి 'గంగి రెద్దులను'
'హరిలో' యను 'జియ్య'
రాట పాటల నుండు

తెలుగు గుమ్మాలందు
వెలసినవి పూసరులు
తెలుగు వాకిళ్ళలో
నిలిచినవి క్రొవ్విరులు

తోట మాలీ కృషిన
దోగాడె చేమంతి
మిరప తోటల కడల
విరిసినది పూబంతి

శీత వాతూలమున
జీర్ణ దేహమ్ములను
చెర బట్టి వణికించు
శిశిరమ్ము జంకినది

ఆశలను పందిళ్ళ
మోసు లెత్తును విరులు
పూసి పుప్పొడి రాల్చి
భువి నంత మురిపించు

ప్రతి యెడద తన్మయత
పరవశమ్మున ఆడు
ప్రతి గృహము సంతోష
**ఋతు బలమ్మున దూగు**

మనిషి హృది మొలకెత్తు
మధురాను భావములు
ముగ్ధయగు నీ వసుధ
మొనసి తాండవ మాడు

పువ్వులటు జనమనము
నవ్వులను తులకింప
ఎడదలను అనురాగ
జడధి పొంగులు వారు

భువనమ్ము సమ్మోహ
భవనమ్ముగా వెలుగు
సకల మానవ జాతి
సంతోషమున బొందు!

**- రావెళ్ల వేంకటరామారావు**

"మీది అర్థం లేని వాదన. అయినా అప్పటి వరకూ నేను బ్రతికుంటే అలాగే కానివ్వండి" అన్నాడతను.

"అంటే?!" నా భృకుటి ముడివడింది.

"నాకు జీవితం మీద విరక్తి కలిగింది సార్! నేను పోయేలోగా మీకు నిజం చెప్పా లనుకున్నాను, చెప్పేశాను. గుడ్‌బై" అతను లేచి వెళ్లి పోయాడు.

వెనుక నుండి నేను గొంతు చించుకొని అరుస్తున్నా అతను ఆగలేదు. నేను చేతుల్లో ముఖం దాచుకొని కూలబడి పోయాను.

○

దెబ్బతిన్నాయి. విమర్శలకు గురికాబడ్డాయి.

'మరదలు పెళ్లి' చిత్రంలో డాక్టర్ ప్రకాష్– తన భార్యను చంపడం కోసం పాముల వాడిని ఆశ్రయించి గరళం సంపాదించడం అసమంజసంగా వుంది. ఒక డాక్టర్ ఈవిధంగా చేస్తాడా? అని చిత్రం చూస్తున్నప్పుడే ప్రేక్షకుల్లో సందేహం కలిగింది. ఇలాగే కథలో బిగువు లేకుండా సన్నివేశాలు వెలవెల పోయాయి. చిత్రంలో చెప్పుకో దగ్గది ఏమైనా వున్నదంటే అది పి. యల్. రాయి ఛాయాగ్రహణం మాత్రమే. అప్పుడే రెండో చిత్రం "బంగారు సంకెళ్ళు" తీస్తానని ప్రకటించి తీయలేక పోయాడు. 'మరదలు పెళ్లి' 'మేటి' చిత్రం కానేరదు.

అదేవిధంగా "పుట్టిల్లు"లో కూడా కథా గమనం సరిగ్గా సాగక అవకతవకలుగా తయారయింది. పాటల వరసలు చాలా వరకు హిందీ చిత్రాల పాటలకి అనుకరణలు. ఈ చిత్రంలోనూ ఛాయాగ్రహణమే చిత్రానికి వన్నె తెచ్చింది.

'పుట్టిల్లు' చిత్రంలో పనిచేసిన నటీనటులకు, సాంకేతిక శాఖ వారికి చిత్రసీమలో స్థానం లభించి స్థిరత్వం సంపాదించుకున్నారు. ఆ చిత్ర రథసారథి డాక్టర్ రాజారావుకు తప్ప!

**—అరిపాక సూరిబాబు, విశాఖపట్నం –1.**

### ఇంటర్వ్యూ

ఎన్.టి. రామారావు గారితో స్పెషల్ ఇంటర్వ్యూ ఎంతో గొప్పగా వుంది ఆ మహానటునితో పరిచయం మా అందరికీ నచ్చింది సూపర్బ్‌గా వుంది నేత్ర ధనుస్సు హుషారుగా వుంది కొత్త మార్పులు తెస్తున్న మీకు కృతజ్ఞతలు

కోట శివలింగేశ్వరరావు. విజయవాడ

○



## న్యూఢిల్లీ లేఖ!

జైదుబాషీ



# ఇది ఏవిధమైన "సెక్యులరిజం?"

ఏ విజయం ఎలాగైతే విజయవంతం కాలేదో, అలాగే ఏ వైఫల్యం కూడా విఫలం కాలేదు మార్క్సిజమ్ పూర్తి విఫలం అయింది కమ్యూనిస్టులు కొన్ని రోజులకు పూర్వం వారు కలలో కూడా తలంచని విధంగా యిప్పుడు పనులు చేయడం, చెప్పడం మీరు గమనిస్తున్నారు

మార్క్సిస్టులు మతంతో ఎప్పటికీ సమాధాన పడలేరు సన్యాసులకు ధనం అంటే ఎలా గిట్టదో వీరికి మతం అంటే అలా గిట్టదు. మతం అనే మాట తలెత్త కుండా దానిని వారు తివాసిక్రింద త్రొక్కి పెట్ట ప్రయత్నించారు సోవియట్ రష్యాలో చర్చీలన్నీ వేర్ హౌస్‌లుగా, గోడవున్లుగా మార్చబడ్డాయి మతాచార్యు (ప్రీస్టు)లంతా ధ్యాన శిబిరాలకు తరలించబడ్డారు స్వతంత్రసంస్థలు నడిపేవారిని కూడా చంపేస్తామని భయపెట్టి నిషేధించారు వేలాది మతాచార్యులు చంపివేయబడ్డారు లేదా బహిష్కరింపబడ్డారు-సోవియట్ కమ్యూనిస్టులకు బహిష్కారం అనే పదం చాలా ప్రీతిపాత్రమైన పదం - పెద్ద మొత్తాలలో చర్చీ ఆస్తులంతా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది

అయితే మతం అనేది పోలేదు శ్రీ గోర్బచేవ్ తల్లి రహస్యంగా తన కుమారునికి జ్ఞానస్నానం (బాప్టిజం) చేయించారు ఎప్పుడు, ఎక్కడ అది జరిగిందో శ్రీ గోర్బచేవ్‌కి కూడా తెలీదు ఏది ఏమైనా మతాన్ని నిషేధించడం అనగా నిజాన్ని నిషేధించడమే అని ఆ మేరకు తమ పార్టీ చేసిన పని తప్పే అని శ్రీ గోర్బచేవ్ అంగీకరించారు

భారతదేశంలోని మన కామ్రేడ్స్‌మాత్రం వారి మామూలు ప్రకారం తెలివిగా వుండను ప్రయత్నించారు శ్రీ డాంగే దేవాలయాలకు అవి ఏదో చీడ అన్నట్లు భావించి వెళ్లడం మానుకున్నారు కానీ, తన స్వంత పుస్తకాల అరలో మాత్రం శ్రీ భగవద్గీతా, తదితర పుస్తకాలను వుంచుకున్నారు. శ్రీ నంబూద్రిపాద్ మాత్రం బయటకి గొప్పగా కన్పిస్తారు

కానీ తమ సతీమణితో కల్సి శబరిమలై వెళ్తుండేవారు ఇప్పటికీ వెళ్తున్నారు కూడా శ్రీ నంబూద్రిపాద్ కూడా శ్రీ నెహ్రూ గారి లాగే ఒక లౌకికవాది లౌకిక భారతీయులకు చర్చీలకు, మసీదులకు దర్శనార్థమై వెళ్లడానికి అభ్యంతరం వుండదుకానీ, హిందూ దేవాలయాలలో కన్పించడానికి మాత్రం యిష్టపడక వారు తప్పించుకుంటూ వుంటారు

కానీ యిప్పుడు అదంతా మారిపోతోంది రష్యాలోనూ చర్చీలు మళ్లీ వెలిశాయి శ్రీ గోర్బచేవ్ కూడా చర్చీల్లో కన్పిస్తున్నారు



లోక్‌సభలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ ఎల్ కె అద్వాని

సోవియట్ ప్రభుత్వం పాత చర్చీలు, కేథడ్రల్‌లు పునరుద్ధరణకై కోట్లాది రూపాయలను మంజూరుచేసింది అయితే అదేమంత గొప్ప విషయంకాదు విప్లవం అని పిలువబడిన సమయంలో ప్రభుత్వం చర్చీలను కొల్లగొట్టింది, ఈ రోజు వారు చేస్తున్నది కొల్లగొట్టిన ధనాన్ని తిరిగి యివ్వడమే!

రాజకీయాలలోంచి మతాన్ని విసర్జించిన కారణంగా, లౌకికపక్షంగా వుండటానికి ప్రయత్నించిన కారణంగానే కమ్యూనిజం విఫలం అయిందని నేను అనాలి లౌకిక రాజ్యంలో నైతికసిద్ధాంతం కొరవడుతుంది ఈ రకమైన సిద్ధాంతమే మీరు చేస్తున్న పని మంచిదా! చెడ్డదా! అని నిర్ణయించడానికి సహాయపడుతుంది రోజులు గడిచేకొద్దీ జటిలంగా వున్న సంఘం మరికొంత జటిలం అవుతూ వుంటుంది అందుకని అలాంటి నైతికలక్ష్యాలనుఅప్పటికప్పుడే సంఘమే సరిదిద్దుకోవాల్సినఅవసరంఎంతైనావుంది లేకపోయిన అది దోవ తప్పి అంతరించి పోతుంది

రష్యాలోని రైతులకు స్టాలిన్‌గారు ఏమిచేశారో చూడండి తమదేశాన్ని ఆధునీకరణ చేయతలంచారు, అది మంచి ఆశ్యమే, కానీ అందుకు సరైన మార్గం ఆయనకు తెలీదు అన్నిరకాలయిన ఉత్పత్తులను పెంచాలని మార్క్సిజమ్ పిలుపు నిచ్చిన మొదలు, స్టాలిన్ ఆయన అనుచరులు రైతులనంతా కూడా వారసత్వంగా వారికొచ్చిన పొలాల నుంచి తరిమికొట్టి, అంతా ధ్వంసంచేశారు స్టాలిన్ ఆధునీకరణ దండయాత్రలో పురుషులు, స్త్రీలు, పిల్లలు 20 మిలియన్లకు మించి నశించిపోయారు, నిజానికి రెండవ ప్రపంచ యుద్ధంలో నశించినవారికన్నా ఈసంఖ్య ఎక్కువ అమాయక రైతులు పెద్దపెట్టున నాశనం అయిన విషయాన్ని దాటవేసి మన కామ్రేడ్‌లతో సహా కమ్యూనిస్టులందరూ ఈ దండయాత్రకు జేజేలు చెప్పారు

కమ్యూనిస్టు తమ గ్రంథాలు అలా బోధించాయి గనుక, తాము చేస్తున్నదంతా సక్రమమైనదని నమ్ముతారు. గ్రంథాలు ఎవరు వ్రాశారు? మార్క్స్‌గారు అనే వ్యక్తి వ్రాశారు మతం ఒక మత్తుమందు లాంటిదని, దానివల్ల ప్రయోజనం ఏమీ వుండదని ఆయన విశదీకరించారు కానీ జన సంహారం తప్పు, మీరు ఆధునీకరణ పేరుతో ఒక సంఘాన్ని విధ్వంసం చేయకూడదు యుద్ధరంగంలో తప్ప విధ్వంసం అనేది తప్పుగనుక మీరు రైతుల్ని చంపకూడదు తాత్కాలికంగా విజయం సాధిస్తున్నట్లు భావించినా, ఒక తప్పువని ఎప్పటికీ విజయం సాధించలేదు

ఏది తప్పు ఏది ఒప్పు లౌకిక హేతువాదంలో నైతికప్రమాణం వుండదు గనుక సంపూర్ణ లౌకిక హేతువాదం మీకు ఏది తప్పు,

ఏది ఒప్పు అనేది చెప్పలేదు, ఖచ్చితంగా ఏది నైతికపరంగా తప్పు, ఏది నైతికపరంగా ఒప్పు అనేది చెప్పలేదు. మతాన్ని తీసెయ్యండి, నైతిక
ప్రమాణాన్ని తీసెయ్యండి, అలాంటి ప్రమాణం లేకుండా మార్క్సిస్ట్ దేశంలోలా ఒక్క సోవియట్ రష్యాలోనే కాదు తూర్పు యూరప్ దేశాలన్నీ కూడా కలతచెందుతాయి.

అయోధ్యా కథనంలో భారత కమ్యూనిస్టులు ఎందుకు-నిద్రాణమై వున్నారనే విషయంకూడా యిది విశదీకరిస్తుంది. గత కొన్ని సంవత్సరాలుగా అయోధ్య సంఘటన ప్రారంభమైనప్పటినుంచి

రాముడు అయోధ్యలో పుట్టలేదని నిరూపించడంలో, అయోధ్య దేవాలయం గురించి యదార్థం నిరూపించడంలో వారు చాలా చురుకుగా వున్నారు. ఢిల్లీలోని కొందరు మూర్ఖపు చరిత్రకారులు, ముఖ్యంగా జవహర్ లాల్ నెహ్రూ యూనివర్శిటీనుంచి అయోధ్యలో దేవాలయమే లేదు అని నిరూపించడానికై పురాతన పత్రాలను అర్ధరాత్రి సమయంలో తగులబెట్టడంలో ఎడతెరిపిలేకుండా వున్నారు. శ్రీ జ్యోతిబసు ఒక అడుగు ముందుకు వెళ్లారు. పోలీసులు ఆఖరిక్షణంలో వెనుకకు మరలకుండా చూడమనీ, ఉద్యమం ఆగే
వరకూ ఆయుధాగారం నుంచి అన్నిటినీ పుపయోగించాలనీ ఆయన శ్రీ ములాయం సింగ్‌కి చెప్పారు. కమ్యూనిస్టుల మెదడులు ఈ విధంగానే పనిచేస్తాయి. వాళ్ళకి హింస ఒక్కటే తెలుసు. సోవియట్ రష్యాలో కూలక్స్‌ని పడగొట్టడానికై స్టాలిన్‌గారు ఏ రకమైన హింసను ప్రయోగించారో ఆ హింస ఒక్కటే వారికి తెలుసు. శ్రీ జ్యోతిబసు అతని అనుచరుల అధికారమే కేంద్రంలో వున్నట్లయితే అయోధ్యలో సరిగా వారిలాగే చేసివుండేవారు. శ్రీ ములాయం సింగ్ చేసినట్లు వందల్లో గాకుండా వేలల్లో కార్ సేవకులు ఊచకోతకు గురయ్యేవారు.

దేవుని మందిరంలో కేవలం ప్రార్థనలు చేయడానికై వచ్చిన శాంతికాముకులైన కార్ సేవకులను ఊచకోతకు గురిచేయడం లౌకికవాదమా? తప్పు ఒప్పులను తెలుసుకోలేని యిది ఏ విధమైన లౌకికవాదం? రైతులచే కార్ సేవకులచే మీరు ఏమి చేయించాలనుకుంటున్నారో అది చేయించడంకన్నా వారిని చంపివేయడమే మీకు వసతి. ఎందుకంటే ఆధునిక లౌకికరాజ్యం నైతికపరమైన ఆధారం లేకుండా తప్పు ఒప్పుల భేదాన్ని తెలుసుకోలేదు. అలాంటి రాజ్యం మనడానికి నైతికమైన హక్కు లేదు. ఇందుమూలంగానే కమ్యూనిస్టు హయాం పడిపోయింది. కమ్యూనిజం కూడా ఆ మార్గాన్నే అనుసరిస్తోంది. o



హైదరాబాద్‌లో 12వ ఆంధ్రప్రదేశ్ దంత వైద్యుల సమావేశాన్ని ప్రారంభిస్తున్న రాష్ట్ర రెవెన్యూ శాఖ ప్రిన్సిపల్ కార్యదర్శి శ్రీ కె. ఎస్. ఆర్. మూర్తి (ఐ. ఎ. ఎస్.) దంత వైద్యుల సంఘం కార్యదర్శి డా. ఓ. నాగేశ్వరరావు కూడా చిత్రంలో వున్నారు.



ఇటీవల రాజమండ్రిలోని శ్రీ వేంకటేశ్వర ఆనంద కళాకేంద్రంలో "శేఖర్ కార్టూన్ల ప్రదర్శన"ని ఆంధ్రప్రదేశ్ దూరదర్శన్ న్యూస్ రీడర్ శ్రీ శాంతి స్వరూప్ ప్రారంభిస్తున్న దృశ్యం. నేషనల్ అవార్డ్ విన్నర్' శ్రీ పురాణపండ శ్రీనివాస్, యువ కార్టూనిస్టు శ్రీ శేఖర్‌లను కూడా ఈ చిత్రంలో చూడవచ్చు.



మహబూబాబాద్‌లో భారత వికాస పరిషత్, ఇండియన్ మెడికల్ అసోసియేషన్ సంయుక్తంగా నిర్వహించిన ఉచిత నేత్ర వైద్య శిబిరంలో వరంగల్ ప్రాంతీయ కంటి వైద్యశాల సూపరింటెండెంట్ డా. పార్థసారథిరెడ్డి ప్రసంగిస్తున్న దృశ్యం.



# మణికంఠుడు

ప్రయాగ రామకృష్ణ

**ఇంతవరకూ సాగినకథ-7:** మహోన్నతమైన దాంపత్య జీవితం గురించి, ధర్మార్థకామ మోక్షాలను అనుభవించటం గురించి ప్రజలకు తెలియజేయవలసిన బాధ్యతను బ్రహ్మ తన మానసపుత్రుడైన అత్రిమహర్షిపై వుంచుతాడు. అత్రిభార్య అనసూయ పాతివ్రత్యానికి మెచ్చి త్రిమూర్తులు దత్తాత్రేయుడ్ని ప్రసాదిస్తారు. గాలవ మహర్షి కూతురు లీలాదేవిని వివాహం చేసుకున్న దత్తాత్రేయుడు మహిషివి కమ్మని లీలను శపిస్తాడు. నారదుడి సలహాపై త్రిమూర్తులు సృష్టించిన మహిషం అదృశ్యం కావటంతో మహిషి బ్రహ్మ గురించి తపస్సు చేసి వరాలు పొందుతుంది. మహావిష్ణువు జగన్మోహిని అవతారం ధరిస్తాడు. ఆ జగన్మోహినిని చూడాలని శివుడు ఉబలాటపడతాడు.

(గతసంచిక తరువాయి)

**త**నేం చేస్తున్నదీ అయనకే తెలియదు. జగన్మోహిని తప్ప శివుడు మనస్సుకు ఇంకేమీ పొడగట్టడం లేదు.

మహర్షి వూరించి వూరించి చెప్పిన ఆ మనోహరి మంద హాసాలే ఆయనకు మధురంగా కనిపిస్తున్నాయి. ఆ పంచ రంగుల చిలకే పూల రేకులా మెత్తగా మనసంతా పరుచుకుని చక్కిలి గింతలు పెడుతోంది. ఆ సుందరాంగే చేతులు చాచి మదన తాపంతో బాధపడుతున్న తనను తన చల్లని కౌగిలిలోకి ఆహ్వానిస్తున్నట్లు భోళాశంకరుడు వెర్రిగా అన్ని దిక్కులకు పరుగెడుతున్నాడు. అందకుండా ఆ అందాల చిన్నది ఆట పట్టిస్తోంది. పరమ శివుణ్ణే మృదువుగా ముద్దుగా ఎగతాళి చేస్తోంది.

'ఈ పిల్లను ప్రేమించ కుండా ఉండడం అసలు ఎవరికీ సాధ్యం కాదేమో!' మనసులోని మాట పైకే అనేశాడు ఈశ్వరుడు.

' చిత్రంగా చాలా విచిత్రంగా వుంది' అన్నాడు నారదుడు.

' ఏమిటి విచిత్రం?'

'కామ క్రోధ లోభ మోహాలని వదిలి పెడితేగాని ఆత్మజ్ఞానం కలగదని చెప్పిన శంకరుల వారేనా ఇలా ఆడపిల్లకోసం వెంపర్లాడుతోందీ అని....' ' ఔనౌను. జీవితం తామరాకు మీద నీటి బొట్టు లాంటిదని తలచి ప్రపంచాన్ని జీర్ణ వస్త్రంలా భావించి భక్తి పీతాంబరం ధరించిన యోగి పుంగవులు కోమలి సౌందర్య విషయ వివరణలో ఇంతటి నేర్పరులెప్పుడయ్యారా అని నాకూ అనుమానంగానే వుంది.'

మహర్షి, మహేశ్వరుడూ ఇద్దరూ ఒకే సారి పెద్దగా నవ్వారు.

ఆ నవ్వులు విని విష్ణుమూర్తి వైకుంఠ ద్వారాలు తరుచుకుని బయటకు వచ్చాడు.

ఆశ్చర్యం!

ఆయన వెనుక కనులు మిరుమిట్లు గొలిపే ప్రకాశంతో ఒకానొక అఖండ నీల కాంతి. చాలాసేపు శివ నారదులిద్దరూ విష్ణుదేవుణ్ణే అలాగే చూస్తూ నిలబడిపోయారు.

వాళ్ళ అంతరంగమంతా ఆయన నీల కాంతితో నిండిపోయింది.

' మహర్షీ! నువు చెప్పిన మోహిని కన్నా ఈ మోహనుడు మరీ మనోహరంగా లేడూ! ఆ బలం, ఆ సౌందర్యం, ఆ రూపు రేఖలు, ఆ ఠీవి, ఆ ఔదార్యం, ఆ అమృత మయ నీలకాంతి... '

నిజమే, కాని ఈ దేవదేవుణ్ణి, జగన్నాధుణ్ణి నేను చెప్పిన జగన్మోహిని రూపంలో చూశాక అప్పుడు చెబుదువు గాని...'

'అలాగా....!'

శ్రీ మహావిష్ణువు అంతా వింటూనే ఏమీ తెలీనట్టు ' ఏమిటి భార్గవా?' అని అడిగాడు. భార్గవుడు చేతులు జోడించి ప్రభూ! క్షీరసాగర మధన మప్పుడు నువ్వు మోహినీ రూపం ధరించి రాక్షసుల్ని సమ్మోహితుల్ని చేశావుట. అప్పుడు నీ కళ్ళు ముద్దుగా, నీ పెదాలు ముద్దుగా, నీ చెంపలు ముద్దుగా, నీ పాదాలు ముద్దుగా, నువు నిలువెల్లా ముద్దుముద్దుగా వున్నావట. నువ్వు తేనె రంగులో మెత్తగా చెయ్యి వేస్తే జారిపోయేట్టూ, జగత్పతికైనా, జగత్పితకైనా నిన్నెగరేసుకుపోయి స్వర్గంలో ఎవరికీ తెలియని చోట ఆనందపు పొలిమేరల్లో విహరిద్దామా అనే పిచ్చి కోరికను కలిగించేట్టూ వున్నావని నారద మహర్షి చెప్పాడు. సర్వ లక్షణ సమన్వితగా, శోభిల్లు సప్త స్వర సుందరిగా ప్రేమ సర్వస్వంగా, చిక్కదనం, చక్కదనం సౌకుమార్యాలతో మధుర సమ్మేళనం పొందిన సౌందర్య నిధిగా వెలుగులు చిమ్ముతూ కన్యత్వం, స్త్రీత్వం, దేవతాత్వం, అన్నీ ఏకత్ర మూర్తీభవించి ఏక రాశిగా ప్రకాశించి కన్నుల పండుగ చేశావుట. లీలామానుష విగ్రహ స్వరూపా! అప్పటి నీ జగన్మోహిని రూపంతో నా కళ్ళకూ ఇప్పుడు విందు చెయ్యి అని ప్రార్థించాడు. శ్రీ మహావిష్ణువుక అర్థమైంది. ఇదంతా నారదుడాడిస్తున్న నాటకమని తెలిసిపోయింది.

' నారదా! నీ విశేష వాగ్వైభవంతో, నీ మోహినీ దండకంతో పరమేశ్వరుణ్ణే పిచ్చివాణ్ణి చేశావు. బ్రతుకొక కలలాంటిదని చెప్పిన భార్గవుణ్ణే కలల్లోకి నెట్టావు. జీవించినన్నాళ్లూ అంటీ ముట్టనట్టు బ్రతికి భవబంధాలను తెంచుకోమని ఉపదేశించిన శివుణ్ణే ఉన్మాదిని చేశావు. ఈ పార్వతీపతి విలక్షణమైన తత్త్వమూర్తి. నిర్గుణుడు. మాయాగుణాలైన రజస్సత్వతమో తమస్సులను లీలగా భావించే లయకారుడు. నువ్వు దేవేంద్రాది దేవతలకు సహాయం చేసేందుకని తెలివిగా శివుణ్ణే నా మీదకు ప్రయోగించావు. శివ కేశవులకు భేదం లేదనీ శివుడి కోరిక ఎంత అసహజమైనదైనా ఆయన అభీష్టాన్ని నేను మన్నిస్తానని తెలిసి...' విష్ణుమూర్తి చెబుతున్నది పూర్తి కాకుండానే నారదుడు మధ్యలో అందు

కుని-

'నారాయణ నారాయణ' అన్నాడు.

ఈ లోపున శివుడు విష్ణుదేవుడి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ 'లక్ష్మీపతీ! నేను చూడలేదుగాని నారదమహర్షి చెప్పాడు. మోహిని అందం భువనైక మోహనమైన నీ నవ్వులాగ, ఆమె నేత్రద్వయం నీ విశాల భావాలలాగ, ఆమె కంఠస్వరం నీ సంగీతం లాగ, ఆమె అందెల రవళులు వైకుంఠంలో మోగే జేగంటల్లాగ వుంటాయటకదూ!

ఒక్కసారి చూడనీయ్. మోహినీ దర్శనంతో నా నేత్రాలకు సంతుష్టిని కలగనీయి' అని వేడుకున్నాడు.

మహావిష్ణువుకి శివుణ్ణి చూస్తే జాలేసింది. ఆయన ఉద్వేగాన్ని ఉపశమింపచేసేందుకైనా మోహినిగా మరొకసారి మళ్లీ మారక తప్పదనుకున్నాడు. ఆ క్షణమే ఆయనకు జరగబోయేదేమిటో స్పష్టంగా తెలిసిపోయింది. ఆయన నవ్వి నారదుణ్ణి దగ్గరకు పిలిచి 'మహర్షీ! మోహిని కంటబడగానే శివుడేం చేస్తాడో తెలీదు. విపరీతమైన ఆవేశంలో వున్నాడు. కామోద్రేకంతో ఆమెను కౌగలించుకున్నా కౌగలించుకుంటాడు..' అని ఇంకా ఏదో చెప్పబోతుంటే.

'పోనివ్వు స్వామీ! దానివల్ల జరిగే నష్టమేముంటుంది. అన్నాడు నారదుడు.

'బ్రహ్మచారివి. అంతకంటే నీకేం తెలుసు! ఆడ మగ ఆకర్షితులైతే కామాన్ని భోగాన్ని అనుభవించాలనిపిస్తుంది. ఇద్దరూ చక్రవాక మిధునాలయ్యాక...'

'ఆ.. అయ్యాక...'

'ఎప్పుడూ అయితే రసానందం కలుగుతుంది. ఇప్పుడుమాత్రం రసాభాసవుతుంది. నాకిష్టం లేదు. నేను మోహిన్ని కాను, కాలేను' అని స్పష్టంగా చెప్పాడు శ్రీమహావిష్ణువు.

పరిస్థితి చెయ్యిజారిపోతోందేమో అనిపించింది నారదుడికి. 'మహానుభావా! మహేశ్వరుడు కోరిన చిన్న కోర్కెను తీర్చడానికి నువ్వెందుకింతగా అభ్యంతరాలు చెబుతున్నావో తెలియడం లేదు నాకు. సన్నిహితులు, సహ ధర్ములు అయిన మీకే ఒకరి మీద ఒకరికి విశ్వాసం లేకపోతే ఇక సామాన్యుల మాట చెప్పేదేముంది?




సౌజన్యం, సహకారం త్రిమూర్తుల్లోనే లేకపోయాక లౌకిక జీవనుల్లో సామరస్యం, సదవగాహన లోపించాయని బాధపడడమెందుకు?' అన్నాడు కావాలనే కొంచెం నిష్ఠూరంగా.

శ్రీమహావిష్ణువు మౌనంగా గంభీరంగా కొంతసేపు వూరుకుని 'మహర్షీ! నేను మోహినిగా మారతాను. కాని ఆమెపట్ల ఎవరు అనుచితంగా ప్రవర్తించినా అందుకు నువ్వే బాధ్యత వహించాలి సరేనా?' అన్నాడు.

నారదుడు సరేనని తలూపాడు. మరుక్షణం మహేశ్వరుణ్ణి తీసుకుపోయి ఎత్తయిన బండమీద చాలా దూరాన కూర్చోబెట్టాడు. మోహిని ప్రత్యక్షం కాబోతోందని తెలియగానే ఆయన తనువు, మనసు పులకరించాయి. ఆమె సౌందర్యాన్నీ మాధుర్యాన్నీ వూహించుకుంటూ మహానందాన్ని పొందుతున్నాడు.

చూస్తుండగానే పరిసరాలన్నీ చిత్రంగా మారిపోయాయి. వైకుంఠం అదృశ్య

మైంది. వూల సువాసనలతో గుబా ళించే సుందర నందనోద్యానము వెలిసింది. అక్కడ మల్లె, మొల్ల, మాలతి చెట్లు మొగ్గలు విచ్చుకుంటున్నాయి ఎత్తయిన చెట్లమీద గూళ్లుకట్టుకున్న పక్షులు రకరకాల రాగాలు శృతి చేస్తున్నాయి. నెమళ్ల నడకలు, చిలకల పలకరింపులు, కోయిల కుహూ కుహూలు, వూలలోని మకరందానికై వచ్చిన తుమ్మెదల ఝుంకారాలు, వాటి విన్యాసాలు హృద్యంగా ఉన్నాయి. నేరేడు చెట్ల కొమ్మలనిండా వున్న నల్లటి పళ్లు కిందకు రాలి నేలమీదవున్న రాయి రప్పకు కొట్టుకుని ఎర్రబడుతున్నాయి. ఎంత చూసినా తనివితీరని దృశ్యం. ఆ వాతావరణంలో, ఆ చల్లగాలిలో, ఆ ఆకుపచ్చదనంలో, ఆ వూలరంగులో ఎంత హాయో తెలీదు!

శివుడు అలాగే చూస్తూ ప్రతిమలా కూర్చుండిపోయాడు. విష్ణుమూర్తి ఆయనను చూసి నవ్వుతున్నాడు. విష్ణుదేవుడే తన మందహాసాలతో, మధుర గీతాలతో, సంగీతాలతో, లాస్యాలతో, విలాసాలతో, ఉద్యానవనాన్ని నింపేస్తున్నాడనిపించింది శివుడికి. శ్రీహరి సన్నగా చల్లగా నవ్వుతూ వెలుగు తీగలా మిలమిల్లాడుతూ

## మణికంఠుడు

నల్లని దొంతర మేఘాలలో దోబూచులాడే నెలవంకలాగ అనిపిస్తున్నాడు. ఆయన చుట్టూరా పరుచుకున్న నీలకాంతి రాను రాను చిత్రవర్ణ రంజితమై కాంతిమంతమై, సొగసుల కుప్పై, అందాల భరిణై నిలిచింది.

ఆమెను చూస్తూనే శివుడు ప్రపంచాన్ని మరచిపోయాడు. ఆమె అడుగు తీసి అడుగు వేసినా, క్రీగంట చూసినా, బుగ్గలు సొట్టలు పడేలా నవ్వినా, మీన నేత్రాలు చక్రాల్లా గుండ్రంగా తిప్పినా శివుడి మనసంతా కలకలం, కోలాహలం, కదన కుతూహలం. ఆమెను గాఢంగా గుండెలకు హత్తుకుని ఆమె వొంటిని బిగుతుగా చుట్టేసుకుని పెనవేసుకుని, ఆమె స్తన వస్త్రాన్ని లాగేసి ఆమె పయ్యెద చింపేసి.. పరవశుడై, వివశుడై, స్మృతిలేని స్థితిలోకి జారుతున్నాడు పరమశివుడు.

హరహర! మోహ పారవశ్యం ఎంతటి అధః పతనాన్ని కలిగిస్తుంది. ఇంద్రుడైనా, చంద్రుడైనా, రుద్రుడైనా కామాన్ని జయించలేకపోతున్నాడంటే ఏమనుకోవాలి? శివుడు అంతెత్తు బండరాయి మీద నుంచి గభాలున కిందకు దూకి మోహిని వైపు పరుగెత్తబోతుంటే 'ఆగు! ఆగు!' అని నారద మహర్షి గట్టిగా కేకలు పెట్టాడు.

శివుడు వినిపించుకోలేదు.

ఉన్మత్తుడై ఆమె మీదకు దూకి తన బాహువులతో ఆమెను దగ్గరకు లాక్కుని తన బిగి కౌగిలిలో బంధించాడు.

ఆమె ముఖాన్ని దగ్గరకు లాక్కుని పెదవులను బలవంతంగా చుంబించాడు. దానితో శివుడికి మహోద్రిక్త స్థితి కలిగింది.

మోహిని తడబడుతూ 'ఈశా! నన్నొదులు. ఆడపిల్లమీద అఘాయిత్యం జరపడం నీకు తగదు' అంది. అలా అంటూనే అతన్నించి దూరంగా జరిగేందుకు విశ్వ ప్రయత్నం చేసింది.

భార్గవుడు వదిలిపెట్టలేదు.

ఆయనకు రేతః పతనం కాబోతోంది. తన్మయత్వంలో వున్నాడు.

సంహారకర్త అయిన శివుడి తేజం నేల మీద పడడం ప్రమాదకరమని గుర్తించి ఆ శివశక్తి బిందు సందోహాన్ని విష్ణుమాయా మోహిని తన దోసిటిలోకి తీసుకుంది.

[ఇంకా వుంది]



# పారంపరిక బంగరు విలువలు
# ఆప్కోతో సంక్రాంతి సంబరాలు

ఈ సంక్రాంతికి ఆప్కో అందించే డిజైన్ల రంగుల రవళి.
అద్భుతమైన పోచంపల్లి, గద్వాల్, నారాయణ పేట,
ధర్మవరం, కొత్తకోట మరియు వెంకటగిరి చీరెలు.
ఆకర్షక డ్రస్ మెటీరియల్, షూటింగ్స్, రెడీమేడ్స్ .....
వస్త్రాలంకరణ ఒక కళగా గుర్తించే వారికి.

**ఆప్కో శ్రేణి**

- సిల్క్ చీరెలు
- కాటన్ చీరెలు
- బ్లౌజు మెటీరియల్
- డ్రస్ మెటీరియల్
- పురుషుల వస్త్రాలు
- పిల్లల వస్త్రాలు
- గృహోపకరణ వస్త్రాలు
- ఫర్నిషింగ్ మెటీరియల్
- దుప్పట్లు

ఆప్కో షోరూములను దర్శించండి.



## 20% ప్రత్యేక తగ్గింపుతో






**ఆంధ్రప్రదేశ్ ఔన్నత్యపు నిలువుటద్దాలు ఆప్కో చేనేతలు**

పాలియెస్టర్ షూటింగ్స్ మరియు షర్టింగ్స్ పై 40% తగ్గింపు కూడ పొందండి.

జి. ఓ. ఎం. ఎస్. నం. 330 తేది 16/8/90 ఫైనాన్సు మరియు ప్లానింగ్ (F.W. A&L) డిపార్టుమెంటు వారిచే విడుదల చేయబడిన ఉత్తర్వుల ప్రకారం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగులు గెజిటెడ్ ఆఫీసర్లతో సహా ఆప్కోనుండి వస్త్రాలు కొనుగోలు చేయుటకై ప్రత్యేక పండుగ అడ్వాన్సును 31-3-1991 వరకు వినియోగించుకొనడానికి ఇప్పుడు అర్హులు.

AKSHARA(H):APCO:1468:91